# భారతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

మార్చి 1960

సంపుటము 37 : : సంచిక 3

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మార్చి 1960



## ఏప్రిల్ సంచికలో

# వార్తలు

## శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి కాలధర్మం

సుప్రసిద్ధ దేశభక్తులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు ఫిబ్రవరి 29 వ తేదీన చెన్నపురిలో పరమపదించారు. వీరి వయస్సు 77 సంవత్సరాలు. వీరు



కర్నూలు జిల్లాలో 1883 లో జన్మించారు. మద్రాసు విశ్వవిద్యాలయం ఎం.ఎ. పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. విజ్ఞానచంద్రికా గ్రంథమండలిని స్థాపించి సంయుక్త సంపాదకులుగా పనిచేశారు. 'స్వరాజ్య' పత్రికకు సంపాదకులుగా ఉండి, రాజద్రోహకరమైన వ్యాసం వ్రాశారన్న ఆరోపణపై 1908-11 మూడేళ్ళు కారాగారవాస శిక్షపొందారు. 1916 లో ఆంధ్రమహాసభ అధ్యక్షులుగ ఉన్నారు. 1920 నుంచి 30 వరకు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు. 1936 నుంచి ఆంధ్రదేశ గ్రంథాలయాధ్యక్షులు. 1946 నుంచి దక్షిణ భారత వయోజనవిద్యా సంఘాధ్యక్షులు. తెలుగువిజ్ఞాన సర్వస్వం సంఘసభ్యులు. తొలిరోజుల్లో కొంతకాలం ఆంధ్రపత్రిక సంపాదకులుగాను పనిచేశారు. వీరి రచనలలో అబ్రహాము లింకన్, ఢిల్లీదర్బారు, ప్రభుత్వము, చైనా జపాన్ ప్రళయము, గ్రీసు చరిత్ర మొదలయిన బహుళప్రచారం పొందాయి.

## భారత-చైనా సరిహద్దులపై చర్చ

భారత చైనా సరిహద్దులను గురించిన వివాదాంశాలపై చర్చలనిమిత్తం న్యూఢిల్లీకి రమ్మని భారత ప్రధాని నెహ్రూ పంపిన ఆహ్వానాన్ని చైనా ప్రధాని చౌ ఎన్-లై ఆమోదించారు. చర్చలు ఏప్రిల్ నెల మధ్యలో జరుగుతాయి.

## రాళ్లపల్లివారికి 'గానకళా ప్రపూర్ణ' బిరుదు

ఫిబ్రవరి నాల్గోవారంలో హైదరాబాదులో జరిగిన ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడెమీ సమావేశంలో శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు "గానకళా ప్రపూర్ణ" బిరుదుతో సన్మానింపబడ్డారు. స్పీకర్ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు శ్రీ శర్మగారిని చందనపుష్ప తాంబూలాలతో సత్కరించి శాలువ కప్పారు. శ్రీ కాశీ కృష్ణాచార్యులు ఆశీర్వదించారు. అధ్యక్షులు శ్రీ ఆర్. డి. రామకృష్ణరాజు, శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు మున్నగువారు శ్రీ శర్మగారి సంగీతశాస్త్ర పాండితీ ప్రతిభా విశేషాలనుగురించి ప్రశంసిస్తూ ప్రసంగించారు.

## కేరళలో నూతనమంత్రివర్గం

కేరళరాష్ట్రంలో శాసనసభకు కొత్తగా జరిగిన ఎన్నికల ఫలితం భారతిపాఠకులకు విదితమే. ప్రజాసోషలిస్టుపార్టీ నాయకుడు శ్రీ పట్టం థానుపిళ్లే ముఖ్యమంత్రిగా పదకొండుమందితో నూతనమంత్రివర్గం ఫిబ్రవరి నాల్గోవారంలో ఏర్పడింది. మంత్రివర్గంలో ప్రజా సోషలిస్టుపార్టీ ప్రతినిధులు ముగ్గురు, తక్కినవారు కాంగ్రెసువారు.

## కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెటులు

కేంద్రప్రభుత్వం 1960-61 సంవత్సరపు బడ్జెటును ఆర్థికమంత్రి శ్రీ మురార్జీదేశాయి ఫిబ్రవరి 29వ తేదీన పార్లమెంటులో ప్రతిపాదించారు. ఈ బడ్జెటులో 83 కోట్ల 90 లక్షల రూపాయల లోటురావచ్చునని ఆయన అంచనా వేశారు. ఇప్పటిపన్నుల ప్రకారం 896 కోట్ల 45 లక్షల రూపాయల రాబడి, 980 కోట్ల 35 లక్షలు ఖర్చు. కొత్తబడ్జెటులో రక్షణశాఖకు 272 కోట్ల 26 లక్షల మొత్తం కేటాయించబడింది అంటే నిరుటికంటే అదనంగా 28 కోట్ల 56 లక్షలన్నమాట.

రైల్వేశాఖామంత్రి శ్రీ జగజీవన్‌రామ్ ఫిబ్రవరి 17 న పార్లమెంటులో 1960-61 సంవత్సరపు రైల్వే బడ్జెటును ప్రతిపాదించారు. ఏప్రిల్ 1 వ తేదీనుంచి సరకుల రవాణాపైన, బొగ్గురవాణాపైన రూపాయికి ఐదు నయాపైసల అదనపుఛార్జీ విధింపగలమని, ఖనిజాల ఎగుమతికి, రైల్వేతపాలాశాఖ సైనికశాఖ వస్తువుల రవాణాకు ఈ హెచ్చింపు వర్తించదని మంత్రి అన్నారు. దీనివల్ల 14 కోట్ల అదనపు రాబడి కలుగుతుంది. ప్రయాణపు రేటులో మార్పులేదు. మొత్తంమీద 75 కోట్ల 70 లక్షల అదనపురాబడి ఉండగలదని ఈ అంచనానుబట్టి తెలుస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1960-61 బడ్జెట్‌ను ఆర్థికమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు ఫిబ్రవరి 20 వ తేదీన రాష్ట్రశాసనసభలో ప్రతిపాదించారు. ఈ బడ్జెటు అంచనాల ప్రకారం రాబడి 8213 లక్షలు; వ్యయం 8193 లక్షలు. అంటే 20 లక్షలు మిగులు తేలిందన్నమాట. కొత్తపన్నులేవీ విధించబడలేదు.

# నవోదయం!

శ్రీ బొడ్డు బాపిరాజు

ఘన దుఃఖిత మానసంబుల
స్మృతికి వచ్చెను ప్రాతగాయం
పాలిమారు వనాంగణంబుల
మ్రోగె న్యాయాన్యాయ వాదం
వినిరి విరహోత్కంఠిత మూర్తులు
ప్రేయసీ సందేశవార్తలు
హర్ష విభ్రమ హాసలీలల
అందగించు నవోదయం!
లాస్యగాన విలాస హేలల
సందడించు మహోదయం!

శౌర్యజీవుల సార్వభౌముల
రత్నమకుటము లూడిపోయెను
దుర్మతావేశ ప్రమత్తుల
మాల్చి శూలాగ్రముల కెత్తి
న్యాయమును నెలకొల్పు కొందాం!
నిన్న బానిస నేడు జాల్మల
పై వెలార్చెను జయపతాకం
కష్టజీవుల మేలుకోసం
కాంతివిభవుల నేలుకోసం
అరుగుదెంచె మహోదయం!

నేడు జీవితపథము మృత్యువు
నీలి నీడలు కౌగిలించెను
నేడు సత్యముకొరకు సాగెను
మనిషి మనిషికి మధ్యయుద్ధం
అవనిపై భూకంప మలిగెను
అంబరమునం దగ్నిరగిలెను
స్థైర్య పటుసం
అవసరంబు నవోదయం!

ధైర్యబల తారుణ్య రక్షకు
అనుపమంబు మహోదయం!

ఈ మహోదయ మిది మదీయ
ప్రేమమధుర స్వప్న ఖండము
అవును నీకిది అగ్నిగుండము
ఆ వెలుంగులు జలకమార్చును
జీవితపు నవపుష్ప వాటికి
ఓహాహా! ఓహో!
అల్లదే వినిపించుచున్నది
ఆశయాల వసంతగీతం
సకలమానవ సామ్యభావ
క్రాంతికైన నవోదయం!
కల నిరుద్యోగి జన విజయో
త్క్రాంతికైన మహోదయం!

ఈ నవోదయవేళ ఎడదల
నింపు నావేశంపు పొంగుల
దేశమును సరిక్రొత్త రంగుల
దిద్దితీర్పగ ప్రతిన సల్పుచు
బ్రతుకు బ్రతుకున నేయివన్నెలు
పరిఢవించే పసిడి కలలను
మేలుకొల్పుచు అమరజీవుల
వీరగాథలు జగము నెల్లా
మారుమ్రోయగ ఆలపిస్తూ
నేడు మనమిక సాగి ముందుకు
నడిచిపోదాం క్రొత్త పోకడ
నవయుగశ్రీ కచభరంబును
నలువుమీర నలంకరిస్తూ
నడచిపోదాం—నడచిపోదాం!
(ఒక కాశ్మీరీ గేయానికి అనువాదం.)

# చోడిగాని కలాపము డోంబీ ఉపరూపకమే

శ్రీ మూట్నూరి సంగమేశము, శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

భరతశాస్త్రములో 'బ్రహ్మ కుటిలకం దద్యా'త్తని ఒక వాక్యమున్నది. ఆ 'కుటిలకము' 'విదూషకోపయోగి'గా అభినవగుప్తులు వ్యాఖ్యానించినారు. అలనాడు ఆ బ్రహ్మదేవుడిచ్చిన వంకకర్ర ఈనాటికిని తెలుగువారివద్దనుండుటయే చోడిగాని కలాపములోని ఒక శాస్త్రీయమైన విశేషము. ఈ కలాపమునందు విదూషకుడు హాస్యమున కాలంబమై నాయకుడైనను వాని చేతిలో నిది చాల సహజమైన పరిస్థితిగా మనకు దర్శనమిచ్చును. మరియొక్కడను ఏ విదూషకుని చేతిలోను ఈనాడిది కనిపించదు.

ఈ కలాపమునందు ఎఱుకదంపతుల ప్రణయ కలహమే వర్ణ్యవస్తువు. చోడిగాడు నాయకుడు (సింగడు) తన్ను మరపించి ఎటో తరలిపోయిన నాయికను (సింగిని) వెదకికొనుచు పురుష విప్రలంభము కొంత అభినయించి చివరకామెను కలసికొని, ఆమెతో కొంత వాగ్వాదము నెఱపి ఇంటికి తీసుకొనిపోవుట— ఇందులో ఉన్న కథాగాఁకథ.

కూచిపూడి సంప్రదాయమువారు ప్రదర్శించెడి మూడు కలాపములలో భామాకలాపము, గొల్లకలాపము పోగా మూడవదీ చోడిగానికలాపము. భామాకలాపము సంపాదించిన గౌరవము వస్తుదృష్టితో దీనికి రాకపోయినను గొల్లకలాపమునకేమియు తీసిపోవునది గాదు. నాట్యసృష్టికి తక్కిన రెండు నెంతయో ఇదియు నంతే. దీనికి సంబంధించిన పలువిషయములను చర్చించుటకు ముందు ఆ కథాంశముల ప్రవర్తనపద్ధతి నించుక గచ్ఛద్వ్యాఖ్యా సహితము చిత్రింపుదు.

ఈ కలాపమును ప్రదర్శించుటకుముందు పూర్వరంగమును లఘుప్రక్రియగానే నడుపుదురు. మిగత రెండు కలాపములలోను పూర్వరంగము సాంగోపాంగముగా విస్తరముగ నుండును. ఇందులో వేరుగా హాస్యగాడు ఉండడు. నాయకుడే హాస్యమున కాలంబము. కనుక తాళిగాళ్లలో ఒకడు, రథతాళగాడు పారిపార్శ్వకుడుగా ఉపయోగపడి కలాపములో నాయికానాయకులకు తోడ్పడుచు, ప్రశ్నలు వేసి, కథాసంధులు విడగొట్టి, సభవారికి ప్రత్యక్ష ధోరణిలో పాత్రలను కథాంశములను స్పష్టముచేయుచు, నటుల కూహలందించుచు, ముందు కార్యక్రమమునకు దోహదము చేయుచుండును.

ఈ కలాపముగూడ మూడు ప్రధాన ఘట్టములుగా నడచును. ప్రక్కనున్న భార్య రాత్రికి రాత్రి పారిపోగా ఆమెను వెదకికొనుచు వచ్చిన చోడిగాడు భార్యావిరహముతో విలవిలలాడుట తొలిఘట్టము. ఈ చోడిగాడే సింగడు. సింగడు:

'వచ్చెనమ్మా చోడిగాడు
చంకలోనూ వంకకర్ర
చేతిలోనూ చింకి జోలె'...॥వచ్చె॥

అని ప్రావేశికీ ధ్రువపాడుచు ప్రవేశించును. తెర బయలుదేఱు ఈ తంతు కాగానే తన పరిస్థితిని విపులముగా వర్ణించి చెప్పును. తాను సింగడ నగియు సింగి తన ప్రేయసి యనియు చెప్పి తాను 'నిదురించి పరాకున పరుపుపై దడవ సింగి గానరాకున్న ఉలిక్కిపడి, దిగ్గన లేచి, దిక్కులం బెదరిచూచి, అంగనా భంగ వెడలితివని గొంగళిం దులుపుచు, పెక్కుగతుల మక్కువలు తలపోయుచు, పొక్కుర దడుముచు, కేలంగోల గీలించి' ఆమెను వెదకుచు వచ్చినట్లు చెప్పును. 'సుందరీ ఎందు బోయితివే' అని ఆమెను వెదకుటతో ఈ ఘట్టము నిజమైన ఆరంభము నందుకొనును.

సింగి కనబడదు. సింగనికి స్మరార్తి ఎక్కువగును. ఈ పట్టున పురుషపరమైన విప్రలంభము పుష్కలముగా నభినయింపబడును. ఈ ఘట్టమున ప్రబంధ రచనలెన్నో పాడదురు. తారాశశాంక విజయము మొదలైన గ్రంథములలోని పద్యములు తరచుగా వినబడును.

సింగ డడవిలో సింగిని వెదకుచు, వేటాడుచు పోవును. ఆయా మృగములు పక్షులు లభించినపుడు ఆయావాని కధిదేవతలైన దేవీదేవత లందరను సింగిని చూపుడని ప్రార్థించును. ఈ ఘట్టమున ముఖ్యముగా ఆఖేట నృత్యము ప్రదర్శింపబడును.

తర్వాత సింగడు దశావతారాలు ధరించిన ఆ నారాయణమూర్తినే ప్రార్థించును. ఈపట్టున దశావతా

రాభినయము జరుగును. ఇది బహుశః కూచిపూడివారు కొవలెనని కూర్చుకొన్న ఘట్టము కావచ్చును.

ఆపైని రామాయణ గాథ అంతయు స్మరించి శ్రీరాముని వేషుకొనును. ఈ నెపముతో రామాయణ గాథ నభినయింతురు. ఇదిగూడ పదాభినయము ప్రధానముగా నున్న ఘట్టమే. కాని కొందఱీ ఘట్టము నభినయింపరు. మఱికొంద ఱింకేవియో, కాలక్షేపమునకు, కథా గేయములు పాడి అభినయింతురు. సింగడు పిదప చంద్రోపాలంభ నాదులన్నియు వరుసగా చేయును. చివరకు స్మరార్తిచే తూలిపోవును. దీనితో మొదటి ప్రధానఘట్టము ముగిసిపోవును.

సింగడు తూలిపోయినపిదప సింగి ప్రవేశించును. 'ఎఱుకో ఎఱుక' అని ప్రావేశికీ ధ్రువపాడి తెరబయలు దేరును. ఈ తెర బయలుదేరు తంతు భామాకలాపములో వలె గాక చాల సంక్షేపముగా జరుపుదురు. రెండవ ముఖ్యఘట్ట మిక్కడనుండి ప్రారంభమగును. సింగి పారిపార్శ్వకుని ప్రశ్నలకు సమాధానముగా తన కుల గోత్రములు, వృత్తి, విద్యావిలాసములు, వన్నెచిన్నెలు, అన్నియు నేకరువు పెట్టును. సింగని వర్ణించును. ఇంతలో సింగడు తిరిగి ప్రవేశించును. సింగిని చూచి పట్టరాని సంతోషము కలిగినను అది బయటపడనీయక పౌరుషము నెఱపి పరువు నిలబెట్టుకొనుట కన్నట్లు ఆమెతో వాగ్వాదమునకు దిగును. ఈ సతీపతుల సంవాదము నీచజాతి నాయికానాయకుల ప్రణయకలహమగుటవలన కొంత విరసముగానుండును. ఇది భామాకలాపమున గానుపించు 'ఉక్తప్రత్యుక్తక' మను లాస్యాంగమే కాని ఇందు ఇద్దరు పతతులు బగులఁగా ఆలుమగలే వాదించుకొందురు. ఆ వారి సంవాదధోరణి కొన్నిచోట్ల సరసమైన ఆటవెలదులుగ కందాలుగా సాగును చూడుడు:

చోడిగాడు: "మనసురాకపోతె మురు పెదంగనె సింగి
అనుములంటినోరు ఆగలించి
కల్లెమంటి బిగ్గ కరడియు బట్టితే
కొరడ దెబ్బలనుచు ఎఱుగవటవె.

సింగి: కొరడ దెబ్బలను మఱిమఱి బలికేవు
తరముగాదు నాదు దరికి రాకు
మురువు పరువులేని పురుషత్వ మేల నీ
సరసమెల్ల నాపు చాలు పోర.

చోడిగాడు: మాలమెఱుగ కీవు చాలని బల్కేవ
దేల సింగి నిను నోలిగట్టి
పాలివారు నన్ను గేలిపెట్టినగాని
పాలపాపననుచు బలుకలేదె.
దండిగాను గుడిసె పెండెన్నియు నీసి
వండి వండి కూడు వార్చలేదె?
కొండమీద సింగ డుండునో యని
పల్కు నట్టిసింగి నీకు గుట్టులేదె?

సింగి: గుట్టుగాక పోతె నట్టన నడవిలో
కొట్టవచ్చినట్టి గుణము నీది.
నట్టిమాటలేర, వద్దు నినొల్లను
బుట్టతోడు నమ్మ పొమ్ము సింగ!

చోడిగాడు: సింగీ ననుజూచితె, నే
వంగజుడను రూపురేఖలందును మరు నా
సంగతి నీ విటులైతివి
గంగను న్యాయంబుగాను గట్టిగ సింగీ!

సింగి: చేకురలె నుండు మీసాలు, చీపికళ్లు
చింకి తలగుడ్డ, గొంగళి చంక బెట్టి
కప్పపోక్కుడి పొగసిద్ద వొప్పజూచి
నయమె నిన్నంగజుడవన్న నవ్వరటర!"

ఈ పద్యములలో అవశత్వ గుణము గుడులయేగాక కంద మున వలెనె కొన్నిట ప్రాస నిర్వహింపబడుట గూడ గమనింప దగినది. ఈవిధముగా సంవాదము జరిగిన వెనుక సింగి పోవయలుక దీరుట, పొత్తు కుదిరి సింగియు సింగడు నింటికి పోవుటతో మూడవ ప్రధానఘట్టము నచ్చి కథ ముగిశాంతిమగును.

## విశేషములు

ఈ కలాపమును రాత్రి నాలుగు జాములును ఆడుదురు. నాయకుడే హాస్యమున కాలంబనము. రసాభాస శృంగారము, ప్రణయకలహ ఘట్టములు ముఖ్యములు. కథ వియోగముతో ప్రారంభమై సంయోగముతో ముగియును. ఈ కలాపము చూడగా మిగిలిన కొరవంజి రచనలలో కనిపించు ఎఱుకదంపతుల సంవాదమే అవతారనాట్యము, రామాయణము, ఆఖేట నృత్యములుగా పెంపైనవని తోచును. ఇందులో జక్కిణీ చిందు వగైరా విశేషనాట్యములును ఆయా సందర్భములలో ప్రదర్శింపబడును. చెంచుదంపతుల నృత్యము కొంత ఉద్ధతముగా సాగును. చోడిగాని చేతిలోని వంకకర్ర బ్రహ్మదేవుడిచ్చిన వంకకర్రయని తొలుత నే మనవి చేసితిని. కాదంతే, వంకకర్ర మరల బొమ్మలాట వారిలో 'నాయకుని' వద్ద మాత్రమే మనకు కనబడును

గాని విదూషకుని చేతిలో మాత్రమెక్కడను గాన్పింపదు.

## నృత్యము

భామాకలాపము వలెనె చోడిగాని కలాపము గూడ నృత్యరూపకము. నృత్తమున కిందులోను చోటు లేదు. నాయిక ఖండిత యగుట వలనను ప్రియసాన్నిహిత్య ముండుటవలనను, ఔత్సుక్య చింతా విషయములు నిరూపించు నాట్యము గనుకను నృత్తము వర్జ్యమైనది. కాగా అంగ నివృత్తిలోను, వర్ణనివృత్తిలోను, సతీపతులలో మదనాంకూరమైనపిదపను కొంత నృత్తము ప్రదర్శింపబడును. ఇది ఉద్ధత లాస్యకోటికి చెందును. సందర్భానుసారముగావచ్చు ప్రత్యేక నృత్యములెన్నో ఉండును.

## హాస్యము

సాధారణముగా నీకలాపములలో సూత్రధారుడే విదూషకుడు. కలాపములందు కనబడు హాస్యము పాండిత్యము, ప్రతిభ అనువానితో పుట్టి వచ్చునది. ఇందు తాత్కాలికమైన ప్రజ్ఞ విద్యుత్తీవ్రముగా గనబడును. రంగములనడుమ (కథాంశముల నడుమనే గానిండు) హాస్యగాడు చెప్పెడి జాత్యములు అసభ్యముగా నుండవచ్చును. కాని కలాపమున పాత్ర గతమైన హాస్యము మాత్రము ఆ స్థాయికి దిగజారినది కానే కాదు. ప్రేక్షకుల అభిరుచిని అలరించుట కొఱకు కొంత సగుమట్టములో హాస్యము ప్రవర్తించినను అది వైయక్తికమే గాని సార్వత్రిక మన వీలులేదు. భామాకలాపమునందును, గొల్లకలాపమునందును కావలసినంత హాస్యము, సభ్యముకూడ నున్నది. కాని చోడిగాని కలాపమున నాయకుడే హాస్యమునకు మారాకు. ఇది ముఖ్యముగా కథాగతమైన, వస్తుగతమైన, సన్నివేశగతమైన హాస్యము. రసాభాస శృంగారమువలన కలుగు హాస్యము మెండుగా నుండనక్కరలేదు. చెప్ప వచ్చిన దేమనగా చోడిగాని కలాపముననే గాక తక్కిన కలాపములలోను వస్తుగతమైన హాస్యము సంస్కరణకు లొంగి చక్కగా తేటగా తీరిరాగలదని మాత్రమే. ఇంతకును హాస్యము కొరకై ప్రయోగించు హాస్యము అంతమేలుగా నుండదు. ప్రకారాంతరముగా శృంగారము రసాభాసయగుటవలన కలిగినదో, సన్నివేశ జనితమైనదో అయినచో తేటగానుండి మనస్సు నలరించును.

## గ్రంథము

చోడిగాని కలాపమునకు సంబంధించిన గ్రంథమునుగూర్చి తడవుకొనుముందు తత్సదృశరచనలగూర్చి యించుక చెప్పవలసియున్నది. చెంచునాటకము, ఎఱుకలకథ, ఎఱ్ఱగొల్లల భాగవతము, మొదలైనవాని కన్నిటికిని మూలము చెంచులక్ష్మీ - నృసింహుల ప్రణయగాథయే చోడిగాని కలాపమునకును ఆధారభూమి. ముందు చెప్పినవానిలో లక్ష్మీనృసింహుల వివాహమునకుబదులు ఎఱుకదంపతుల ప్రణయకలహమో, మానమో వర్ణ్యవిషయముగా నుండును. ఎన్నో కొరవంజిరచనల కీరీతి ప్రణయకలహమే ముఖ్యవస్తువు. కొన్నింటిలో కథ పౌరాణికముగా నారంభించినను కొరవంజి (ఎఱుకత) పాత్ర ప్రవేశించినదాది కథ ఎఱుకలకథగానే పరిణమించి కొరవంజి కొరవనాయకుల (సింగి సింగళ్ళ) కలయికతో మంగళాంత మగును. తొలుత ప్రారంభించిన కథకూడా చివరకు విస్మృతమగుటయో లేక యథాలాభముగా ఒకటిరెండు మాటలలో ముగింపునకు వచ్చుటయో జరుగును. మరికొన్ని రచనలలో నాయకుడే కొరవంజివేషమున నాయికవద్దకుపోయి సోదె (గద్దె) చెప్పునెపముతో కొంత ప్రచ్ఛన్న ప్రణయము నెఱపుటయూ కద్దు. రామనాటకమున రాముడు ఎఱుకతవేషమున సీతకు సోదె చెప్పబోయినట్లు కల్పనయున్నదన్నచో ఈ పద్ధతికిగల ప్రాచుర్యమెట్టిదో ఊహింపవచ్చును. అయినా రచనల కన్నిటికిని మూలము మొదట చెప్పిన చెంచులక్ష్మీ నృసింహుల వివాహగాథయే అది తెలుగులో గరుడాచల మాహాత్మ్యమను పేర క్రీ. శ. 1500 ప్రాంతమున ఓబయమంత్రిచేత యక్షగానముగా వ్రాయబడినది. దొరికినంతవరకు దాక్షిణాత్యభాషలలో ఇదే ఇప్పటికి కొరవంజులలో ప్రాచీనకృతి యని చెప్పవచ్చును. తక్కినవి దీని కనుకరణములు, విస్తరములు మాత్రమే.

మన ఈ చోడిగాని కలాపమునకు ఎఱుకలకథ అనికూడ పేరు. తంజావూరు సరస్వతీమహాల్ లైబ్రరీలో పారిజాతములకట్టలో చెంగల్వరాయడు వ్రాసినట్లు 'ఎఱుకత కథ' అను పేరుతో ఒక రచన ఉన్నది. దాని ప్రారంభమున సరస్వతి ఎఱుకత వేషమున వచ్చినట్లు వ్రాయబడినది. కాని అది ప్రయోగమున కాన్పింపదు. తక్కిన తంతులో అంత భేదము లేదేమో పరిశీలనమీదగాని చెప్పుటకష్టము. మఱి, మేముచూచి

నది అరవెల్లి వేంకటార్యుడు వ్రాసిన గ్రంథము అది సిరిపురము వల్లభరాయులకృతితో నున్నది. దొరికిన కలాపగ్రంథములు వేరు వేరు రచయితల, ఆశ్రయదాతల ముద్రలతో నున్నవి. ఈ కలాపమును వ్రాసినవారిలో చెంగల్వరాయకవి, అరవెల్లి వేంకటార్యుడు, వంకాయల బలరామభుక్త, గోడవర్తి జగన్నాథము మొదలగు వారి రచనలు ప్రసిద్ధములు. అన్నింటిలోను కొన్ని పంక్తులు యథాతథముగా దొరలుచుండును. కనుక, వీటన్నిటికి మూలమైన రచన ఏదో ఒకటి ఉండిన దనియు దానికి వలసినమార్పులు, చేర్పులు మాత్రమే వీరందరు చేసియుందురనియు నూహింపవచ్చును. కాక, కలాపము లన్నియు సంకలన గ్రంథములే. ఈ చోడిగాని కలాపమున తారాశశాంక విజయాది ప్రబంధములలోని పద్యాలు ఎన్నో ఆయా సందర్భములలో జోడింపబడునని కొంతముందు మనవిచేసితిమి.

## షిద్గక—డోంబీ

ఇక ఈ కలాపముకూడ భామాకలాపము శ్రీగదిత మైనట్లు, గొల్లకలాపము భాణిక అయినట్లు ఉపరూపకముల కోవకే చెందుననుట తథ్యము. కాని ఇదే యుపరూపక మన్నప్పుడుమాత్రము కొంతచర్చ రాక తప్పదు. దీనిని పరించి పరిశీలించునపుడు ఇందులో నాయికానాయకుల పేర్లనుబట్టి మేము తొలుత 'సింగకము' లేదా 'షిద్గక' మని అనుమానించితిమి. అది కొంత వరకు సరిపడునుగూడ.

"సఖ్యాః సమక్షం భర్తుర్యద్గుద్ధతం నృత్తముచ్యతే,
మసృణం తు క్వచి ద్ధూర్తచరితం షిద్గకస్తు సః"

అని అభినవభారతి – ఈ లక్షణము చోడిగాని కలాపమున కన్వయించుటలో చిక్కు లేదు. కాని వేరు ఆటంకముకూడ నున్నది. ఈ కలాపమున సింగి సింగని గూర్చి చేయు వర్ణననుబట్టి ఇది భాణమని గూడ ననవచ్చును. చెంమరాలు నృసింహుని సాహసకృత్యములు వర్ణించుపట్టున చెప్పనగు

"నృసింహ సూకరాదీనాం వర్ణనా జల్పయే ద్యతః,
నర్తకీ తేన భాణః స్యా ద్ధుద్ధతాంగ ప్రవర్తితః."

అనువ దింపుల కాపుగా నిలువగలదు. ఈ యవకాశము నాక్షేపముగా బరిగణింపక పోయినను అలంకారికుల కొన్ని పరిగణనలే షిద్గకమనుటకు అడ్డువచ్చుచున్నవి. 'షిద్గక'మును భరతకోశము 'శిల్పక'మని వ్యవహరించుచున్నది. అందు నాలుగంకములు, ఇరువది యేడంగములు నుండవలెనని వ్రాసినారు. ఇంక వివన్నియు 'ఉల్లాప్య'మున నుండవని శారదా తనయుడు భావప్రకాశనమున వ్రాసినాడు. సాహిత్యదర్పణము లోని శిల్పక ఉల్లాప్యకముల లక్షణము ఉటంకించి వాని ప్రసక్తి తీర్చివేయుదుము,

"శిల్పకమున నాలుగంకములు, నాలుగు వృత్తులు, శాంతహాస్యములు తప్ప కడమరసములు. నాయకుడు బ్రాహ్మణుడు. ఇందు శ్మశానాది వర్ణనముండును. ఉపనాయకుడు తక్కువవాడు. ఇరువదియేడంగములు కలుగును. అవియేవన: ఆశంస తర్కము, సందేహము, తాపము, ఉద్వేగము, ప్రసక్తి, ప్రయత్నము గ్రథనము, ఉత్కంఠ, అవహిత్థ, ప్రతిపత్తి, విలాసము, ఆలస్యము, బాష్పము ప్రహర్షము, ఆశ్వాసము, మూఢత, సాధనానుగమము, ఉచ్ఛ్వాసము, విస్మయము, ప్రాప్తి, లాభము, విస్మృతి, సంఫేటము, వైశారద్యము, ప్రబోధము, చమత్కృతి అనునవి. స్పష్టములుగావున వీనికి లక్షణము చెప్పలేదు."1

చోడిగాని కలాపమున నాయకుడు బ్రాహ్మణుడుగాడు. ఉపనాయకుడు లేడు. రసము రసాభాస మూలమైన హాస్యము—శ్మశానాది వర్ణనము లేదు. ఈ శిల్పక లక్షణము కుదురదనుటకివి చాలును.

ఇంక 'ఉల్లాప్య' లక్షణమిట్లున్నది. "ఉల్లాప్యమున నాయకుడు ఉదాత్తుడు. వృత్తము దివ్యము. అంకము ఒకటే. శిల్పకమునందలి అంగములును హాస్యశృంగార కరుణరసములును ఒప్పును. కొందరిమతమున ఉల్లాప్యము పెక్కుయుద్ధములతో నొప్పును; అగ్రగీతముచే మనోహరమగును; అందు నాయికలు నలుగురు; అంకములు మూడుండును."2

ఉదాత్తనాయకుడు, దివ్యవృత్తము—ఇంవలి మతభేదము చోడిగాని కలాపమునకు దీనిప్రసక్తిని తొలగించుచున్నవి.

ఇంతకును 'షిద్గక' శబ్దమునకు విటుడని యర్థము. సింగడు కోడెకాడని యనుట తగునన్నను రూపక సామాన్యమైన లక్షణము నొక ప్రత్యేక పాత్రకో, కలాపమునకో పరిమితముగా చేయుట భావ్యము గా తోపదు. ఆచార్య హేమచంద్రుడు 'డోంబికా, భాణ, ప్రస్థాన, భాణికా, సింగిక, రామాక్రీడ, హల్లీసక, శ్రీగదిత, రాసక, గోష్ఠీ ప్రభృతీని గేయాని' అనుచు, 'పదార్థాభినయ ప్రధానాని స్వభావాని డోంబికాదీని గేయాని

1 వేదమువారి అనువాదము.

2 వేదమువారి అనువాదము.

రూపకాణి చిరంతనై రుక్తాని' యనుటచేత దీనిని 'పదార్థాభినయ ప్రధానమైన నృత్యభేదముగా పరిగణించి యూరకుండుట సులభమే. మరి శారదా తనయుడుకూడ భావప్రకాశమున నృత్యభేద వివరణాధ్యాయమున ఈ యుపరూపకములగూర్చి చర్చించినాడు. ఆయన వ్రాసిన

'అంగై రుపాంగైః ప్రత్యంగైః
గీతమాత్రానుగామిభిః,
పదార్థాభినయో నృత్యం
డోంబీ శ్రీగదితాదిషు."

అనుదానినిగూడ స్మరింపవచ్చును. అది యట్లుండగా

"ఛన్నానురాగగర్భాభి రుక్తిభి ర్యత్ర భూపతేః,
ఆవర్జ్యతే మనః సాతు మసృణా డోంబికామతా."

అని అభినవ భారతి చెప్పుచున్నది. 'ఛన్నానురాగ గర్భోక్తి'ని ప్రధానముగా పాటించినచో చోడిగాని కలాపము 'డోంబి' అగును. పై లక్షణమువలన కొరవంజి నాట్యము భూపతుల మెప్పించి కులుకు దర్బారు నృత్యములలో నొకటిగా కన్పించినను, కథాగతముగా తన ప్రియుని మెప్పించి కులుకుట ప్రకారాంతరమున భావ్యమే నని పించును. ఆ పక్షమున సింగి నాట్యము డోంబికా నృత్యమే అగును. ఇంతియును అదంతయు ప్రణయ కలహమే గనుక ఛన్నానురాగము పుష్కలముగా నున్నదే. మరియు డోము-డోంబ శబ్దములకు నీచకులజుని మాత్రమే అర్థము. ఆ యర్థ మీ చోడిగాని కలాపమున నాయికా నాయకులకు సరిపోవుచున్నది. సింగక నామౌచిత్యము కుదిరినను పిద్దక నామౌచిత్యము కుదురకపోవుటచేతను, లక్షణమున పట్టిన దానికంటె పట్టువిడె యెక్కువగుటచేతను డోంబికా లక్షణమునుబట్టి నామౌచిత్యము, ఛన్నానురాగము, పదార్థాభినయ ప్రాధాన్యమునకు ముప్పు లేకపోవుట అను కారణములచే ఇది డోంబిక యనియే మా యభిప్రాయము. కానినా డిది సింగిక, డోంబికా లక్షణములు చేరిన మిశ్రరచన అనుకొనవలసియుండును.

ఈ డోంబికా భాణికలకు సారూప్య మెంతైన నున్నది. శారదాతనయుడు భావప్రకాశనములో నిట్లు చెప్పినాడు.

'డోంబ్యేవ భాణికోదాత్తనాయికైకాంకభూషితా,
కైశికీ భారతీప్రాయా వీరశృంగార మేదురా
శ్లక్ష్ణనేపథ్యభాక్ మందోత్సాహా పురుషనాయకా,
అంగాని తస్యాస్సప్త స్యుః కామదత్తా యథాకృతా.'

డోంబిక భాణికా ప్రాయమనుకున్నపుడు అందలి భేదాలుకూడ గమనించవలసి వచ్చును గదా! అది శుద్ధ సంకీర్ణ మిశ్రములని మూడు విధములు. మరల ప్రస్తారవశమున నవి ఉద్ధత, లలిత, లలితోద్ధతములని మువ్విధము. మన చోడిగానికలాపము లలితోద్ధతకక్ష్యకు చెందినది. శారదాతనయుడు డోంబీ భాణభాణికాదుల కన్నింటికిని గలిపి అంగము లిట్లుదాహరణపూర్వకముగా చెప్పినాడు:

'ఉత్కంఠా మానసస్యాపి తత్ప్రశ్నేయ మితీర్యతే,
అవహిత్థం తదేవ స్యా ద్యత్నాణే ర్న నివారితః.
ఇత్యాది (?) ప్రణయకోపాచ్ఛాదనం తద్విభావ్యతే
స ప్రయత్నాఽనిరుద్ధస్య దర్శనే చిత్రలేఖితా.
దంపత్యో ర్యోగసంపర్క ప్రార్థనాశంసనం భవేత్,
యథానులేన కాంత్యాచ వయసేత్యాది కథ్యతే.
వితర్కః కోస్వి దిత్యాది దుష్యంతవచనం యథా,
కి మేషా కౌముదీ కిం వా లావణ్యసరసీ సఖే.
ఇత్యాది రామా రాధాయాం సంశయః కృష్ణభాషితే,
విశేషోఽనుశయోక్తే య స్సంతాప ఇతి కథ్యతే.
తం వినా కైకయీపుత్ర మితి రామేణ భాషితమ్,
ఉద్వేగో హా హతా స్మీతి కపింజలవచో యథా.
మాధుర్యం ప్రసగియ మిత్యాది మదజేనాపి భాషితమ్,
అంగాని చందనాంభోధిః సించేత్యాదివచో యథా.
వైవర్ణ్యం యన్మనోజ్ఞానాంత వాలస్య ముదాహృతం
తద్దృశ్యతే పరీవార ప్రార్థనాభిః ప్రియాస్వితి.
మనసశ్చింతనం సంపోఽకాండో నా కామతో భవేత్,
అకామోపగతే నైవ సాధ్వోరిత్యాది నోచ్యతే.
యథా వామేన వానీర మిత్యాద్యనుగతి స్స్మృతా,
యద్వైన కులపత్యంకే దోర్దండాః క్వేతి విస్మయః.
ప్రాణై స్తపోభి రిత్యాది య స్వచ స్వాననం భవేత్,
ఆశ్వాసనం విహ్వలస్య యత్స ఉచ్ఛ్వాస ఈరితః.
ప్రీతి ర్న్యాసు సవస్యానా మిత్యాది వచనం యథా,
క్రూరక్రమ కృత త్రాసః సుకుమారస్య కస్తునః.
యస్న హింక ఇష్వక్తో గాహో శ్చంద్రకలాదిగత్.
యథా సీతాప తత్రాసే త్యాదావపి చ దృశ్యతే.
శూన్యతా విస్మృతిస్సర్వకర్మణాం సర్వదా స్మృతా
మానవస్య పరిచ్ఛేదాతీ ఇత్యత్ర దృశ్యతే.
ప్రలోభనం గుణాఖ్యానపూర్వ మిష్టార్థ లంబనమ్,
విజిత్య పృథివీం సర్వ మిత్యాదా తద్విలోక్యతే.

# చోడిగాని కలాపము డోంబీ ఉపరూపకమే

నాట్యం స్వపౌరుషోత్కర్ష వేశస్య ప్రతిపాదనమ్,
తద్రామోఽహం యదిత్యాది మహానాటక కల్పితమ్'

ఇంత చాలును. ఇట్లే సంఘాటము. ఆశ్వాసము, ప్రమదము, ప్రమాదము, యుక్తి, ప్రరోచన, ప్రశాస్తి అను వానిని గూడ చెప్పి చివరకు

'ఆనుషంగిక మేతేషాం లక్షణం తత్ర దర్శితమ్,
డోంబీ శ్రీగదితం భాణో భాణీ ప్రస్థాన రాసకాః,
కావ్యంచ సప్త నృత్యస్య భేదాః స్యుస్తేపి భాణవత్,
ఇత్యాహుః కేచిదన్యే తాన్సర్వాన్నృత్తాత్మకాన్విదుః

అని అధికారసూత్రము గంటిబది వ్రాసినాడు. ఇవన్నియు ఆయా ప్రాంతములకు చెందిన దేశీయ నృత్యములను పోలియున్నవగుటచేతనే

'నృత్యప్రాధాన్యతో నాట్యప్రయోగో రూపకాదిషు,
ప్రయోగ స్తోటకాదీనాం నృత్యప్రాధాన్యతో భవేత్.
ఉభయత్ర ప్రయోక్తవ్యం దేశరీతియుతం నటైః,
విశేషత స్తోటకాది దేశరీతిను దుచ్యతే.
దేశభాషా క్రియాయుక్తం గీతే వాద్యే చ నర్తనే,
తోటకాది ప్రయోక్తవ్యం నటై ర్నాట్యవిశారదైః.
దేశాన్ పృథక్ విజానీయాన్నట స్తద్రీతి విత్తయే.'

అని చెప్పి ఆయా దేశవిభాగాల 'జాగ్రఫీ' చెప్పబోయినాడు. ఈ ఉపరూపకముల మత మతాంతరములన్నియు పూసగ్రుచ్చినట్లు చెప్పి ఆ పనకూడ బహుశః విసిగి—

'ఇతి నానామతేనోక్తా నృత్యభేదాః ప్రదర్శితాః,
వైకల్పికం లక్ష్మ తేషాం నక్వచిచ్చ నిషిధ్యతే.'

అని వీని నేపేరుతో పిలిచినను, ఎవరెట్లు ఆడినను అంగీకరించవలసినదే కాని నిరాకరించుట కనికిరాదనియు, వాడుకలో లేదనియు నన్నట్లుగా ననెను.

ఈ ఉపరూపకముల లక్షణములను శాస్త్రకారులే సరిగా చెప్పలేదు. ఇవన్నియు నానాటి జానపద నాట్యము లగుటచేత వీనికి సంస్కృతభాషలో లక్ష్యములు కొంచెము ఇంచుమించు మృగ్యములైనవి. ఆలంకారికులు చెప్పిన లక్ష్యములుకూడ ఇప్పుడు దొరుకవు. అవి మూలమున దేశభాషలోనివో కూడ మనకు తెలియదు. ప్రాదేశికముగానుండిన ప్రయోగ భేదములనుబట్టి లక్షణకర్తలు యే ఒకటి రెండుమాటలతోనో తమపని ముగిసిన దనిపించుకొన్నారు. అది కారణముగా ఒకే ఉపరూపకమునకు వేరు వేరు లాక్షణికులు వేరు వేరు విధాల లక్షణము చెప్పిన పట్లున్నవి. రాసక, నాట్యరాసక లక్షణములు చూచినచో నీ మతాంతరములు స్పష్టమగును.

ఉన్నంతలో, చోడిగాని కలాపము డోంబిక అనవచ్చుననుట మా మతము. సింగక—డోంబీ లక్షణములు కలిసిన మిశ్రరచన అనుటకంటె డోంబిక అనుటకే లక్షణకర్త చెప్పిన అంగముల పరిశీలన మొగ్గు చూపుననుట మాకు తోచిన మాట.

## సోలిగాడు

ఈ కలాపమున సింగడు నాయకుడు. కాగా దీనికి చోడిగాని కలాపమను పేరెట్లు వచ్చినదను ప్రశ్న యొకటి పుట్టును. రాయలసీమ ప్రాంతమున ఈ చోడిగాడు సోలిగాని వ్యవహరింపబడును. పెండ్లి పందిళ్ళలో ఫలానావాడు సోలిగానివలె పెండ్లికి వచ్చినాడనిగాని, సోలిగానివలె తిరుగుచున్నాడనిగాని తరచు వినబడు మాటలు. భార్యా సహితుడై రాలేదనిగాని, భార్యను వెదకుకొనుచున్నాడనిగాని, క్రమముగా నా పరసహాస్యమున కర్థము. రాయలసీమలోని ఈ హాస్యప్రాచుర్యము, ఈ కథకు గల వ్యాప్తిని ప్రాచీనతను సూచించును. ఇంతకును అసలు శబ్దము సోలిగాడే. అదే చోడిగాడైనది. ఈ సోలిగాడు జాతికెక్కిన మహాపురుషుడు. జాతీయముగా ఉపమాన పురుషుడైనవాడు. తమిళభాషలో 'సోలై' అనగా, అడవి, వనము అని అర్థములు 'తిరుమాలిరుం జోలై' యనగా పెరుమాళ్లుండు వనమని యర్థము. అట్లే మైసూరు కన్నడ ప్రాంతమున బళిగిరిలోని చెంచువారిని 'సోళగ'లని యందురు. సోలగను, సోలిగను, సోలగ అనునవి కన్నడమున అటవిక జాతి వారిని చెప్పును. మన కలాపములోని చోడిగాడు అథవా సోలిగాడు ఆటవికుడు. సింగడను పేరుగూడ ఎరుక, చెంచు, కోయ, కురవ వగైరా కొండజాతులందు ప్రచురము. మరి ఎర్రగొల్లలుకూడ ఆటవికులే — చోడిగాని కలాపమున ఎర్రగొల్లల భాగవతునియొక్క పేరు — కాగా మన సింగడు ఎర్రగొల్లల కులమునకు చెందిన సోలిగాడు. ఎర్రశబ్ద మాభీర శబ్దభవము కావచ్చునని క్రిందటి వ్యాసమున వ్రాసితిమి. సింగని బుజము మీద గొంగళి, చేతిలోని వంకకర్ర వాడాభీరుడనుటకు చాలును. ఎరుకల జాతివారికి సంబంధించిన చాల రచనలకు కొరవంజులని పేరున్నను — దీని నాపేరున వ్యవహరించుటకు వీలులేదు. ఇందు 'బుట్ట' మీద ఒట్టు పెట్టుకొనుట తప్ప నాయికకో నాయకునకో సోదె చెప్పు ప్రసక్తి లేకపోవుటయే దీని నాభీరసంబంధియైన రచన యనుటకు కారణము. భామాకలాప గొల్లకలాపములకంటె ఈ చోడిగాని కలాపము ప్రాచీన మనవచ్చును. అథవా దీనిమూలమైనను ప్రాచీన మనక తప్పదు. సిద్ధేంద్రయోగికికూడ దీనితో సంబంధమున్నట్లు కానరాదు.

# వ్యత్యాసాలు

శ్రీ కుందుర్తి

నీకూ నాకూ గల మైత్రి లోకానికి తెలీకపోయినా
నీకూ నాకూ గల అంతరం
లోకానికి తెలియంది కాదు:

చెడును నీవు సహించవు; అవతార మెత్తి శిక్షిస్తావు
చెడును నేను సహిస్తాను, దానిపై జాలి వహిస్తాను
నీది హింస; నాది అహింస.

పరిస్థితుల ప్రభావంచేత పతితులైన వారినైనా
దయతలచవు నువ్వు; నేను వారికి మిత్రుణ్ణి.
సృష్టి పుట్టిన తొలిరోజుల్లో చేసుకున్న పాత నిబంధనలు
సడలించవు నువ్వు; నేను వాటికి శత్రువును.

యుగయుగాలు గడిచినా మారవు నువ్వు
నేను మార్పును కోరేవాణ్ణి
దానికోసం పోరేవాణ్ణి.

పాపపుణ్యాల త్రాసు పట్టుకుని పిసినిగొట్టు అంగడిశెట్టిలా
నీవు విలువలు తూస్తావు
నేను మనిషివైపు మొగ్గు చూపిస్తాను
అడిగిన దానికంటే అదనంగానే యిస్తాను.

కోట్లాది వర్షాల ఘోరతపస్సులకుగాని
గుండె కరిగి భక్తుణ్ణి గుర్తించవు నువ్వు
మంచి ఎక్కడ వున్నా నేను మరుక్షణం గుర్తిస్తాను
అందలంమీద ఎక్కించి దాన్ని, అశిరికేకిలా నర్తిస్తాను.

నీకు నాతో పని పడ్డప్పుడు కష్టాలతో సేరుగా కబురు చేస్తావు;
దేవతలకు రాసే దూషణ లేఖలమీద
చిరునామాలు స్పష్టంగా రాయను
ఎవరికి చేరినా యిష్టమే నాకు!

నీకు దరిద్రులమీద కోపం; నాకు వారు పరమాప్తులు
కష్టజీవులు పట్టరు నీకు; నాకు వారు పరమాత్ములు

# వ్యత్యాసాలు

ఎక్కడా నీడలేక తాటిచెట్టు క్రింద తలదాచుకుంటే
అపనిందల కల్లుకుండల్ని అంటగడతావు నా మెడకు!
నీ స్వభావము క్రొత్తా నాకు ?
ఈ లేఖలో నిందించటానికి!

తను తప్పుచేస్తూ 'శివ శివా' అని
నా కండ్లుమూసే యోగి-నీకు వాడు మహాభక్తుడు!
నేను వాణ్ని సహించను.

తిండిలేని వాళ్ళకు తృప్తి విషం పెట్టటానికి
ఒకపూట ఉపవాసం చేసే భోగి—
నీకు వాడు మహాఆప్తుడు! నేను వాణ్ని సహించను.

ఇంట్లో జరిగే యిబ్బంది ప్రతిదాని వెనకాల
నీ రహస్య హస్తం కనిపిస్తుంది
పంచశీల పవిత్ర పథగామినైన స్వర్గం జోలికి నేను రాను.

పావలా కొబ్బరికాయ మొకలు
పది వీశెల బంగారందాకా
ప్రతిదానికీ మెచ్చి, భక్తులకు వరాలిచ్చి
నీవు దైవపదవి నిరుపయోగ పరుస్తావు!
ప్రతిఫల మాశించకుండా
ప్రజలకు ధర్మబోధలు చేసి
పని ముగిసిన మరుక్షణమే—మనుష్య
పదవినుండి దిగిపోతాను నేను.

పూలతోటవంటి స్వర్గంలో
పాలమీగడలాంటి మనసుల్ని పరిశీలిస్తావు నువ్వు
పాముల్లాంటి మనుషుల్లో మణులకై గాలిస్తాను నేను.

నీవు ఆకాశగంగ క్రింది మాగాణి భూముల ఆసామివి
నేను భూలోకపు ఉషరక్షేత్రాలు పండిస్తాను.
పాలకడలి నీ గీము; పడకేమో పాము
త్రాగటానికి దరిజేరితే విషంపోసి పంపటానికా?
మాతృభాష నా యిల్లు; తెనుగుకవిత పన్నీటిజల్లు
ఆశ్రయించిన రసజ్ఞులకు అమృతభాండ మందిస్తాను.

("భగవంతునికి బహిరంగ లేఖ" నుండి)

# నాయనివారి ప్రణయసూక్తం

తా. రా.

సాహిత్యం సంఘానికి ప్రతిరూపమే గనుక దేశకాలానుగుణంగా మారడం సహజం. అన్య సంస్కృతుల వెల్లువలు ముంచెత్తినప్పుడల్లా సంఘం, తదాశ్రితమైన సాహిత్యం మారాకులు తొడుగుతూనే ఉంటాయి. తెలుగు సాహిత్యంలో ఈవిధంగా తొడిగిన మారాకే నవ్యకవిత – కాల్పనిక కవిత.

ఆధునిక పాశ్చాత్య దేశాలతో మనకుగల సన్నిహితత్వం మున్నూరేండ్లది. బుడతకీచులు ముందుగా మన దేశానికి వచ్చినా, ఒళాందులు వారిని అనుసరించినా, పిదప పరాసులు ప్రముఖమై చనుదెంచినా, హెచ్చుగా సంబంధం మనకు కలిగింది ఆంగ్లేయులతోనే. మనదేశంలో వారి పరిపాలనకు పునాది విద్యా విధానం. మెకాలే మాటలే దీనికి నిదర్శనం. ఇంగ్లీషు విద్య దేశంలో బాగా పాదుకొని, బలిసి ఇంగ్లండు భారతదేశాలమధ్య రాకపోకలెక్కువై, సంస్కృతి సంబంధం పెరగను పెరగను మన ప్రాంతీయ భావల్లోను, భావనా పద్ధతిలోను, కళల్లోను ఆంగ్లేయుల ప్రభావం — పాశ్చాత్య ప్రభావం — ప్రతిభాసించింది; ఇటీవల ఇది తెలుగు కవితలో ప్రస్ఫుటమైందని చెప్పకతప్పదు.

ఈ ప్రభావంవల్లనే — శృంగారం కేవలం కామక్రీడగాను, స్త్రీ వలపుల అచ్చులో పోసిన కులుకు మిఠారి బొమ్మగాను ఉన్న సాహిత్యంలోనుంచి స్త్రీని ఉదాత్త మహిళగాను, శృంగారాన్ని సముదాత్త ప్రేమగాను అందించే సాహిత్యశాఖ చిగిర్చింది.

వస్తుప్రధానమైన కవిత్వంలో మెరపుల లాంటి ప్రత్యేక కవితా రామణీయ స్ఫోరక పదావళి చెదరుగా మాత్రమే కనిపించేది. పరిపూర్ణంగా కుదించిన ఒక్కొక్క అతిశయ భావనకు కవితా స్వరూపాన్నిచ్చే "లిరిసిజం" సాహిత్యాంకురం కూడా అప్పుడే ఆకులు తొడిగింది.

కవి కేవలం దాగిఉండి ఏ నాయికానాయకులతోనో మాట్లాడించడం కాక స్వయంగా తన హృదయాన్ని విప్పి చూపడం — ఆత్మాశ్రయత — కూడా



అప్పుడప్పుడే ఆరంభమైంది. అతి ప్రాచీన కాలంలోను, అతిప్రాచీనకవితలోను ఇలాటి లక్షణాలున్న కావ్యాలు లేకపోలేదు. కాని, ప్రబంధయుగం "గోల్డ్ రోలర్" వాటిని తలయెత్తనివ్వలేదు. ఉత్తమోత్తమ కళాఖండాలుగా జనంలో అతి ప్రచురంగా కనిపించే జానపద గీతాలకు ఆనాటి సాహిత్యం చొరరాని కంచుకోట అయింది. ఇలాటిదశలో సాగిన సాహిత్య నూతన ప్రవాహంలో ఉవ్వెత్తుగా లేచిన తరగలు శ్రీ కృష్ణశాస్త్రి, శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి, శ్రీ నాయని సుబ్బారావు, శ్రీ బసవరాజు అప్పారావు, శ్రీ నండూరి సుబ్బారావుగారలు.

శ్రీ కృష్ణశాస్త్రిగారి కవితాధార పూర్తిగా వైయక్తికం. వేదుల వారిది సంప్రదాయానుసారి. నండూరి వారిది జానపదమార్గం. అప్పారావుగారిది గేయఫణితి. కాని అప్పారావుగారికి, నాయని వారికి భావైక్యం కనపడుతుంది. అప్పారావుగారు

"ఎద మెత్తనౌటకై
సొదకుందరా, అంత

# నాయనివారి ప్రణయసూక్తం

మనసగల అహమ్మెల్ల
వదలిపోవును గా."

అంటే, నాయనివారు

"ఆ తగని విన్నె వలపుల జ్యోతి వెలికి
కనగొనక పట్టి దాత్మ వికాసమునుచు"

"అది మొదలి నవాంతరము
నంగ జన్మాప్రసవంపు రేకులన్
గగుముఱుగట్టు రక్తిగను
గద్గదికం గొన కూవరాగపుం
బసముల నెన్ని పాడితినో
స్వాంతము పొర్లు వియోగబాష్పపుం
జిగురులు గాల్చు పుష్పాకుల
ఛిన్న హృదంతరసీమ దామదమన్."

అంటారు. నిగ్రహం కొరిత ఇద్దరికి సమానమే.

నాయనివారి "సౌభద్రుని ప్రణయ యాత్ర" 'ప్రణయసూక్త' మనవచ్చు. దీనికి సౌభద్రుడు, వత్సల ఆలంబనం మాత్రమే. వారి పేర కవి తన సంగతే చెప్పినా, ఇది కేవలం ఆత్మాశ్రయకవితే అయినా, సర్వజనీనతను సంతరించుకొన్నది. ఈ కావ్యానికి 'ఫలశ్రుతి' ఉండడం విశిష్టత. ఆధునిక భావకవులందరూ విప్రలంభ శృంగారాన్ని అభివర్ణించినవారే. కాని ఆ వియోగానికి విశ్రాంతి కల్పించినవారు కారు. "సౌభద్రుని ప్రణయయాత్ర"లో కవి యాత్రను

"నీతోడ తలాహగా శయనింపగలిగి
దేవి! నాజన్మమున్ సార్థంబినాను
ముక్తిసీమంతిని తపాముగ్ధవరద
హాస్తవలయితుడౌ పరమాత్ముబోలి."

సఫలీకరించి, నాయకుని పరమాత్మతో ప్రతిస్పర్థ చేసి,

"అంతులేని యీ యాత్ర నిరంతరాయ
సాంతమయ్యెను నాజన్మ సఫలమయ్యె
ననుచు మాపువ పూజోపహార సమితి
నిండుకొన్నాను నీపాదదీప్త శరణి"

అని శ్రమాపనోదనం అభినయించి. ఊరటపడి

"పరవశత్వమునన్ మేను మరచియున్న
నాకు నీ యమృతాలింగనమ్ములోని
ప్రథమ సంస్పర్శనెల్ల విశ్వములు తోచె
నెన్నడును లేని యొక దివ్యదృష్టికలిగె."

అని పగనవేది తాకినవానిలా, సత్యసాక్షాత్కారం పొందినవానిలా ఒడలు పులకరింపగా,

"కలసిపోయిన యాత్మలు పులకరించు
నూతన పథమ్ములందు సంగీత మురలి
స్వాంత వీణా శ్రుతులు గల్పి పాడుకొనుచు
ఈ ఫలశ్రుతులింక నెన్నెన్ని కలవో!"

అని అనంత ఫలశ్రుతులను ఆశంసిస్తారు.

వీరి కావ్యప్రణయం భౌతికావధులు దాటినట్టిది. తపస్సులో ఆనందం అంచులువారి తాండవించినట్టు ప్రణయశిఖా మాలికలలో తన మనసునే ఆనంద కందంగా చూస్తారు. ఈ శిఖామాలికలు ప్రియురాలి గాలి సోకితేనే స్వాంతంలో మంటలు మండించేవి. తన శరీరం తప్తమై ప్రణయాగ్నిలో జీర్ణమైపోయినా, భౌతిక ప్రతిబంధకం లేకపోయినా, తనలోని అగ్ని ప్రేయసిని కబళిస్తుందట.

"ఎగ తెరపిలేక మండేను నీ విశుద్ధ
వహ్ని నీ చేత రగిలింపబడిన మొదలు
నవనవానందకంబై నా మనమ్ము
తచ్ఛిఖా మాలికలలోన తాండవించు.

"మారుమండును నాకేమి నీ రచించు
గాలి యందీ శరీర రేఖలు వినీల
జలధరాచ్ఛాదితమ్ములై స్వాంతమందు
మారుతోద్ధూత మిది పేర్చి మండుచుండు.

"ఈ శరీరమ్ము తప్తమై ఈ యనంత
శిఖి శిఖా మాలికలలోన జీర్ణమగును
భౌతికమ్మైన ఈ ప్రతిబంధకమ్ము
లేక ఈ వహ్ని నిన్ గబళించితీరు."

ఈ పద్యాలలోని భావోద్వేగ నిర్ఝరిణీ, భావనా తీవ్రత ఈ ప్రణయయాత్రను 'ప్రణయసూక్త'మని నిర్వచించడానికి ఆలంబన మవుతున్నవి. 'సూక్త'మని వైదిక పరిభాషను వ్యవహరించడంలో తాత్పర్యం కాయిక ప్రణయానికి ప్రాధాన్యం గౌణమనడానికే. దీనికి వీరి రచనలోని ప్రణయాహ్వానం, స్వప్న ప్రణయం, చింత, గాలిపటం, సాక్షాత్కారం, అవధి మొదలయిన ఖండికలు తార్కాణ.

ఉద్వేగం ఉరకలు వారుతున్నది కనుకనే, వీరి విరహంలో వాస్తవమైన వేదన కనబడుతుంది; కవిత కోసం, కాల్పనికత కోసం తెచ్చిపెట్టుకొన్న విరహాకాంక్ష కాదిది.

"అతి నిరాశతో మ్రింగిన హాలహలము
హృదయమందు సుధాజీవనదులు గట్ట

నే నమృతశీలుండనై గెలిచినపుడు
దేవతలకైన నేను పెట్టినది భిక్ష."

అన్నంతటి ఈ వేదన అతిలోకమైనది; దివ్యమైనది; బ్రహ్మానందసబ్రహ్మచారిణి అయినది. ఈ వేదనే కథలాగ చెప్పిన "కత్తి పడవ" అన్న ఖండికలో, చిన్ననాటి ఆటపాటలలో వదలిన కాయితాల పడవలలాగే విడిపోయిన ప్రేమికులను అనంతర వియోగావస్థలో

"కాగితమ్మది యనుమున కన్న నిజము
ఆశ అనెడు కత్తి పడవున కంతులేదు
అదటు ప్రేమప్రవంతి యవ్యాహతముగ
కదలుచుండుట జేసి నా బ్రతుకు నిలుచు"

అని పూర్వ స్మృతులను పిండి సమాశ్వాసింపజేస్తుంది.

చిత్తంమీద ఈ ప్రణయయాత్రలో వీరు ప్రకృతిని గవేషించినారు. ప్రణయాభివ్యక్తి మొదలు పలు దశలలో తమ హృదయాన్ని ఉద్గీర్ణం చేసినారు. భవిష్యత్తు, ప్రేమ ప్రకృతి, నేను—నీవు, ఈపినాకిని పుట్టిన దివటనో, అంతులేని యాత్ర, ఏనాటి కాంక్ష, ప్రళయం, నా కూడు-వంటి ఖండికలలో ఈ హృదయమోద్గారం పొంగులు వారుతుంది. నీవు-నేను లోని

"త్రిభువనమ్ములలో రసాద్రిపవనమ్ము
వెల్లివిరియించు ప్రణయ రూపిణివి నీవు
నీ దరస్మిత రోచిః ప్రసాదకాంక్ష
కోనలు సాగిన ముగ్ధ భిక్షుకుడ నేను.

"జన్మ జన్మాంతరముల స్వాంత విధి
నీ సుధాస్వాదులజ్జా విలాసరేఖ
పరపి కిరురించిపోయిన మెరపు నీవు
నేను నీమార్గములు చూచు నీరదుడను."

అన్న పంక్తులు హిందీమహాకవి సూర్యకాంత త్రిపాఠీ నిరాలా మనోహరంగా ఆలపించిన

"తుమ తుంగ హిమాలయశృంగ
ఔర మైఁ చంచలగతి సురసరితా
తుమ విమలహృదయ ఉచ్ఛ్వాస
ఔర మైఁ కాంత కామినీ కవితా.

తుమ రఘుకుల గౌరవ రామచంద్ర
మైఁ సీతా అచలా భక్తి."

అనే గీతికలను స్మరింపజేస్తాయి. 'అనురకృత్యము' అన్న ఖండికలో అహంకారం కాకపోయినా

"ఎవ్వడే నీగళమ్మునం దిరవుకొనగ
నేను విసరిన ప్రేమ ప్రసూనము ల
నడుమ నీవు చూడగబట్టి నలిపివైచి
నీ కనులయందు నెత్తుకల్ నింపినాడు."

అని ఆక్రోశం వినబడుతుంది. నిజమే. ప్రేమ ప్రతిఘటితమైనప్పుడు ఆక్రోశరూపంలో ఆ వేదన వెలువడక తప్పదేమో! చివరకు ఈ ప్రేమ కార్తికపూర్ణిమవలె ప్రసన్న చాంద్రీమయం కాగా, శుక్రవారం నాడు,

"అగ్నిలోకైక జనని పాదాబ్జ సవిధ
భూమి మీలిత నేత్రవై మోకరిల్లి
నీవు పూజా సుమమ్మువై నాపు హృదయు
కర్ణ కోమూలమున భక్తి కంపించి
అందు పారవశ్యమ్మున దొడిమ యూడి
నేను పూవునై పడితిని నీదు చెంత"

అని ప్రేయసితో జంటగా చేరి పూజావ్యగ్రతతో కార్యసమాప్తి చేయడం భారత సంప్రదాయసిద్ధమైన చతుర్వర్గ సాధనను సూచిస్తూ ఉత్తమ సంస్కారాన్ని వెల్లడిస్తుంది.

తక్కిన భావకవులు ప్రణయాన్ని తదేకంగా భావించినవారు. నాయనివారు ప్రణయాన్ని దేవి మూర్తిలోని ఒక అంశగా, ఒక కళగా దర్శించినవారు. అంటే, తల్లి ఉద్బోధతో నవ్వులజ్యోతిని కనుగొనడానికి బయలుదేరి, తల్లి కొరకే యాత్ర సాగించి, తనకు ప్రియురాలితో చేరి తల్లికి నమస్కరించడమే పరమార్థంగా చిత్రించడంవల్ల సమగ్ర దేవీమూర్తిని మాతృభావంతో పరికించి, ఏకదేశంగా తన ప్రియురాలిలో ప్రణయభావాన్ని చూచారు. నాటికవులలో కనిపించనిదీ, వీరిలో కనిపించేది విశేషమిదే.

వీరి "మాతృగీతాలు" మాతృవియోగంవల్ల వెలువడిన విషాద జీమూతాలు. వీరి నాన్నగారు వెంకటగిరి సంస్థానంలో ఉద్యోగిగా ఉండేవారట. ఆయనంటే అందరికీ సింహస్వప్నమట. అందుకనే కాబోలు వీరికి తల్లి అంటే మక్కువ ఎక్కువ. ఆమె కాలధర్మం చెందినప్పుడు కలిగిన శోకవ్రాతమే ఈ గీతం.

"ఎంత దయలేని తల్లి వే ఇంత జాలి
యొట్టివో యెన్నడెరుగనియట్టి నిన
కాలచక్రమ్మునకు నన్ను కట్టివైచి
ఎగిరిపోతివ శాశ్వతమ్మగు సుగతికి."

అన్న గీతంలోని దుఃఖవిలులితపాశాలు మనల్ని కూడా గుండె కరగించి కాలచక్రానికి కట్టివేసేటంతటి వివశతతో ఎగురుతున్నాయి! వీరి మాత ప్రారంభంలో

సామాన్యమాతగా కన్పించినా, చివరకు విశ్వమాతగా పరిణమించి సాక్షాత్కరిస్తుంది కబీరు రామునివలె.

"అవ్యయ దయాంబురాశి! సర్వేశ ప్రసన్న
మధురకీర్తి! శ్రీమన్మహా మాతృమూర్తి
మమ్ము నీకటాక్షమ్ముల మనిచి కాపి
తమ్మొనర్పు మా జీవయాత్రాపథమ్ము."

అనడంతో ఈమె జగదేకమాతే! సామాన్య మానవిమాతకు మరణానంతరమూ 'జీవయాత్రాపథమ్ము దీపితమ్మొనర్చే కటాక్షం ఎక్కడిది?

"రెండు పొలిమేర లొకటైన రేఖమీద
నేను నిలుచియుంటిని నేను మంచి
నిదురపోదును జోలపాడుదువు నీవు
చిచ్చికొట్టుచు చీకటుల్ విచ్చుదనుక."

రెండు పొలిమేరలు — భూమ్యాకాశాలు, చీకటివెలుగులు, సుఖదుఃఖాలు, స్వర్గమర్త్యాలు, జననమరణాలు. ఇవి ఒక్కటైన రేఖలో మనను తన ఒడిలో పరుండబెట్టుకొని చీకటులు — అజ్ఞానాంధకారాలు — విచ్చేదనుక జోల పాడే అమ్మ ఎవరు? ప్రపంచంలో ఏ మానయినా మాతృప్రేమ పొంగిపొరలని సాహిత్యముండదు. ఆ సాహిత్యంలో ఈ 'మాతృగీతాలు' మణిపూసలు; అమ్మను గూర్చి అమ్మలగన్నయమ్మవద్దకు, ముగురమ్మల మూలపుటమ్మ వద్దకు హృదయాన్ని కొనిపోయే కరుణావాహినులు.

వీరి "సౌందర్యలహరి" నామసామ్యంలో శంకరాచార్యుల సౌందర్యలహరిని తలపిస్తుంది. కాని స్వతంత్రరచన; ఆ నవీన రచన.

"ఈ ఘనరాశి మధ్యమున
నీగతి నన్నిదురింప బంధించి దుః
ఖాకులమైన నా బ్రతుకు
కనంత ముఖమ్ము క్రుంగిపోవ నీ
వాహినీతీర సైకతవి
హార పథమ్ముల నార్తరక్షణ
శ్రీ వెలయన్ చరించు చిటు
చిన్నినవ్వుల్ పచరింతు వంబికా!"

లాంటి పద్యాలు నిజంగా శంకరుల సౌందర్యలహరిని జ్ఞాపకంచేస్తాయి; రచనారామణీయకంలో నూ, భావనోదాత్తతలోనూ.

వీరు ప్రణయంలో పలువిధాలను తమ కవితలో పలికించారు. అభినవకృష్ణలీలలలో తమ పౌత్రునిమీదగల వాత్సల్యం వెల్లివిరిసింది. వీరి మిత్రప్రణయం అరమరలు లేనిది; మనస్సును కరిగించేది. "ఏకృతి రచియింప
రేని సమకాలికులు వారలు మెచ్చరేకదా!" అన్న చేమకూరకవి అపవాదుకు అపవాదమైనట్టిది; 'విశ్వనాథవారి షష్టిపూర్తి' అన్న ఖండిక.

"పదులుకొలంది సత్కృతులు
ప్రకటించితి వాంధ్ర కవితాకన్యకా
వదన వికాస హేతువులు
వానిని మించి నిసర్గ నిత్య సౌ
హృదమతిశ్రేష్ఠ నీ ప్రణయ
రీతులు నన్నరగించు నెప్పుడున్
మృదు కరుణార్ద్ర గీతికలు
నీ యెదలోతు లవెంత మెత్తనో!

"కద్రూజాహిత పక్షియుక్త కృతివే
గ ప్రౌఢ సాహిత్య సం
పన్మాపమ్ములు నీ మహోద్ధతయుత శ్రా
వ్యాఖండారములు; సత్కథా
ముద్రాంక ప్రదపత్కథా కథనమై
పుణ్యమ్ము నీ సౌఖ్యమ్ము శ్రీ
మద్రామాయణ కల్పవృక్ష సుమలా
త్మా! సత్యనారాయణా!"

వీటిలో నాయనివారు తమ యెదలోని మెత్తని లోతులను గుములుకొన చూపినారు.

మనకు నూటికిపైగా అలంకారాలున్నాయి. ఆంగ్లభాషలో ముప్ఫయిదాకా 'ఫిగర్స్ ఆఫ్ స్పీచ్' అనే పేరులో అలంకారాలున్నాయి. కాని, ఆంగ్లకవితలో భావచిత్రణం (Imagery) అనేది ఈ అలంకారాలకు సంబంధించినదే అయినా, వాటికంటే హెచ్చయినది. ఈ భావచిత్రణసామగ్రి మన రూపకోపమోత్ప్రేక్షాతిశయోక్తి స్వభావోక్తులవంటివాటికి సన్నిహితంగా ఉంటుందనడం నిజం. కాని, 'ఇమేజ్' అనేది కవితలో ఉంటే, దానిలో భావోద్వేగం, వైవయిక్తత, అభిప్రాయ ప్రకాశనం, సంవిధానక్రమం ఉంటాయని పాశ్చాత్య కావ్యజ్ఞుల నేమాట. ఈ పాశ్చాత్య భావచిత్రణ ప్రాభవం నాయనివారి రచనలలో అంతో ఇంతో పడకపోలేదు.

"ఈ చలిగాలి పోసుకొని
హృద్గగనమ్ము ప్రతిధ్వనించు బా
ధా చకితమ్మయి ప్రళయ
దారుణ శైత్యభరమ్ము నాదలన్

మోచిన నాదు మేన్ వణకి
    పోయెడు వెన్నెదనాల వల్లి! నీ
పై చెంగింత కప్పుకొన
    బట్టుము నాదు కృపాప్రసన్నవై."

అనే సౌందర్యలహరిలోని పద్యంలో వెన్నెదనాల వల్లి పాశ్చాత్య సంప్రదాయ మనుకొంటాను. మనకు తల్లిఒడి, తల్లిపంచ చల్లనివి; ఆమె అమృతనిష్యందిని. మనకు — ఉష్ణమండలంలోని మనకు — తల్లి నుండి అవసరమైంది చల్లదనమే, పాశ్చాత్యులకు వెచ్చదనం.

ఒకభావం గ్రహించి, దానిపై కల్పనాపరంపర సాగించడం కూడా పాశ్చాత్యపద్ధతే.

"ఆ ఎగిరివచ్చు పూర్వదిశాభిముఖము
లైన పులుగులు రెక్క లల్లార్చుచును
మధుర కంఠస్వనులయందు మాటుందు
నీ జయలు గేరు సంగతియే భరించె"

భరించు (బేర్) అనేమాటపై తెనుగులో కల్పించిన పాశ్చాత్య రూపచిత్రణం కాదా ఇది?

"ఈ నవు లెట్టివో తెలియ
    నింతకు పూర్వము నవ్యభావముల్
పూచిన తేనెలన్ తడిసి
    పోయిన నా హృదయాంతరమ్మునన్
నీ చిరునవ్వు వెన్నెలలు
    నిండిన యీ సకలప్రపంచ మం
బా! చిగిరించు నేని చరి
    తార్థుడనే గద నాదు నాటికిన్."

నవ్యభావముల్ పూచిన తేనెలన్ తడిసిపోయిన - అనేది ఆంగ్లభాషా ప్రభావ మనవచ్చు.

"మధుర వాత్సల్యవాహిని మాతృమూర్తి
నయన పథగామియగా శుభోదయము మాపి
కాలపుస్తకపుం బుట లేల వెనుక
నతుకుకొనిపోయినవి తీయ నలవి గాక!"

పుస్తకంలోని పుటలు. అతుక్కుపోవడం అత్యాధునికం

"నీవు హారతి యీయ గాంక్షించి నాదు
స్వాంతమున పళ్లెరమ్మున వలపు కర్పూ
రమ్ము వెలిగించి చూచు మార్గమ్ము వంక
కనునిమేషమ్ము నిగాక నమృతమూర్తి"

వలచు ధాతువు భావార్థకమైన వలపునుంచి స్ఫురించిన మనసులోని వాసనా ప్రపంచాన్ని కాల్చివేశానంటారు. సూఫీలలో, ముఖ్యంగా కబీరు ఇలాటి భావచిత్రణాలు భక్తివేదాంతాలు మిళితంచేసి చెప్పడం తరచు. ఈ గీతంలోని ఉత్తరార్ధంలోని 'మార్గ'శబ్దం అన్వేషణ అని సాధన పరంగాను అన్వయించి చెప్పవచ్చు.

"వత్సరాల ఫాలమున నెలవంక కురుతు
కంచళించి వికాసించి కళలు దేరి
తరుణ శారద రాకాసుధాకరాచ్ఛ
బింబము లనంతయుగులు లెక్క పెట్టుకొనెను."

ప్రాచీన సంప్రదాయపు పునాదిపై చక్కగా సాగిన ఆధునిక భావచిత్రణ పరమావధి యిది అనడంకన్నా, దీని ఇంపు సొంపులు వివరించడం ఆనందాతీత మనుకొంటాను.

వీరి "పద్యాలు జీవితాన్ని చీల్చుకొని వస్తవి. అందుచేతే అంత బాధాకరంగా ఉంటవి....కవిత్వం ఈయనను వరించింది: వలపులో విరహంలో, వేదనలో, మత్తు పేనులో. ఈయన కవిత్వానికి హృదయం గీటురాయి. ప్రియురాలి యెడబాటు పిచ్చివాణ్ణి చేసింది తల్లి మరణం భోరుమనిపించింది ఆనందంలో స్వర్గవీథులలో విహారం చేయిస్తాడు; బాధలో హృదయాన్ని బద్దలు కొడతాడు; బ్రతుకులో కవిత్వం వినుకుంటాడు. ప్రతిపాదం జీవించి పలుకుతాడు. ఈ భావగీతాలు ఉజ్జ్వలములు. ఉన్నతములూ" అంటారు 'వైతాళికులు' సంపాదకులు.

నిజం! నిజం! వీరిస్థానం నేటి సుప్రసిద్ధకవుల సరసనే. కాని వీరిపేరు ప్రచారం కాకపోవడానికి కారణం ఉందా? ఉంది. వీరు మితభాషులు; మందీ మార్బలం చేర్చుకొని రాజకీయ నాయకులుగా ప్రచారం చేసుకొనే "భజనప్రియులు" కారు; నిరాడంబరులు; నివురుగప్పిన నిప్పువంటివారు; చక్కగా చిక్కగా అతివేలమైన సంయమంతో, అనంతమైన భావనతో పద్యాలు చిక్కిపెట్టడం చేతనయినవారు; కనుక, బాహ్య ప్రచారం కోరేచిత్తవృత్తి కలవారు కాదు. ఈ నెలే షష్టిపూర్తి చేసుకుంటున్న వీరిని

"ఒకచుట్టు కాలచక్రము
నకు నీవును షష్టిపూర్తి నలిపినజూపు నిం
కొక చుట్టు తిరుగునంతకు
నకుటిలమతి! నీకు పరమ మాయుష్యమగున్."

అని వీరు శ్రీ విశ్వనాథవారి షష్టిపూర్త్యుత్సవంలో వ్రాసిన వీరి మాటలే పలుకుతూ అభినందిస్తున్నాను.

# సాహితీ సుగతుని స్వగతం

నూటపదహార్లు — అనేమాట మన వ్యవహారంలో తరచు వినిపిస్తుంది. "ఏమిటి కట్నాలూ, కానుకలూ?" అని ఏ పెండ్లి వారినైనా ప్రశ్నిస్తే అనుకోండి: "ఏముందీ! మామూలే. నెయ్యున్నూటపదహార్లు అల్లుడుకి, ఆడపడుచుకు లాంఛనాలకింద నూటపదహార్లు." అని సమాధానం వింటాము. "అష్టావధానం చేశారే! ఏమిటి సన్మానం?" అంటే, 'ఆ! నూటపదహార్లే!" అని కొంత అసంతృప్తితో ప్రత్యుత్తరం వస్తుంది. "ఆ కథకు నూటపదహార్లు ఇచ్చారట నే!" అని ఆశ్చర్యం ప్రకటిస్తారు కొందరు, కథలకు కవితలకు ఇంత బహుమానమేమిటని.

మరి ఇంత ప్రచారంలో ఉన్న ఈ నూటపదహార్ల మూల మేమిటి? ఎలా ఇంత ఖ్యాతి సంపాదించింది? అంటే, సమాధానం చెప్పడం కష్టమే.

నూరు మనకొక పెద్ద మొత్తం; పెద్ద సంఖ్య; సంపూర్ణ సంఖ్య "నూరేళ్లు జీవించు నాయనా!" అంటారు పెద్దలు పిన్నవారు ఆశీస్సులు కోరితే. "శతమానం భవతి శతాయుః పురుషః శతేంద్రియ ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి" అనే ఆశీర్వచనం మనం తరచు వినేదే మన పూర్వుల లక్ష్యం:

"పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతం
నందామ శరదశ్శతం మోదామ శరదశ్శతం
భవామ శరదశ్శతం ప్రబ్రవామ శరదశ్శతం
అజీతాః స్యామ శరదశ్శతం."

అన్నది, నూటపదహార్ల ప్రసక్తి లేదు. జ్యోతిషశాస్త్ర ప్రకారం వింశోత్తరీ దశాగణనను అనుసరించి మన పూర్వులు మానవుని వయస్సుకు కట్టిన లెక్క 120 సంవత్సరాలు. ఈ లెక్క అరవైని రెట్టించి ఏర్పాటు చేసిందన్నారు కొందరు పండితులు. "గ్రహాలన్నీ ఒక్క స్థానం నుంచి ఒకమారు బయలుదేరిన పక్షంలో మళ్ళీ అక్కడే చేరడానికి 60 సంవత్సరాలు పడుతుంది. కనుక ప్రభవ మొదలు క్షయ వరకు 60 సంవత్సరాల లెక్క ఏర్పరచారు. దానిని రెండుతో హెచ్చవేసి 120 అన్నారు." అన్నారొక పండితులు. కనుక నూట పదహార్లకు మారు 120 అనేదే వ్యవహారంలో ఉండవలసింది.

నూరొక సంపూర్ణ సంఖ్య. పదహారు సంఖ్య మనకు చాల ముఖ్యమైంది. చంద్రుని కళలు పదహారు. పదహైను మనకు కనిపిస్తాయి; పదహారోది సూర్యునిలో చేరిపోతుంది; కనిపించని పదహారో సంఖ్య అంత ముఖ్యమైంది గనుక నూరును మొండిగా ఉంచడం ఇష్టంలేక పదహారు చేర్చి నూటపదార్లన్నారు మర్యాద చేసే సందర్భంలో — అన్నారొక పండితులు. పదహారే ఎందుకు? మనకు మంత్రశాస్త్రం ప్రకారం 108 కదా శ్రేష్ఠ సంఖ్య. అష్టోత్తరశతం, అష్టోత్తర శతనామావళి, అర్చన, జపం మొదలయినవి ఉన్నాయి. కనుక 108 అన్నదే ప్రచుర వ్యవహారంలో కావలసింది. అందుకు కాలేదు? అనే ఎదురు ప్రశ్న పుడుతుంది.

మనకు నాలుగుతో హెచ్చవేస్తూ పోయే పద్ధతి — నాలుగు, నాలుగు రెండ్ల ఎనిమిది, ఎనిమిది రెండ్ల పదహారు లాగ అతిప్రాచీనం. ఛాందోగ్యోపనిషత్తులోనూ ఉంది ఈ నాలుగు గుణింతం. దీని పదహారు కళలు అనే సంప్రదాయం కలిపి నూటపదహారు అన్నారేమో! అంటే — వాదం మనస్సుకు ఏమీ సరిగా లేదు.

పూర్వం సంస్థానాలలో పండితులకు సంభావనలివ్వడంవల్ల ఈ వ్యవహారం ఏర్పడింది. పూర్వపు నిజాం ప్రభుత్వం హాలీ సిక్కా రూపాయలకు, బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం (గాడీ) రూపాయలకు మారకం హారా పదహారు రూపాయలు. కనుక నిజాం సంస్థానాల ప్రభువులు ఇతర ప్రాంతాల కవి పండితులకు సంభావనలిచ్చేటప్పుడు మారకం వారాతో కలిపి నూటపదహారు రూపాయలు ఇచ్చేవారు. హాలీ రూపాయలు నూటపదహారయితే గాడీ రూపాయలు నూరు. అందువల్ల అప్పటినుంచే ఈ నూటపదహారు మర్యాద ఏర్పడింది — అని ఒక పండితులన్నారు.

అబ్బే! అదేమిటి! నూటపదహార్ల సంప్రదాయం విజయనగర కాలంనుంచే ఉంది. తెనాలి రామకృష్ణుడు కృష్ణరాయలపై చెప్పిన

"నరసింహ కృష్ణరాయల
కర మరుదగు కీర్తి యొప్పె కరిభిద్ గిరిభిద్
కరికరిభిద్ గిరిగిరిభిద్
కరిభిద్గిరిభిత్తురంగ కమనీయంబై."

అనే చాటుపద్యంపై అతనికీ, భట్టుమూర్తికీ వివాదం జరిగింది. అంతతిమ్మరుసు లేచి పైపద్యంకన్నా బాగా పద్యం చెప్పినవారికి సింహాసనం అలంకరించవలసిందని పవాలు చేశాడట. దానికి భట్టుమూర్తి ఉగ్రుడై,

"లొట్టి యిస్తేటిమాటపెను
లోభులతో మొగమాట పేలదా
.........................
పెట్టుదు దండముల్ సుకవి
బృందము కే నతిభక్తి సారెకున్
గట్టితి ముల్లె లేదాయె
నాగల నూటపదారు లియ్యకన్
గట్టిడి భట్టుమూర్తి కవి
రాయని మార్గ మెసంగ జెప్పితిన్."

అని ఎదురు సవాలు చేసినట్లు గురజాడ శ్రీరామమూర్తి గారు కవిజీవితాలలో పేర్కొన్నారు. ఆ చాటూక్తి మాలిక సుప్రసిద్ధంగనుక నూటపదార్ల వ్యవహారం నిజాం రాజ్యానికి ముందుదే-అని ఒక పరిశోధకులు అన్నారు. ఇంత ప్రసిద్ధమైనమాట నిఘంటువుల్లో ఎక్కలేదేమి? నూరార్లు, నూట యొనిమిది తిరుపతులు అన్నచో ఎక్కినప్పుడు?

"దివ్యములు నూటయెనిమిది తిరుపతులను
బరమపదమైన శ్రీసర్పపుగము నందు"

అని భీమఖండం (2-66) లో శ్రీనాథుని ప్రయోగమే ఉంది నూటయెనిమిదికి. చాటువులనుంచి ప్రయోగాలు ఏరకపోవడం నా తప్పా? అంటారు ఆ పరిశోధకులు.

ఇతర ప్రాంతాలలో ఈ సంప్రదాయం ఉందా అంటే, లేదు ఉత్తరభారతమంతటా 100 అని మొండిగా ముగించడం మంచిదికాదనీ, దానికి సాతత్యం ఉండాలనీ ఒక్కటి చేర్చి, నూట ఒక్కటి ఇస్తారు. ఇదే దక్షిణాదిలోను-ముఖ్యంగా నాటుకోటచెట్లలోను - ఉంది. 110 కూడ కొన్ని ప్రాంతాలలో ఉంది.

పరిశీలనచేయగా, నూటపదార్లు అనేది చాలవిశ్వ నాటిదేనని స్పష్టమౌతుంది. మొహెంజొదారో తవ్వకాలలో దొరికిన ప్రాచీనజాతివారి గృహోపకరణాలలో దువ్వెనకూడా ఒకటి ఉంది. దానికి పండ్లు నూటపదహారున్నాయని ఇండియన్ యాంటిక్వెరీ (1918) లో ఎవరో పండితులు వ్రాశారు.

ఛాందోగ్యోపనిషత్తులో నూటపదహారు సంవత్సరాల ఆయుస్సుకోసం పలుపాట్లు పడినట్లు కొన్ని మంత్రాలున్నాయి.

"ఏతద్ధస్మవై తద్విద్వానాహ మహిదాస ఐతరేయః సకిం మ ఏతదుపతపసి యోహమనేన న ప్రేష్యామీతి సహ షోడశం వర్షశత మజీవత్ప్రహ షోడశం వర్షశతం జీవతి య ఏవం వేద." (8-6-7)

ఇతరుని కుమారుడైన మహీదాసుడు ఈ యజ్ఞాన్ని తెలుసుకొన్నవాడు. రోగంతో ఇలా అన్నాడట. "నన్నెందుకు ఊరికే బాధిస్తావు? నీతో నేను చావను." అతడు అలా రోగాన్ని ప్రతిఘటించి నూటపదహారు సంవత్సరాలు జీవించాడు. ఈ యజ్ఞం తెలుసుకొన్నవాడు నూటపదహారు సంవత్సరాలు జీవిస్తాడు.

"తద్ధైతద్ఘోర ఆంగిరసః కృష్ణాయ దేవకీపుత్రాయోక్త్వోవాచాపిపాస ఏవ స బభూవ సోఽన్తవేలాయామేతత్త్రయం ప్రతిపద్యేతాక్షితమస్యచ్యుతమసి ప్రాణసంశితమసీతి తత్రైతే ద్వే ఋచౌ భవతః."

ఆంగీరస వంశజుడైన ఘోరుడు దేవకీసుతుడైన కృష్ణునికి ఈ యజ్ఞాన్ని (దీర్ఘాయుష్య విద్యను) తెలిపాడు. ఆ తర్వాత దేవకీనందనుడు మరొక జిజ్ఞాసకు పోలేదు. అవసానం సమీపించినప్పుడు తన్ను ఉద్దేశించి "నీవు అక్షయ్యమైనవాడివి. మారనివాడివి. ప్రాణం కంటే మధురమైనవాడివి" అని చెప్పాడు. ఈవిధంగా నూటపదహారేళ్ళు బతికాడు.

దీనినిబట్టి మనపూర్వులు శతమానం జీవించే విద్యను సాధించినతర్వాత మరి నాలుగు నాలుగుల కాలం జీవించడానికి ప్రయత్నించారనీ స్పష్టం. అంటే వేదకాలంలో శతమానానికి అలవాటుపడినవారు ఆరణ్యకాల కాలానికి తమ జీవితాన్ని మరి పదహారు సంవత్సరాలు పెంచుకోడానికి మార్గాలు వెదకొన్నారు. అప్పటి ఆ వైదికాచారమే మనలో సంస్కృతిగా నిలిచిపోయి ఉంటుందనుకుంటాను.

ఇంతేకాక, మన పూజలలో షోడశోపచార విధి మనకు తెలిసిందే. ఇది మంత్రశాస్త్ర, వ్రతకల్ప సమ్మతము. ఈ షోడశోపచార విధిలోని షోడశ సంఖ్యే ఔపచారికంగా నూటపదార్లలో చేరిందేమోనని ఒక మిత్రుడన్నాడు. ఇది సమంజసంగానే ఉంది. గంధరూపాద్యలిచ్చి, అర్ఘ్యపాద్యాది షోడశోపచారాలకోసం చెరొక సువర్ణపుష్పమో, సాధారణ పుష్పమో ఇవ్వడం ఆచారమై, క్రమంగా నూటపదార్లయి ఉంటుంది.

అపరకర్మలలో చేసే దానాలలో షోడశదానాలున్నాయి. నూరురూపాయలు దక్షిణ, ఒక్కొక దానానికి ఒక్క రూపాయో, రూకో చొప్పున పదహారూ కలిపి నూటపదారు అనే వ్యవహారం వచ్చిందేమో! ఈ దానాలకు, ఈవికి మూర్తికల్పనే షోడశభుజ దుర్గాదేవి కావచ్చు. షోడశసంఖ్య ప్రాధాన్యం తెలిపేవి సంస్కృతభాషలో ఎన్నో ఉన్నాయి.

—రామచంద్ర.

# తెనుఁగుచోళభూపతులు: మట్లిసామంతులు

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మ

రాయలసీమలోని కడప, కందనోలు (కర్నూలు) మండలములందు దమ పలుకుబడివలన ప్రాబల్య మార్జించి కొని సుప్రసిద్ధికెక్కిన మట్లవంశ క్షత్రియులు అక్కడక్కడ చిన్నచిన్న భూఖండములు తమ స్వాధీనములో బెట్టికొని, వానికిఁ బాళెయగాండ్రుగ నెలయుచు చోళులకుఁ గప్పములు చెల్లించు సామంతప్రభువులుగఁ దమయాధిపత్య మాక్రాంత ప్రదేశములందు చెలాయించుచుండిరి. తమ ప్రతిభా ప్రాభవాధిక్యముల వలన వారు ప్రజారంజకులగ నొప్పారుచు తమ సౌకర్యముల కొఱకెన్ని కార్యము లొనరించుచుండిరి అంత మాత్రమున వారు సామ్రాజ్యా[illegible]ల కెదురు తిరుగకుండు టట్లుండ, సమస్త రాజకీయములలోను వారికిఁ దలలోని నాల్కలవలె మెలఁగుచు వచ్చిరి

మట్ల ప్రభువులు క్రీ. శ. 13-వ శతాబ్ది నుండియే తాము 1 చోళవంశ క్షత్రియశాఖకుఁ జెందినవారుగఁ జెప్పికొనుచుండిరి. విజయనగర సామ్రాజ్యమును సదాశివ దేవరాయలు పరిపాలించునాఁటికి వారితో సంబంధము మున్నుగుండి యొనర్చికొని ఆ రాయల చుట్టరికము మఱింత సన్నిహితముగునట్లు కావించికొనిరి. రాజ్యాంగమునఁ జెలరేగు పెక్కు గడ్డుసమస్యల సమాలోచించు సందర్భములలో రాయలకు మట్లివారి సహాయ మత్యంతావసరమయ్యెను. రాజ్యతంత్ర తాపస చతురత చేతను నిశితబుద్ధి కౌశలము చేతను మట్లవారా ప్రాంతములలో ఆనాఁడు ప్రముఖులగు మేధావులని— పేరెన్నికఁ గనిరి. క్రమేణా వారు విజయనగర సామ్రాజ్యాధీశునిచే మధురాంతక పొత్తపినాఁడుల కధిపతులయిరి. ఏటేట ఈమట్లరాజుల వంశస్థులు సామ్రాజ్యాధీశులకుఁ జెల్లింపవలసిన కప్పములు తప్పక చెల్లించుచుండిరి. తక్కిన సామంతులవలెఁ గాక స్వచ్ఛందముగఁ దమ సంస్థానముల కెట్టిముప్పులును గలుగనీక యేలు కారణమునను, సామ్రాజ్యాధీశులకుఁ జుట్టములయిన హేతువునను మట్లవారి సీమలోని ప్రజలు తెలుఁగుచోళులుగ వ్యవహరింపబడుచుండిరి. అంతవఱక వారు పాళెయగాండ్రుగనే యొప్పారుచుఁ బాళెయగాండ్రు పొందవలసిన రాచరికపు మర్యాదనే సామ్రాజ్యాధీశుని యాస్థానమున వందుచుండిరి. వీరికి పదునేడవ శతాబ్దమునకుఁ గాని 'రాజు' అను బిరుదము లభింపకుండెను. ఈవిషయ మప్పటి కడపజిల్లా గెజటీరులో సంగ్రహముగఁ గానవచ్చెడు.

'పొత్తపినాఁడు' అను ప్రదేశ మొక రళ్లమయ మగు కొండక్రింది గ్రామము. ఇది కడపజిల్లా రాజంపేటకు బదునైదు మైళ్ళదూరమున నున్న 'చెయ్యేఱు'న కెడమయొడ్డునఁగలదు! ఈ పొత్తపినాఁడు శ్రీ కృష్ణదేవరాయని కాలమునకే యొకపల్లెటూరుగ నుండెను. ధూర్జటికవీంద్రుని శ్రీకాళహస్తిమాహా[illegible]మున ఈ పొత్తపినాఁటి ప్రశంస గలదు. ఈ ప్రాంతముననే, మూర్ఖుఁడయ్యు పరమశివభక్తుఁడగు తిన్నఁడు వసించిన పల్లియగు 'ఉడుమూరు'ను ఉన్నదని ఆ కృతివలన తెలియవచ్చుచున్నది. ఈ నాఁడెల్ల ఆనాఁడె మహారణ్య ప్రదేశము, కాని నిర్జనము గాదు.

విజయనగర సామ్రాజ్యాధీశుల సామంతులయిన మట్లరాజులు కొన్ని నిర్ణయములకు లోనయి వారికేటేట గప్పములు చెల్లించుచుండిరి.

కడప మండలమునకు సంబంధించిన 832 సంఖ్యగల [illegible]సనము ననుసరించి 'మట్లకుమారయ్య' అనువతఁడు ఆ మండలములోని విశేషభాగము నేలుచుండెనని తెలియుచున్నది. ఒకానొక శాసనాధారమువలన కంచిరాయరంగయ్యయను ఆవంశపరంపరలోని ప్రముఖవ్యక్తి యొకఁడు అప్పటి నిడుగల్లు ప్రభువయిన చోళరాజున కొప్పుఁడై, పలుకుబడి వార్జించెను (కడప శాసనములు 1906 సంవత్సరపు, 509, 479 సంఖ్యలు) ఇది 1588 సంవత్సరమునాఁటి వృత్తాంతము.

---

(1) కకుత్స్థ విజయమునఁ దృతీయాశ్వాస మంగళాచరణమున ఈ విషయము ఇట్లు స్థిరపఱుపఁ బడినది.

"శ్రీ చోడవంశ భవ యాహి
తాచారభిదా ప్రచండ యయ్యరగండా,
భూచర ఖేచర లోచన
గోచరసుమభల్ల, మట్ల కోనయ యెల్లా"

మల్లవారి వంశావళి క్రీ. శ. 1220 నుండి 1800 వరకు (15-6-22 నాటి వ్రాతప్రతిని అనుసరించి) 94 నుండి 100 పుటల వరకు వివరింపబడియున్నది.

మదరాసు రాష్ట్రమున శ్రీ వి. రంగాచార్యులు సేకరించి ప్రకటించిన మల్లరాజ వంశక్రమనిర్ణయమిట్లున్నది: మల్ల అనంతరాజు కడపలో పాలించినట్లు 762 పుటలోను, కర్నూలులో ఏలినట్లు 68వ పుటలోను గలదు. ఇతడు 1714 సం॥ మొదలు 1782 వరకు రాజ్యాధికారము వహియించిన ప్రభువు. (సర్కారు రికార్డుల ప్రకారము) కడప 686, కర్నూలు 584 వ్రాతప్రతుల వలనను, ఇంకను గొన్ని శాసనాధారముల వలనను పై విషయము విశదమగుచున్నది.

మల్ల అనంతరాజును గూర్చి కడపప్రతి 488 వ్రాతప్రతిలోను, మల్ల కుమారరాజును గూర్చి. కడప ప్రతి 402 సి-లోను మల్ల కుమారానంతరాజును గూర్చి కడప ప్రతి 644 లోను దెలియవచ్చుచున్నది.

క్రీ. శ. 1712 సం॥న వెంకటకృష్ణ చోళ మహారాజు కుమారుడయిన పెరుమాళ్ళరాజు-కడప జిల్లాలో రైతుల సౌకర్యార్థము నీటి వసతులకయి కష్టనష్టములు భరించి పెక్కు కాలువలు త్రవ్వించినట్లు 1911 లో సేకరింపబడ్డ కడపమండలి రికార్డులు, 705 430 సంఖ్యలు గల వ్రాతప్రతులలో గలవు. 1719సం॥న మల్ల నృపాలుడను కుమారానంత రాజు కడపలోని పలుప్రాంతముల నేలెను. (కడప వ్రాతప్రతులు 706-707)

క్రీ. శ. 1625 సంవత్సర ప్రాంతమున కడప కర్నూలు మండలములను బరిపాలించిన మల్లరాజు కర్నూలు రికార్డుల ననుసరించి, అహోబలమునకు యాత్రార్థము వెడలియుండె. అక్కడి విష్ణు (నరసింహ) దేవునకు జరుగదగిన నిత్యోత్సవాదులకు లోపము గలుగకుండునట్లు చరింప నాజ్ఞాపించెను. అంతియగాక ఆప్రభుని పితామహు మృతి చిహ్నముగ ఆదేవాలయ ధర్మకర్తృత్వము వైష్ణవ సంప్రదాయము ప్రకారము ఉద్ధరింప నుత్తరువిచ్చెను. అంతకు ముందు-విదేండ్ల క్రిందట అనంతపురపాలకుడైన హండే వంశస్థుడగు ప్రభువుయొక్క సహాయముతో, గొల్కొండనవాబయిన ఇబ్రహీంకుతుబ్ షా నాయకత్వాన, (అస్థానికుడే యయిన) చోళుని గద్దెమీదికి దండెత్తి వచ్చెను చోళులు సహజముగనే శైవమతావలంబులు. కాన, అహోబలాది వైష్ణవ మత ప్రాబల్యముగల ప్రదేశములన్నింటిని కంటగించుకొనువారు. ఈ చోళవంశ పరంపరకు జెందియుండె. తుటికెల దండయాత్రలను అరికట్టిన ప్రస్తుత పాలకుని తాతకు నరసింహ కైంకర్యాదికముల నెఱవేర్చు కర్మకర్తృత్వము సంక్రమింపజేసెను. (ఇట్టియెడ చోళులన్న మట్లవారే.)

మరల 1592 లో గంగానగరమను చోళ మహారాజు కొంత భూదాన మొసంగినట్లు సర్కారురికార్డుల వలనను, కడప మండలిలోని శాసనముల వలనను దెలియవచ్చుచున్నది.

క్రీ. శ. 1600 సం॥న కడప జిల్లలోని మట్ల ప్రభువగు అనంతదేవచోళ మహారాజు భూదానము చేసినట్లా మండల మండలిదే యగు మరియొక శాసనము ప్రకటించుచున్నది.

## క్రీ. శ. 18-వ శతాబ్దిలో దక్షిణదేశ పరిస్థితులు

క్రీ. శ. 1704-వ యేటి సంభవములను స్వయముగా బరికించిన 'దుల్పత్ రాయి' — అను చరిత్రకారుడు ముఖ్యముగా హైదరాబాదు, బిజాపూరు సామ్రాజ్యములను, దక్కను ప్రదేశమును గూర్చి విపులముగా జర్చించెను. అందలి కొన్నియంశము లేని తెలిసికొన్నచో, ఆ కాలపు రాచటికము లెట్టి పరిస్థితులలో నుండెనో యించుక గ్రహింపవచ్చును.

ఆ సామ్రాజ్యములలోని జాగీరుదారులు రైతుల కొరకు పూర్వపు సౌకర్యముల ప్రస్తావములకే పోవు వారు కారు. కాని వారి కార్యాచరణములకై కేవల సీన ద్రవ్యమును అప్పుడప్పుడు సందకరువుగ నిచ్చి, దానిని సులభముగ జెల్లింపబడు ననుకూలములను మాత్రము గలిగించెడివారు. దక్కనులోని ప్రాచీన రాజ్యములను, వాని జాగీరుదారులను బట్టి పల్లార్చుటలో నుద్దండులయిన గవర్నర్ల నిర్దయాత్మక పీడనములకు వారు అగ్గమగుచుండిరి.

జాగీరుదారులు తమపై పెత్తనము చేయు సివిల్ ఉద్యోగులకు గావలసిన సౌకర్యములన్నిటిని సమకూర్చుటయేగాక పెద్ద పెద్ద మొత్తములను వారికి లంచముల క్రింద ముట్టజెప్పెడివారు. వారి చెప్పుచేతుల్లో మెలగు నౌకర్లు ఊరూరా దిరిగి, తమ యధికారులకు గావలసిన వస్తుసముదాయములను విస్తారముగ సేకరించెడివారు.

దీనికిఁదోడు కొందఱు కరగ్రాహులు (మాండలికులు, or colectors) వేలకొలఁదిగ నున్న రైతులనుండి రాజభాండాగారమునకుఁ జేరవలసిన పన్నులు కిస్తీలు. రొక్కపంశాలు పూర్తిగా వసూలు చేసియుఁ దక్కువ మొత్తములకే వారికి రసీదులు ఇచ్చెడివారు. రైతులిట్లు మాటిమాటికిఁ దటస్థించు నిర్బంధములకుఁ దట్టుకొనఁజాలక, తమ యధీనమున నుండు సాగుబడిభూములలో విశేషభాగములను బీడుపెట్టి, దారి దోపిడిదారులుగ తయారయిరి.

ఇట్టి దక్కనుపాలకుల అశక్తతను గ్రహించి, దాగులు గొట్టు మహారాష్ట్రుల బందిపోటుతండములు తఱచు తండోపతండములుగ గ్రామములమీఁద బడి కొల్లగొట్టుచుండెను. (ఫెరిస్తా వ్రాసిన మహారాష్ట్ర చరిత్ర II

ఇట్లుండ మదరాసు ప్రజలు స్వసంరక్షణ మాశించి. తమ్ముఁ జేరరాఁగా వారి నాదరించి కాపాడవలసిన భారము ఆ ప్రాంత మేలుచుండిన పరిపాలకునిపైఁ బడెను. కాని, అక్కడి స్థిరవాసులలో గొందఱు తమ యిచ్చవచ్చినట్లు గష్టములు గలిగింప అట్టివారిని నగరము సరిహద్దులు దాఁటి చనలేక, అక్కడి ప్రభువు తగిన కట్టుదిట్టము లొనర్చెను. కాని యంత్రాగారములలోఁ బనిసేయు వారు వెళ్లుట కిష్టపడనిచో, స్వేచ్ఛగఁ దనపురినుండి వెడలిపోవచ్చునని ఆజ్ఞాపించెను.

1709 సం॥నకు ముందటేడు అనావృష్టి దోషమునకు బాల్పడిన దక్షిణ హిందూస్థానమంతట—అతివృష్టివలన వరదలతో గడుంగడు భీభత్సమయ్యెను.

1712 సం॥ మార్చిమాసము 8-వ తారీఖునకు దక్షిణ సముద్రతీరప్రదేశమగు మదరాసు మున్నగు ప్రాంతములను విజయరంగ చొక్కనాథ భూపుఁ డేలుచుండెను. కఱవు కాటకముల కగ్గమయి, క్రుంగి కూలారిన వ్యవసాయకులకా ప్రభువు పన్ను లెక్కువచేసెను. అట్టి దుర్భరస్థితిలో వారి క్షేమాత్రము సాయము సంపడదయ్యెను. ఒకనాఁడా రాజు వాహ్యాళి వెడలుచో తిండి తీర్థములు లేక, నానాటికి కృశించి చచ్చుటకంటె హఠాన్మరణము ముక్తిప్రదమని యెంచి ఒక రైతు తన దేహము చాలించు నుద్దేశమున దన యింటి పైభాగమునుండి క్రిందికి దుముకఁగ కూలి, ఆ రైతు కన్నుయెదుటనే మృత్యుదేవిని గాంచి కొనెను. దానిగని వెంటనే చొక్కనాథుడు పన్నుల భారమునుండి రైతాంగమును విమోచించెను.

క్రీ. శ. 1726 సం॥న మహారాష్ట్ర నాయకుడగు పీష్వా బాజీరావు (సతారా) మైసూరుమీదికి దాడి సలుప అక్కడి నాయక ప్రభువతనితో సమాధానపడి అతడు విధించిన 'చౌతు' పన్ను నొసంగ నంగీకరించెను. కాని అనతికాలమునకే నాయకపాలకుడు విడిది చాలించికొని వెడలిపోయెను. వెంటనే మహామ్మదీయులు ఆ ప్రదేశములోని పలుచోట్ల రైతు జనాంగమును బాధించి, వారి యాస్తులనేగాక, యేలికకు సంబంధించిన విలువగల వస్తువాహనాదికముల గూడ కొల్లగొట్టుకొని మరలిననిరి.

క్రీ. శ. 1730 సం॥న తంజావూరిలో మహాఘోర క్షామము ప్రళయతాండవ మొనర్చెను. అనపస్థులు, నిస్వస్తులచేఁ బ్రాణివర్గమెల్ల అరచేతిలోఁ బ్రాణము లుంచుకొని, యెట్లో కాలము గడుపఁజొచ్చెను, జన సమూహము సంఘమరణముల పాలయ్యెను. పీనుగులు, పూడ్చువారు లేమి గ్రద్దలకు రాబందులకు—కడుపారఁ దినఁగినవయ్యెను.

క్రీ. శ. 1731 సం॥ న విజయరంగ చొక్కనాథుఁడు మరణించెను. అతని కళత్రమగు మీనాక్షి తన దత్తపుత్రుఁడగు విజయకుమారుని పేర జాగీరు నేలఁదొడఁగెను. అందులకు సమ్మతింపక తిరుగఁబడిన సామంతులవలనఁ గలఁత లేర్పడెను.

క్రీ. శ. 1733 సం॥ న చెంగల్పట్టు మండలమున దురంతమగు కాటక మేర్పడెను.

క్రీ. శ. 1736 సం॥ న కర్ణాటము నవాబగు చందా సాహెబు మీనాక్షి దేవిని చెఱబట్టెను. కొన్నాళ్లు కామె ఆ కారాగారముననే అసువుల వీడెను. ఆమెతో మధుర నాయకరాజ యుగ మంతరించెను.

## వేంకటపతిరాయల యేల్బడి : ఫ్రెంచివారి ప్రాబల్యము

క్రీ. శ. 1742—సం॥న విధ్వంసమయిన విజయనగర సామ్రాజ్యమును వేంకటపతిరాయలు సాధ్యమయినంతవఱకు ఉద్ధరించి ప్రజానురంజకముగఁ బరిపాలన మొనర్పఁగడంగెను. ప్రజాసంతోషమే యతని యెడ నతివేలమగు రాజభక్తి నెఱపుచుండెను. ఈ యంశములు బళ్లారిజిల్లాలోని యొకానొక శాసనమువలన తెలియవచ్చుచున్నది

క్రీ. శ 17.2 డిసెంబరు రెండవ తారీఖునాటి బళ్లారి శాసనమూలమున వేంకటపతిరాయటి

రాచఱికపు సామర్థ్యము వలననే దక్షిణమున విజయనగర సామ్రాజ్యము మరల తలయెత్తి ప్రాముఖ్యము వహించెనని ప్రజలు గుర్తించిరి.

1757 సం॥న ఫ్రెంచివారు బుస్సీ అనువాని యాజమాన్యము క్రింద విశాఖపట్టణ మండలమునందలి బొబ్బిలిని ముట్టడించిరి. అటఁ గ్రొత్తగా విజయనగరమునకుఁ బ్రభువయి అంతగాఁ బలుకుబడిలేని శ్రీ రామరాజు సహకారమును పొందిన ఫ్రెంచివారు తమ పంతము నెగ్గించుకొనిరి. తుదకారాజు బొబ్బిలిపాళెగాని సమ్మిశ్రవంటుగ మెలఁగుచుండిన తాండ్ర పాపారాయనిచే వధింపఁబడెను. ఇందు ఫ్రెంచివారికి హైదరును తోడ్పడెను.

1759 సం॥న కలనల్ ఫోర్డు మచిలీపట్టణమునకు దాడివెడలి, దానిని పట్టుకొనెను.

1761 సం॥న హైదరాలి మైసూరు దుర్గమున బహిరంగముగఁ బ్రవేశించి, అక్కడిరాజును సింహాసన భ్రష్టునొనర్చి, తానే సర్వాధికారములు వహించెను.

1776 సం॥ టిప్పు, ఆనెగొందివఱకుఁగల భూభాగమంతటిని సర్వనాశన మొనర్చి, తిరుమల (తిమ్మప్ప?) రాజును రాజ్యాధిపత్యమునుండి తొలఁగించెను. ఈ తిమ్మప్ప ప్రాచీన విజయనగరసామ్రాజ్య చక్రవర్తులై పాలించిన రాజులలో నాల్గవ పురుషాంతర (వంశ పరంపర)మునకుఁ జెందిన కడపటి ప్రభువు.

1780 సంవత్సరమున దక్షిణభారతమునకుఁజేరిన తెలుగు మండలములలో సర్వజీవలోక ధూమకేతువగు దారుణ క్షామము సంభవించెను.

1782 సం॥నందలి శాసనము ననుసరించి, కందనోలిలో గొప్ప రాజకీయోద్యోగిగ అధికారము నెఱపుచుండిన మహమ్మదీయ పాదుషా బందిపోటు, దారిదోపిళ్ళు చేయించుచుఁ, జేయుచుఁ బ్రజాపీడ కలిగించునట్టి హైదరు దారుణచర్యలను అరికట్టుటకై సర్కారు ఉద్యోగులకు సహాయమొనర్చుటకు మల్లారెడ్డి అను పలుకుబడిగల పాళెగాని కాజ్ఞాపించెను. (కర్నూలి శాసనము.)

1789—నుండి మూఁడేండ్లవఱకు దక్షిణహిందూస్థానమునఁ దీవ్రమగు ననావృష్టి దోషము సంభవించెను. అట్టితఱిఁ దిండిలేమిఁ దెలుఁగు మాగాణమువఱకు జన సంఖ్యలోఁ బదియవ వంతు నిర్మూలమయ్యెను.

కొన్ని తామ్ర శిలాశాసనములను అనుసరించి గోల్కొండ మున్నగు ప్రదేశములను ఆకాలమున నేలుచుండిన మహమ్మదీయ ప్రభువులలో పెక్కురు హిందు మహమ్మదీయులయైకమత్యము నెడల శ్రద్ధ వహించిన విషయమును అనేక శాసనములు విస్పష్టపఱచుచున్నవి. ఆ నవాబులు అత్యంత ఔదార్యవంతులనియు కూడ వారివలన రుజువగుచున్నది. ఇట్లు 16 17 శతాబ్దములలో సుల్తానులు ప్రశాంతముగఁ బ్రజలు తమజీవితములు వెళ్ళఁబుచ్చుటకుఁ దగిన సదుపాయములెల్ల సమకూర్చిరి. అందుఁ గొన్ని:

క్రీ. శ. 1586 సం'నందలి యొకానొక శాసనము మూలముగ సర్కారులలోని నెల్లూరు మండలమున ఒకానొక సుల్తాను దన యాధిపత్యము చెల్లించుచుండెననియు, హిందూ మహమ్మదీయ మతస్థులయొక్క దయాపూర్వకమగు సమరసభావమును జూపుచుండెననియుఁ దెలియుచున్నది. ఆ నవాబులలో నొకఁడగు 'లాల్ఖాను' అనువాఁడు—బ్రిటీషువారికి కొంత భూమిని ఇనాముగా నిచ్చెను. గోల్కొండనవాబయిన కులికుతుబ్షా మహమ్మదీయ మతప్రభావముగల తుఱకలకుఁ గూడ నా రీతిగనె దాన మొనర్చెను.

క్రీ॥ శ॥ 1587 సం॥ మున కడపమండలిలోని సిద్ధవటము గ్రామపంచాయితీ సంఘము 100 లూగోలు (సెంట్లు ?) భూమిని మహమ్మదీయుఁడయిన పీర్ జాదా సాహేబునకు యిచ్చెను.

క్రీ: శ. 1589 సం॥రము మార్చి పదునాఱవ తరీఖు శాసనమున—గోల్కొండసుల్తాను రైతులకు నీటి సౌకర్యార్థము ఒక చెఱువునుఁ ద్రవ్వించినట్లు తెలుపుచున్నది. (ఇది గంజాము మండలములోనిది) ఈ సుల్తాను ఆంధ్ర, త్రిలింగ, మన్యము ప్రదేశములలోని 84 కోటల కాధిపత్యము వహించి, తన యాజ్ఞ చెల్లించెను. (గంజాము మండలి రికార్డులు—15,—1913 నాఁడు కనుగొన్న 187 సంఖ్యలు గలవి)

గంజముజిల్లా శాసన మింకను ఇట్లు చెప్పుచున్నది:—

అప్పుడు ఉత్కల దేశమును (కళింగము, రాజమహేంద్రవరము సౌరాష్ట్రము మున్నగు ప్రాంతములు చేరిన దేశమును, పాళువ నరసింహారాయలను విజయనగరరాజు సంతతిలోని యతఁడు పాలించుచుండెను. ఇతఁడు ముకుంద దేవరాయల యనంతరము 1551 సం॥ న ప్రాముఖ్యమునకు వచ్చి రాజ్యాధిపతి అయ్యెను. (శ్రీ వి. రంగాచార్యులు సేకరించిన చరిత్ర.)

క్రీ. శ. 1600—న దక్కను భూభాగమం దంతట నగణిత దారుణ దుర్భరక్షామము సంభవించెను.

క్రీ. శ. 1611 సం॥న ఇంగ్లీషు కప్పెను ఓడలను నిర్మించుటకు 'పెట్టిపోలున (ఇది మచిలీపట్టణమునకు 36 మైళ్ళ పశ్చిమమునఁగలదు. తరువాత ఈ పెట్టిపోలు పేరు నెజాం పట్టణముగ మారిపోయినది. ఈ యింగ్లీషు కెప్టను వ్యాపారార్థము మచిలీపట్టణమున) ఒక ఏజన్సీని స్థాపించెను.

క్రీ. 1622 న మరల దేశమునఁ గాటకము ప్రబలెను. అప్పటి ప్రజల దురవస్థలనుగూర్చి ఒక క్రైస్తవ మతగురువు చక్కగ వర్ణించెను. (వ్రాత ప్రతి—1923—ఎటిది—పుటలు 284.

క్రీ. శ. 1625-న బ్రిటిషువారు వణిక్కర్మాగారములను నెలకొల్పుకొనుటకును, పులికాటు సమీపమందలి 'ఆర్మగము' ఆర్మగోన్ అనుచోట గొంత భూభాగమును వెంకటగిరిరాజులు ఉచితముగా నిచ్చిరి.

క్రీ. శ. 1628-న మచిలీపట్టణమున ఇంగ్లీషు వర్తకులు తమ అంతఃకలహములవలన నక్కడి కర్మాగారమును విడిచిపోయిరి. ఏ వేళ కేమి తటస్థించునో యని ఆర్మగమున ఆత్మసంరక్షణార్థము వారు 17 ఫిరంగుల నెల్లప్పుడు సంసిద్ధముగ నుంచియుండిరి.

1629-న అప్పటి మదరాసు రాష్ట్రమునకు ఉత్తర భాగమునను, దక్కనులోను సర్వవినాశకారణమయిన దుర్వార క్షామము సంభవించెను. అది పెక్కేండ్లవరకుఁ బ్రజాసముదాయమును దనపొట్టఁ బెట్టుకొనెను.

1640 లోఁ గూడ స్థితిగతులు కించిత్తయిన మారలేదు. [1923 లో సేకరించిన సర్కారు రికార్డుల వ్రాతప్రతి (శాసనమునకు) నకలయినదాని యందలి 237 పుట]—అది మధురలో—1646—లో ఆరంభించినది. దాని తాకిడి విస్తరించి మదరాసు కర్మాగారములోని పనివాండ్రకెక్కుడుగఁ గష్టనష్టములు గలిగించినవి. అట్టియెడ బీదలయిన కష్టజీవులు కర్మాగారాధికారుల కడకేగి, కొన్నిటన్నుల బియ్యము నిచ్చి, తమ ప్రాణములఁ గావ పలువిధముల వేఁడికొనిరి. వారాయేఁట అక్టోబరు నెలలో మదరాసు సెటిల్మెంటులోను పులికాటు శాంతోములలోను తిండిలేక పలువిధముల బాధపడిరి. అందు పెక్కురు మరణించిరని అధికారులకు పంపిన మహాజర్లలో సూచించిరి. అట్లు మొత్తము మీఁద మృతిగన్నవారు 30000 మంది:—(శాసనము సంఖ్య 75)

1648—న విశ్వరూపము దాల్చినట్లు విఖ్యాతి నొందిన దక్షిణ దేశమంతయును వ్యాపించిన కాటకము కొరుంటూరు — తత్పరిసర ప్రదేశములలో విజృంభించుటచే అక్కడి జనాంగములో విశేషభాగము

1659—న అనావృష్టికతమునను సహింపరాని క్షామకారణమునను మధుర ప్రాంతమునఁ జాలమంది అసువులు విడిరని జెస్యూటు క్రైస్తవ మతగురు వొకఁ డానాఁటితీవ్రతకుఁ దటుకొనలేక ఒక ప్రదేశమునందే, దాదాపు 10000 మంది క్రైస్తవులు మృత్యుకరాళ దంష్ట్రలకుఁజిక్కి యూరుపేరు లేకుండఁ బోయిరని తెలియజేసెను. (సర్కారు రికార్డు 1923 సం॥ నాటి దానిలో 237 పుట—) ఈ 1659 నాటికి—కడప మండలమునకు వచ్చి స్థిర నివాసము లేర్పఱచుకొన్న మహమ్మదీయులు అక్కడి హైందవులతోఁ గలసిమెలసి సుహృద్భావముతో వ్యవహరించుచుండిరి. ఒక్కొక్కప్పుడు, వారు హిందూ దేవాలయములకుఁ బంగారము దానము సలిపినట్లును, హైందవులయిన రైతులకు నీటి సౌకర్యాదికములు సమకూర్చుకొనఁ దోడ్పడినట్లును దెలియుచున్నది (కడప శాసన సంఖ్యలు : 188, 247)

క్రీ. శ॥ 1670 సం॥న మరల దుర్నివార దారుణ క్షామము దక్షిణ హిందూస్థానమున వ్యాపించెను. అది ప్రజానీకమును పీల్చి పిప్పి చేసివేచెను.

## టిప్పుసుల్తాను

విజయనగర సామ్రాజ్య ప్రతినిధిగ ఆ కాలమున (1776 సం॥న) ఆనెగొందిని తిరుమల (తిమ్మప్ప) రాజేలసాగెను.

1782 వ సం॥న ఆంగ్లులు దక్షిణమునఁ దమ ప్రతాపముచే పైకి వచ్చుచుండిన హైదరును, అతని పుత్రుడగు టిప్పును మార్కొని యుద్ధమొనర్చి యోడించి వేలూరినుండి తఱుమఁగొట్టిరి. కాని, టిప్పు బ్రిటిషు సైన్యము నోడించి, కడలూరిని బట్టుకొనెను.

1783-న టిప్పు ఆర్కాటు విడిచి, బెదనూరిలో విశ్రాంతి గొనుచుండ ఆ యూరినుండియు, అనంతపురమునుండియు బ్రిటిషువారు దండెత్తి అతనిఁ దఱుమఁగొట్టిరి. అంతియగాక, ఇంగ్లీషువారిచే తుద కాతఁడు చెఱబట్టబడెను. కాని, టిప్పు మఱికొంత

కాలముననే విముక్తి పొందెను. పాల్ఘాటు, కోయంబత్తూరులను టిప్పుసుల్తానుతోఁ బోరి యింగ్లీషువారు గ్రమించుకొనిరి. కాని మద్రాసులోని యధికారుల యాజ్ఞననుసరించి వానిని వదలుకొనవలసి వచ్చెను.

1784-న టిప్పుసుల్తాను మంగళూరిని ఒక్క సం॥రము ముట్టడించెను. అక్కడి బ్రిటిషువారి మూలబలమును తనకు లొంగిపోవునట్లు నిర్బంధించెను. అప్పుడతనితో ఇంగ్లీషువారు రాజీపడిరి. తదనుసారము పరస్పరము గెలుచుకొన్న ప్రదేశములను వదలుకొన నంగీకరించిరి. 1785-న టిప్పు మహారాష్ట్రులమీదికి దండెత్తి వారితో యుద్ధమొనర్చెను. అతఁడు కడప మండలమందలి కొన్ని గ్రామములు వారికిచ్చెను. (కడప శాసన సంఖ్య 394.)

1786 నందలి తూర్పు మైసూరు నియొకానొక శాసనమున టిప్పుసుల్తాను 'విశ్వసనీయ సార్వభౌముఁడు' అని పేర్కొనబడెను.

1787 సం॥ న॥ విజయనగర సామ్రాజ్య సార్వభౌముల వంశమునకు చెందిన రాజొకఁడు ఆనెగొందిని పరిపాలించుచుండెను. అతని రాజ్యములోని భాగమేయై, బళ్ళారిమండలాంతర్గతముగ నెలకొనియుండిన రాయదుర్గమును హర్పనహళ్ళిని టిప్పుసుల్తాను ముట్టడించెను. అట్టియెడ అతనితో ఆనెగొందిరాజు సమాధానమునకువచ్చి, జడాసు, కిట్టూరు, వర్గొండ—లను టిప్పునకిచ్చివేయుటయే గాక, అతనికిఁ గొంత ధనమును గూడ నొసంగునట్లు సమ్మతించి తాత్కాలికముగ యుద్ధమునుమాత్రము నిలిపెను.

1788 సం॥ మున కడపజిల్లాలోఁ గొన్ని గ్రామములు దానము టిప్పు చలిపినట్లు కడపజిల్లాలోని శాసనాధారములవలన గ్రహింపనగును. (కడప శాసనము 390 సంఖ్య కలది)

1790 లో టిప్పు తిరువాన్కూరిని, ఈరోడ్డును, మఱికొన్ని స్థలములను దనయధీనము క్రిందికిఁ దెచ్చుకొనెను. తరువాత తిరుచినాపల్లి కోటను ముట్టడించి—ఆ మండలము లన్నింటిని నిర్ధూమధామము నొనరించెను. టిప్పుసుల్తాను సైన్యములు తిరువాంకూరియందున బ్రిటిషువారిని తఱుముఁగొట్టుటయే గాక, కాలికట్టునొద్ద వారి నోడించెను.

1791 సం॥న టిప్పు కోయంబత్తూరిని ముట్టడించి పట్టుకొనెను. అక్కడి బ్రిటిషువారి రక్షక సైన్యము కోట విడిచిపోవునట్లు ఒత్తిడి కలిగించెను. వారక్లే చేయుమంచఁ జెఱపట్టి, కాళ్లకు చేతులకు సంకెలలు తగిలించి శ్రీరంగపట్టణమునకుఁ బంపివైచెను.

1795 నాటికి వనగాలు సన్నద్ధిగ నుండవలెనను ఊహతో టిప్పుసుల్తాను పలువిధ నష్టములకు సహించి మైసూరుగా ఎమిమున నున్న యొక చెఱువునకు బలవత్తరముగ గట్టు కట్టించెను.

## మట్లరాజుల ప్రాబల్యము

దక్కనులోని శ్రీరంగపట్టణము, మైసూరు మొదలయిన ప్రాంతములను హైదరాలి టిప్పుసుల్తానులు పూర్తిగా స్వాధీనము చేసికొనుచుండఁగా, కడప కర్నూలు మండలములలో తమ యధికారమును చెల్లించుచుండిరి. అట్టియెడ గోలకొండ నవాబులు దక్షిణ మండలములలో హైందవ మహమ్మదీయులను సరిసమానముగా జూచుచు ప్రజలయవసరములకు ఆదుకొనుచు వారిని మాలిమిచేసికొన జొచ్చిరి.

ఆ యదనన, హిందూరాజులచెంతఁ బ్రాముఖ్యమువహించియుండిన దండనాథులు మున్నగువారు స్వతంత్రులై—సామ్రాజ్యములను స్థాపించుకొన దీవ్ర యత్నములు చేసికొనుచున్న తుఱక ప్రభువుల కెదురు తిరిగి తామే లేచి కట్టుచుండిన కప్పములు చెల్లింపరైరి. అట్టివారిపై దండెత్తుటచే గొందఱిని లోబడిచచ్చి, శరణాగతులయిన వారిని గొందఱిని తమకు సామంతులుగను, పాళెయగాండ్లుగను, జాగిరుదారులుగను జేసికొని మహమ్మదీయులు తమ ప్రతాపము చెల్లించుచుండిరి. అందు మట్లవారొకరు.

అందు ఈ 'కకుత్స్థ విజయ' కర్తయగు అనంతరాజు ఎల్లమరాజు పుత్రుఁడు. ఎల్లమరాజునకు నలువురు భార్యలు. వారిలో రంగమాంబయందు ఈమట్ల అనంతరాజు ఉదయించెను. ఈ గ్రంథమున మట్లవారి చరిత్ర పూర్తిగను విశదముగను గాదు. తక్కిన కవులవలెనే, ఈ కకుత్స్థ విజయకర్తయు—తనయొక్క గాని, తన వారి పరిపాలనయొక్క గాని కాలములను సూచింపలేదు. బహుశః ప్రబంధ యుగమందలి కవులకీ అలవాటు లేదేమో!

మట్ల ప్రభువులకు ఎఱ్ఱుపల్లి కోట (కోడూరుకు ఐదు మైళ్ళ దూరములోనిది), చిట్వేలి (రాజంపేట సమీపములోనిది), నగిరిపాడు (కోడూరుకి పదిమైళ్ళ దూరములోనిది), సిద్ధవటము, మొదలగు ప్రదేశములయందు బలమయినకోటలుండినవట! అందు నగరి పాటి

ప్రశంస కకుత్స్థవిజయమునఁ గానవచ్చుచున్నది.2 కాని.—'నగరిపాడు.' అను గ్రామము 'పెద్ద' - 'చిన్న' - అని రెండుగాక ఒక చేటకనబడుచున్నది, అది నేఁడొక పల్లెటూరు. అటఁ గోటలు పదికలవని కకుత్స్థవిజయ ప్రబంధమున ఉన్నను. ఈనాటి కందొక్కటియు లేదు. అక్కడక్కడఁ గొన్ని రాళ్ళగుట్టలున్నవి ఎత్తి గుంటలలో మాత్రము శిథిలమయిన యానాఁటి కోటను 30 సంవత్సరాఁడు ఈవంశములోని కడపటి యతఁడును, కార్వేటినగర సంస్థానాధీశ్వరుల వియ్యము నగు మట వేంకటపతిరాజు విక్రయించెను. తక్కినచోటులలోనివి నామమాత్రావశిష్టములు. కర్నూలుగంజలి నేలిన దొరలును, తామాక్రమించిన ప్రదేశములలో మట్టి కోటలు గట్టుకొన్నట్లు రికార్డుదాఖలాలు ఆ యా మండలములలో లభించుచున్నవి. సిద్ధవటమును గూర్చియు కకుత్స్థవిజయము పీఠికాభాగమునందలి పద్యం తములలోఁగలదు.

మట్లరాజులు వైష్ణవమతానుయాయులు. కకుత్స్థవిజయకర్త, తన వంశానువర్ణనము చేయుపట్టునఁ దాను "శ్రీమత్తిరుమల తోడప్పాచార్య చరణసరసీరుహ సేవాసమారబ్ధ సామ్రాజ్య ధౌరేయు"-అని తెలుపుకొనెను.

ఇఁకఁ గులమును గూర్చి:—ఈమట్లవారలు సదాశివ దేవరాయలు (జీర్ణవిజయనగరపతి శ్రీకృష్ణదేవరాయలు) అను తుళువవంశమునఁ గజపతిచక్రవర్తిగ వెలసిన మహీపాలునితో సంబంధ బాంధవ్యములు నెఱపెనని పైనఁ దెలిపియున్నాను. శ్రీకృష్ణదేవరాయఁడు ఉత్తమక్షత్రియుఁడు గాఁడని, యానాఁటి ప్రవాదముండుండెను. ఆ కారణమున నేక లింగరాజగు గజపతి శ్రీకృష్ణదేవరాయునిఁ దన కుమారినీయ నిరాకరించెనని చరిత్రములు వాకొనును. ఇందులకు నిదర్శనము నగును, సాళ్వ తుళువ వంశక్షత్రియులు దక్షిణ హిందూస్థానమందలి పడమటి భాగమున నుండిన హైదరాబాదు నవాబులగు నైజాముల్ ముల్కునకు లోబడినవారు. ఆముల్కుల రాజ్యమునకు సంబంధించినవారగుట అక్కడి క్షత్రియులేగాక బ్రాహ్మణులను ముల్క (ములికి—మురికి) నాటివారుగ నెన్నబడుచుండిరి. ఇంకొక రాజులకును నందిమండల క్షత్రియులను ప్రఖ్యాతి గలుగు—ఆ యా హేతువులనబట్టే—ములికినాటి రాజులకును, నందమండల రాజులకును ఇచ్చిపుచ్చుకోలులు లేవు. దక్కనులోని నగరిపాడు,—కార్వేటినగరము - ఆనెగొంది సంస్థానముల నేలు ములనునాటి రాజులకు సంబంధబాంధవ్యములు పెక్కులున్నవి.

ఈశతాబ్ద ప్రారంభమున కార్వేటి నగర మేలిన తిరుమలరాజు భార్య మట్లవారింటి ఆఁడుబడుచు. యం యాల్. యే.—గా ఉండి కొన్నేండ్లక్రింద చనిపోయిన శ్రీ కుమారస్వామి రాజాగారు—ఆ దంపతులకు రెండవ కుమారుఁడు. మొదటివాఁడు కుమార వెంకటపెరుమాళ్ళరాజు. అతఁడు కార్వేటినగర రాజులలోఁ గడపటి వాఁడు. అప్పటికే ఆ సంస్థానము క్షీణదశకు వచ్చినందున లాంఛనముగ నతఁడు పట్టాభిషిక్తుఁడై సింహాసనమెక్కిన తరువాత మూఁడునాల్గు వత్సరములలో మరణించెను. ఒకదిక్కున నగరరక్షణ మొనరింప నియమింపబడిన ఆనెగొందిరాజు శ్రీకృష్ణరాయలవలె ములికినాటి ధరణీధవుఁడే. గోదావరి మండలాంతర్గత విజయనగరరాజ వంశము బహుశః నందిమండల శాఖకు జెందినదేమో! వారికిని ఈ దక్షిణదేశ క్షత్రియులకును వివాహము నను సంబంధము లేదు.

ఆ కాలమున పరిపాలకులు సామ్రాజ్యపునరుద్ధరణమునే మఱచిరి. శైవవైష్ణవ మతవిభేదములు హెచ్చుపెరిగెను. ఇంతలో మహాపరాక్రమశాలియగు అళియరామరాజు తుఱకలతోడి దాగుణయుద్ధమునఁ జిత్రవధ కగ్గమయ్యెను. మహమ్మదీయుల దురాగతములకు ప్రజలు తట్టుకొనలేకపోయిరి. అటని తరువాత సామ్రాజ్యము ఛిన్నాభిన్నమయ్యె.

మహమ్మదీయు లాయాకాలము దొరకబుచ్చుకొని పాలేగారులు, జమీందారులు, జాగీరుదార్లు—మున్నగువారిని గాఁబెట్టి నేలరాచి లోబఱచికొని యేటేట కప్పములు గొనసుపయోగించుకొనిరి. మట్ల రాజులును దానిని తప్పించుకొనఁజాలరైరి. దక్కను సీమను దనసామ్రాజ్యభాగముగఁ జేసికొన భగీరథ ప్రయత్నమొనర్చిన మొఘలు సార్వభౌముని ఔరంగజేబునొక్క నమ్మినబంటయి గోల్కొండ మొద

2 "పెదనగరపాటికోటలు
పదిగల, వని వజ్రమణులు పసులవి యెల్లన్
మొదలితెగ మూఁడుఁ దెరులు
మదకరులును హాయులు, రాజ్యమాన్యము లుండున్

3 "పటుహీభూతక్ష్వేడా
భటజాతీభూతబాహు ఫలితకగోటో
త్కటఘ త సిద్ధవట పటు
పుటభేదన ...."

లను బహామనీసుల్తానులను, నైజామును ధిక్కరింప జాలని హైదరాబాదు పాళెగాండ్లవలె మల్లవారలను నవాబులకుఁ గప్పములు చెల్లించుటయగాక, నజరానాలు, యుద్ధసహాయములు సలుపుచు గులాములయి సలాములు గొట్టుచు తమ పాళెములను, జాగీరులను, జమీనులను గాపాడుకొనుచుండిరి. ఆంగ్లేయులు తమ వ్యాపారార్థము అటనట కోటలు గట్టుకొనుచుఁ దమాశ్రయించు స్వదేశరాజులకుఁ దోడ్పడుచు తమ రాజ్యవైశాల్య మంతకంతకుఁ బెంపొందించుకొనుచున్న 17—18 వ శతాబ్దమును బరిశీలించుచో, భారతీయ ప్రభువుల యనైక్యము, పరస్పరాసహ్యము హైందవసామ్రాజ్య వినాశనమునకును, అన్యజాతుల రాజ్యాక్రమణమునకును — ఎంత యవకాశ మొసంగెనో సులభముగ గ్రహింపవచ్చును. మల్లరాజులు గూడ ఆ యూబిలో దిగఁబడి మరల లేవలేకపోవుటలో వింత లేదు.

## మల్ల భూపుల సారస్వతాభిమానము, వితరణము

శ్రీకృష్ణదేవరాయల కాలమునఁ బ్రారంభమయిన ప్రబంధయుగమున వాగ్దేవి అష్టాదశవర్ణనాత్మక శృంఖలములతో బంధింపఁబడెను. అది 16 శతాబ్దినుండి 150 వత్సరములు నిరాఘాటముగ ఆంధ్రసీమలో విరవిహారము సలిపెను. ఇటనుటచేఁ దరువాతఁ బ్రబంధరచన మే యాఁగిపోయెనని కాదు. సన్నగిల్లినది. అట్టివారు కొన్ని నియమములకులోనై 'నిరంకుశాః కవయః' అను సూక్తిఁ బాటింపవలసియుండినందున స్వేచ్ఛగ, స్వతంత్రముగఁ దమ భావములకుఁ గావ్యస్వరూప మీఁజాలకపోయిరి. మల్లవారిపై ననేకులు భట్టురాజులు చాటువులుగ నెన్నియో పద్యములు చెప్పిరి. అందు దొరికినంతవఱకే సేకరించి, ఒకరిద్దఱు పండితులు ప్రకటించిరి. మిగిలినవి గూడ ప్రయత్నించి సమకూర్చినచో, వీరిని గూర్చినవి మాత్రమే [illegible] లభింపగలవు. ఈ ప్రభువంశపరంపరకుఁ జెందినవాఁడే—కకుత్స్థవిజయకర్తయగు అనంతభూపాలుఁడు. కవిచౌడప్ప ఇతని సమకాలికుఁడని చాటువులనుచున్నవి. కాని, ఆధారములుగా వినరావు. కకుత్స్థవిజయకర్త తన కావ్యమున నెక్కడను చెప్పుకొనలేదు. కవిచౌడప్ప మాత్రము తన శతకమున మల్ల అనంతరాజును ప్రశంసించిన పద్యమొక్కటి కనఁబడుచున్నది4. కాని, మల్లరాజులలో 'అనంత'—నామధేయులు చాలమంది కనఁబడుచున్నారు. అట్లగుట చౌడప్ప చెప్పిన యనంతమహీశుఁడు కకుత్స్థవిజయ రచయితయే యని బల్లగ్రుద్ది వాకొనఁజాలముగదా!

వీరు విద్వత్కవి పోషకులే గాక, తాము నట్టివారే అయిరి. కాని పెక్కురు కవులు దేవిడీ నాశ్రయించి ప్రభువు మన్ననలు గనుచు కాలము వెళ్లబుచ్చిరేకాని—శాశ్వతముగఁ దమ యశస్సు విస్తరించునట్టి కావ్యమును వ్రాసినవారు గారు. మల్లభూనేతల వంశపరంపరకుఁ జెందినవారిలో నెల్ల కకుత్స్థవిజయ కర్తయగు ఆనందభూపాలుఁ డొక్కఁడే రాజకవి—కవిరాజు—అని, అనిపించుకొని ప్రబంధపద్ధతి ననుసరించి, తన కావ్యమును సంతరించెను. రాయసీమను బేరుపెంపులతో నేలిన మల్లవా రాంధ్రసారస్వతమున కానాఁడు అవలంబనముగ నిలిచి దాని నుద్ధరించినట్లు కార్వేటినగర ధరణీంద్రులు సంస్కృత వాఙ్మయమును సముద్ధరించిరి. వారు స్వకీయముద్రాక్షరశాలలో ఎన్నియో గీర్వాణభాషాగ్రంథములు (చూర్ణికలు), రగడలు, వేదాంతగ్రంథములు, వైదికకర్మప్రతిపాదక పుస్తకములు, స్తోత్రములు మున్నగునవి ముద్రించి ప్రచురించిరి. ఆంధ్రగ్రంథములున్నను వానిని బయలు వెలువడలేదు. ఒక్క పార్వతీ పరిణయమును కృతికి మాత్రము వీరు వెలుగు చూపిరి. శ్రీ జయంతి రామయ్య పంతులుగారు చంద్రగిరిలో డిప్యూటీ కలెక్టరుగా ఉద్యోగము చేయునెడ సంస్థాన గ్రంథభాండాగారమున తాళపత్ర పుస్తకములు పరిశోధించి అందు దొరికిన చదలువాడ మల్లయ విరచిత విప్రనారాయణ చరిత్రము, ఋగ్వేదకవి వేంకటాచలకవి ప్రణీత చంపూరామాయణమును సంపాదించి ఆంధ్రపరిషత్కార్యాలయము మూలముగ బయటఁబెట్టిరి. కార్వేటినగర ప్రభువులు ప్రచురించిన వానిలో ముఖ్యములయిన గీర్వాణగ్రంథములలో ముఖ్యములయినవి: (1) పద్మావతీ పరిణయమను ప్రబంధము (2) దేవీపూజా కల్పము. అందు లలితోపాసకులచే దేవీపూజాకల్ప మత్యంత మీనాఁటికిని ఆదరింపఁబడుచున్నది. ఆనెగొంది కర్ణాట కాంధ్రదేశముల సరిహద్దులలోని యొక చిన్న సంస్థానము. దాని యేలికలు తెలుఁగు మాతృభాషగాఁగల వారగుటచేతను, దమయధీనమున నున్న దేశము కర్ణాట వ్యవహృతిలోనగుటచేతను,— అభిమానించఁదగు సారస్వత మిది యని గ్రహింపఁజాలకుండిరి. వితరణమునఁ దక్కిన రెండు సంస్థానములవలె వి భాషలోని విద్వదవతంసుల నేని సామాన్యముగ ఒకటే విధమున గౌరవించుచుఁ, దమ మాతృభాషయు రాజభాషయు నగు ఆంధ్రము నంతకే యాదరము మొగ్గు చూపిరి.

---

4. "ఏరా రాజులు భూమిని
వారై నెవఁడేలుఁగు సకలవైభవముల నీ
వే రాజవు నీతికి. విను
మా, రాజును నేనె కవుల మల్లయనంతా."

# మిథ్యా బింబాలు

శ్రీ ఆర్. ఎం. చిదంబరం

రిజిష్టరు ఉత్తరం వచ్చేసరికి సహోధ్యాయులంతా కళ్ళు పెద్దవి చేసి చూస్తుంటే నవ్వుకున్నా—అది అప్పు దగ్గర్నుంచి వచ్చిందని అడ్రసు చూడకుండానే తెలుసుకున్నా. అతనూ, నేనూ చెన్నపట్నంలో చదువుకున్నాం. ఆ తరువాత ఏడెనిమిది సంవత్సరాలకు కలకత్తాలో కలుసుకున్నాం. రెండు సంవత్సరాలు గడిచాక మళ్ళీ విడిపోయాం. తరువాత చాలా కాలానికి అతని దగ్గర్నుంచి వచ్చిన రెండో ఉత్తరం యిది. అతనికి తెలుగు బాగా తెలుసు. అతన్తో మాట్లాడిన ఏ వ్యక్తీ కూడా అతను తెలుగువాడు కాడని అనలేరు. అంత స్పష్టంగా, చక్కగా అనర్గళంగా మాట్లాడతాడు. అప్పు తన జీవితకాలంలో చాలా చోట్లు తిరిగాడు. రకరకాల మనుష్యుల్ని కలుసుకున్నాడు. మనస్తత్వాల్ని పరిశీలించాడు. ఉత్తరం విప్పిచూస్తే నలభై పేజీల గ్రంథం వుంది. కుర్చీకి జేరబడి చదవనారంభించాను.

*          *          *

డియర్ మూర్తీ,

ఈ వుత్తరం నీకు ఆశ్చర్యాన్ని కలిగించదు. కిందటి వుత్తరంలో నీకు నా అనుభవాలు కొన్ని వివరించాను—నీ దగ్గర్నుంచి ఏ విషయమూ దాచలేను. నీ కాలాన్ని కొంత వృథా చేస్తున్నందుకు బాధగానే వుంది.

జీవితంలో ఆనందం, విషాదం, వైరాగ్యం వీటి ఆద్యంతాలు నిర్ణయించిన వారెవరూ లేరు. పాప రమ్మని బలవంతం చేస్తే సర్కసుకు వెళ్ళక తప్పిందికాదు. అడవిజంతువుల క్రూరత్వాన్ని వర్ణించి ఆ చిన్న గుండెలో భయాన్ని రేకెత్తించటానికి ప్రయత్నించి ఓడిపోయాను. సర్కసు మొదలైన గంటకు ఓ అమ్మాయి తీగమీద ఒంటి చక్రం సైకిలును చకచకా నడిపించుకుంటూ పోయింది. ఆమె ముఖాన్ని సరిగ్గా చూడలేకపోయినా గుర్తుపట్టాను. ఏదో ఆవేదన విద్యుచ్ఛక్తిలా శరీరంలో పాకింది. అవును...ఆమె దేవకి—అదే చిరునవ్వు—చేతుల మృదుత్వం—కళ్ళల్లో మెరుపులు.

'ఇంతవరకూ తన శక్తి సామర్థ్యాలతో మిమ్మల్ని ఆశ్చర్య పరచింది మిస్ ఫిలోమెనా' అని యెవరో ప్రకటించారు.

'కాదు...ఆమె దేవకి-ఇందులో పొరపాటుంది.' అనరిచాను, నా చుట్టూ వున్న జనం వింతగా చూశారు.

'తాతయ్యా! నీకు మతిపోయిందా ఏమిటి? ఎందుకలా అరుస్తావ్?' అంది పాప.

ఆ తరువాత నేను ఏమీ చూడలేకపోయాను. దేవకి వంగి నమస్కరించి వెళ్ళిపోయింది.

సర్కసు పూర్తయ్యాక బయటకు వస్తూ గేటు దగ్గర ఆగిపోయాను. జనం పల్చబడ్డారు.

నీలిరంగు కోటు - పెన్సిలు గీతలా సన్నటి మీసం - చక్కగా ఎగదువ్విన క్రాపు-

'మీరు...మీరు...' అని తడబడ్డాను.

అతను గౌరవ సూచకంగా నవ్వి 'నేను ఈ సర్కస్ కంపెనీ మేనేజర్ని - మీ కేమైనా సాయం చేయగలనా? సర్కసు బాగుందా?' అన్నాడు.

'కాదు...కాదు...మీ పేరు?...నీ పేరు?'

'నా పేరు మాలిక్' అన్నాడు.

'మాలిక్! నన్ను గుర్తుపట్టలేదూ? నేను డాక్టర్ అప్పుని- నీ గురించి వివరాలు తెలుసుకుందుకు ఎంత ప్రయత్నించానో తెలుసా?...అది సరే కాని దేవకి పేరు 'ఫిలోమెనా' అని మార్చేశావేం?' ఆనందాతిరేకంలో అతని చేతులు రెండూ పట్టుకుని హృదయంలో పిచ్చి గీతల్లా సాగిపోతూన్న భావాలను చదువుదామనుకుని అలాగే నిలబడిపోయాను.

'క్షమించండి - మీ రెవరో నాకు తెలియదు. మనిషిని పోలిన మనిషి వుండటం సహజం- నేనెవరి పేరూ మార్చలేదు.'

అతని మాటలు అడవిలోంచి అల్లిబిల్లిగా సాగిపోతూన్న కాలిబాటను గుర్తుకు తెచ్చాయి. కాని వాదించి నిజానిజాలు తెలుసుకునేందుకు అధికారం, అవకాశం లేవు. నా వూహ సరైందని ఏదో శక్తి రుజువు చేస్తోంది. బరువుగా కదిలాను. పాప మౌనపు

ముసుగు వేసుకుంది. అంటే కోపం శాఖోపశాఖలు వేస్తూం దన్నమాట! ఇల్లు చేరుకోగానే నాన్నతో ఫిర్యాదు చేసింది.

'నాన్నా! ఈ తాతయ్య పూర్తిగా పిచ్చివాడై పోతున్నాడు. అప్పుడప్పుడు నన్ను కొత్తపేర్లతో పలుస్తాడు. సరే, పోతే పోయిం దనుకున్నాను. ఇవేళ ఆ సర్కసులో ఓ అమ్మాయిని చూసి 'దేవకి' అనరిచాడు. ఆ సర్కసు మేనేజరును 'నువ్వు మాలిక్‌వి.' అన్నాడు. ఓ పొడుగాటి ఇంజక్షనిచ్చెయ్!'

చిన్నగుండె! దావాగ్నిని అందులో దాచుకుని, అగ్నికణాలు లెక్కపెట్టే ఆత్మశక్తి ఎలా వస్తుంది?

మర్చిపోయిన దేవకి, మాలిక్‌లు మళ్ళీ ఎదురయ్యారు.

* * *

రంగూన్‌నుండి తిరిగివచ్చాక మళ్ళీ ఓ పల్లెటూరిలో డాక్టరుగా వెళ్ళాల్సి వచ్చింది. మొదట్లో ఆ వాతావరణాన్ని అసహ్యించుకున్నా, బలవంతంగా ప్రేమించటం తప్పించి గత్యంతరం కనపడలేదు. కొత్త మందులు కొన్ని కొనేందుకు చెన్నపట్నంలో ఓ వారం రోజులు మకాం వేశాను.

అప్పుడే కుటన్‌తో పరిచయం కలిగింది.

లావుగా, పొట్టిగా వున్న అతను గదిలో సామానంతా చిందర వందర చేసి ఆయాసంతో దేనికోసమో వెతుకుతూంటే లోపల అడుగు పెట్టాను. అతను పోగొట్టుకున్న వస్తువు నా చేతిలో వుంది. కొంత సంభాషణ జరిగిన తరువాత అతని పర్సు తిరిగిచ్చాను. మోహమెక్కుతుంటే నా కంటబడటం అతని అదృష్టమనాలి. అందులో రెండువేల రొక్కం, ఓ రాళ్ళ వుంగరం వున్నాయి. అంటే నా ఒక్కడికే 'నీతి-నిజాయితీ' వుందని చెప్పుకోటం కాదు. ప్రతిమనిషి తనలోకంటె ఇతరులలో లోపా లెక్కువని నమ్ముతాడు. అది భ్రమని, తప్పని తెలిసినా కూడా బాహాటంగా ఒప్పుకోడు. నేనూ ఆ తరగతికి చెందినవాణ్ణే. కనక ఆ పర్సు ఇతరుల చేతిలో పడివుంటే కుట్టన్‌కు తిరిగి దొరకదని స్థిరపరచుకున్నాను. నన్ను 'హరిశ్చంద్రుడి' పక్కన నిలబెట్టి పొగిడాక తన్నుగురించి చెప్పాడు.

కుట్టన్ ఓ సర్కసు కంపెనీ మానేజరు. ప్రస్తుతం వేసుంటున్న వూళ్ళోనే మకాం - వయసు యాభై సంవత్సరా లుంటాయి. కళ్ళకదలికల్నిబట్టి భావపు లోతు వూహించవచ్చు. మాటల తీరునుబట్టి శరీర దార్ఢ్యాన్ని తెలుసుకోవచ్చు. రహస్యాలకు దూరంగా వుండే కళ్ళు - చిన్న మీసం - సన్నటి నూలు పంచె - సిల్కు లాల్చీ - వేళ్ళకు రాళ్ళ వుంగరాలు - మెడలో చిన్న బంగారు గొలుసు - నుదుటిమీద చిన్న కుంకం బొట్టు - దూరంనుండి చూస్తే పట్టుదల-ముంగుకోపం-వెనక పశ్చాత్తాపం, అనురాగం, దయ-వున్న వ్యక్తిలా కనిపిస్తాడు. దగ్గరకు వెళ్ళి పరిశీలిస్తే తప్పించేసి ఏదో దాచడానికి ప్రయత్నిస్తున్న వాడిలా కనిపిస్తాడు. ఒక వ్యక్తిరూపం మనం చూసే దూరంమీద ఆధారపడి వుండడంటే మాత్రం నేను ఒప్పుకోను. దూరానికి అందంగావున్న అమ్మాయిదగ్గరకు వెళ్ళిచూస్తే మరోలా కనిపించటంలేదూ? అతని సర్కస్ కంపెనీలో వంద మందికిపైగా సిబ్బంది వున్నారు. జంతువులు బోలెడు. రాబడి సుమారుగా వుంటుంది. వీళ్ళలో ఎవరో ఒకరికి జబ్బుచేస్తూనే వుంటుంది. ఏ మేకో, సింహమో కాళ్ళు బారచాపి 'ససేమిరా' లేవనంటుంది. వీళ్ళకు వైద్యం చేయటానికి ఓ డాక్టరు అవసరం. కుట్టన్ నా స్నేహితం ఎందుకు కోరుతున్నాడో అర్థమైంది. కుట్టన్ ఆ సాయంత్రమే వెళ్ళిపోయాడు.

* * *

చెన్నపట్నంనుండి తిరిగి వచ్చేసరికి సూర్యుడు ఆకాశంలో కొంత భాగాన్ని జయించి తన స్వాధీనం చేసుకుని, మిగిలిన భాగాన్ని కూడా తన వశం చేసుకోటానికి సిద్ధంగావున్నాడు. దూరంగా సర్కసు డేరా చుట్టూ రంగురంగుల విద్యుద్దీపాలు కనిపించాయి. వెలగకుండానే అంత అందంగా వున్నప్పుడు, కాంతికిరణాలు కళ్ళు తెరిస్తే సౌందర్యపరిమాణం ఎంత వుంటుందో మరి! చుట్టూ చిన్న చిన్న గుడారాలు, కంగారుగా అటూ ఇటూ పరుగెత్తే మనుష్యులు, ఓమూల ధ్యానముద్రలో వుండి, తొండాలు వూగిస్తూ, బయటి ప్రపంచపు కుళ్ళు. అసంతృప్తి, అహంకారం తమ చెవులకు సోకకూడదని తరిమివేస్తున్న ఏనుగులు, గొలుసులు తెంచుకుని స్వేచ్ఛకోసం పెనగులాడుతున్న కోతులు - గుడారానికి ఇరవై గజాల దూరంలో కుట్టన్ ఓ పెంకుటిల్లు అద్దెకు తీసుకున్నాడు. ఆప్యాయంతో కౌగలించుకుని స్వాగతం పలికాడు. నాయర్ కొట్టునుండి స్పెషలు టీ తెప్పించాడు. తన సర్కసుగురించి, స్వయంశక్తితో క్రమంగా మెట్లుకట్టి సౌధాగ్రం ఎలా చేరుకోగలిగిందీ వివరిస్తుంటే, చీకట్లోకి కాంతి కిరణాలు జారినట్లు

పకపక నవ్వులు వినిపించాయి. అందులో ఒక నవ్వు మాత్రం అలలుగా విడిపోయి. ప్రతి అలా ముత్యాల మీద నడుస్తూ. పడుతూ లేస్తూ తేలిపోయింది. ధ్వని తరంగాల్ని బట్టి ఆ అమ్మాయి అందచందాల్ని వూహించాను. సృష్టిరహస్యాన్ని శోధించి కనుక్కోమంటున్న కళ్ళు చిత్రంగా అటూ యిటూ కదులుతూ ఆకాశపు ఎత్తుకు అనురాగాల్ని హృదయంలో కెత్తిస్తాయి. ఆ అనురాగస్వరూపాన్ని మాత్రం నిర్ణయించలేక పోయాను. అది మనసుచెప్పే చెడు మాటలు విని అపవిత్రం కావచ్చు. లేక ఆత్మప్రబోధం విని మంచికి ఆదర్శంగా వుండవచ్చు. రాగద్వేషాలతో అనుబంధంలేని పెదవులు. చేపల్ని పట్టేందుకు వలకు మల్లే నవ్వులు విసురుతుంటే చెక్కిళ్ళమీద చిన్న గుంటలు - కళ్ళల్లో కాంతి పొంగి పొర్లి ప్రవహించటంవలన బంగారురంగుపొందిన శరీరం - వెయ్యేండ్లు శ్రమపడి చెక్కిన శిల్పంలా కచ్చితమైన అవయవ నిర్మాణం. ఇలా ఆ అమ్మాయి రూపాన్ని సృష్టించుకున్నా. ఒక్క నవ్వు నాధారంచేసుకుని రూపకల్పన చేయటం వెర్రితనం కావచ్చు. కుట్టన్ తనకు చిన్నతనంలో లభించిన మెడల్సన్నీ చూపించాడు. దూరంగా సింహం గర్జించింది ఆకలితోనో - అసంతృప్తితోనో. 'రండి: సర్కసంతా తిరిగిచూద్దాం.' అంటూ కుట్టన్ కొరడాతీసి రెండుసార్లు ఝుళిపించాడు.

గుడారాన్ని సమీపిస్తుంటే అదే నవ్వు మళ్ళీ వినపడింది. లోపల అడుగుపెట్టాక ఆశ్చర్యపోయాను. నా వూహాలో మెదిలిన ఆ రూపం సజీవమైంది.

'ఈమె దేవకి - నా ఒక్కగా నొక్క కూతురు - సర్కసుకంపెనీ కుడిభుజం. దేవకి లేకపోతే మేం ఒక్కరోజులో దివాలాతీస్తాం.' తరువాత నన్ను పరిచయం చేశాడు. దేవకి చిన్నపిల్లలకు 'పువ్వుల నృత్యం' నేర్పుతోంది. సరైనపద్ధతిలో, క్రమంలో ఆ నాట్యంచేస్తే ఒక పూలతోట కదులుతున్నట్లనిపిస్తుందని కుట్టన్ వివరించాడు.

'ఇతను రామన్ - బార్ మీద అన్నిపనులూ చేస్తాడు. ఒకనాడు దీనికి మేనేజరైనా ఆశ్చర్య పడను.' రామన్ వినయంగా నవ్వాడు. అయిదడుగుల మనిషి - వజ్రశరీరం - మొహంమీద పడుతున్న జుత్తు - అతని ముఖంలో అమాయకత్వం పిచ్చిగీతలు గీసింది.

'ఇతను మాలిక్ - విగ్రహం చూస్తేనే అతని శక్తి సామర్థ్యాలు బోధపడతాయి. వెనకటికి గోవర్ధనగిరిని మల్లే సర్కసును ఒ వేలుమీద ఆడించగలడు. అతనికీ దేవకికి 'ఈడూ - జోడూ' సరిపోయిందంటే అతని రూపాన్ని మీరే వూహించుకోండి.'

కుట్టన్ ఆవేశంతో చెప్పుకుపోయాడు.

'నాగురించి మీరు తెలుసుకునే అవకాశాలు చాలా వున్నాయి. ఇంతకాలం నేను డబ్బుకోసం మొదలు పెట్టాను. అది నిజం. కాని క్రమేణ ఆసక్తి నశించింది. అప్పుడప్పుడు నష్టపోయేవాణ్ణి కూడా. చాలా మంది కంపెనీ అమ్మేయమన్నారు. ఒకరిద్దరు పెద్దమొత్తాలిస్తామంటూ ముందుకు వచ్చారు కూడా. నేను అమ్మలేకపోయాను. వీళ్ళలో ప్రతి ఒక్కరూ, నన్ను, నా మంచితనాన్ని నమ్ముకుని నమ్మకంగా పని చేశారు. మరొకరి చేతిలో ఎలా వుంచను? ఈజంతువున్నిటినీ నేనెంతగానో ప్రేమిస్తాను. మరొక యజమానివస్తే వాటికి తిండిపెట్టక చంపుతాడేమో! ముసలితనం రావటంచేత ఎవరికైనా ఇచ్చేస్తాడేమో! స్వేచ్ఛను వదలుకుని ఇంతకాలం నాకు సేవ చేశాయి. వాటికి నేనిచ్చే ప్రతిఫలం ఇదేనా మరి?'

కుట్టన్ అందరికి మల్లే సామాన్యవ్యక్తి కాదనే నా వూహ నిజంలో అంతమైంది.

ఎవరో కంగారుగా ఉద్రేకానికీ, ఆశ్చర్యానికీ మధ్య పరుగెత్తుకొచ్చారు. 'కాత్యాయని ఏమీ తినటం లేదు. ఎంత చెప్పినా వినదు. అలా పడుకునుంది.' అన్నాడు.

కుట్టన్ నిప్పుతొక్కిన వాడిలా అడుగులువేస్తూ 'పదండి-చూద్దాం' అంటూ కదిలాడు. ఈ కాత్యాయని దేవకికంటే అందంగా వుంటుందేమోనని వెంబడించాను. కుట్టన్ ఒక కొబ్బరిచెట్టు ముందర ఆగాడు.

'ఇదే మా కాత్యాయని - ఏమైంది నీకు? ఎందుకలా అలకపూనావ్?' అంటూ అక్కడ పడుకున్న ఏనుగుతొండం తడిమాడు. హఠాత్తుగా కాత్యాయని అతన్ని తొండంతో చుట్టివేసి కొమ్ముల దగ్గరకు లాక్కుంది. నేను గడగడలాడిపోయాను. సర్కసులో పనిచేస్తున్నవారంతా ఇలా దుర్మరణం పొందుతారని వినటమేకాని ప్రత్యక్షంగా ఎన్నడూ చూడలేదు. కుట్టన్ను విడిపించటం కూడా సాధ్యంకాదు. కాని కాత్యాయని అనుకున్న ఏ అఘాయిత్యమూ చేయక అతనివంక దీనంగా చూసింది.

'ఏం ఇవేళ ముక్కాలిపీట మీద నిలబడటం నీకిష్టంలేదా? సరే- దానికేం విశ్రాంతి తీసుకో.'

అన్నాడు సుల్తాన్ - ఏనుగు అతన్ని వదిలేసి సంతోషంతో ఘీంకరించింది.

నా ఒళ్ళు జలదరించింది. శ్రమపడి ఓ భాషంటూ సృష్టించి, దాన్ని సంస్కరించి, ఉపయోగిస్తున్నా అడుగడుక్కీ అపార్థాలు తీస్తున్నాం. ఏ భాషా అవసరం లేకుండా కౌత్యాయని తన భావాన్ని ఎంత చక్కగా వ్యక్తపరిచింది! సుల్తాన్ మానవ హృదయానికి మనసులో నమస్కారం పెట్టాను.

'చూశారా! ... ఇదే మరొక యజమానైతే ఈటెతో పొడిచి, బెత్తంతో కొట్టి నానా హింసపెట్టి తిండి తిప్పలు లేకుండా కడుపు మాడ్చి దాన్ని వంగదీసేవాడు. అందుకే నేనీ సర్కసుకు మరొకరకమ్మను.' నా కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

ఆ రాత్రి సర్కసంతా చూశాను. ముఖ్యంగా సన్నతీగమీద రంగురంగుల గొడుగుతో విలాసంగా నడచిపోతున్న దేవకి ఓ దేవకన్యలా మెరిసిపోయింది. ఏక్షణం ఆమె భూమ్మీదపడి అపవిత్రమైపోతుందోనన్న భయం చివరిదాకా నన్ను వదల్లేదు. అయిదారు బంతుల్ని ఒక్కసారి ఎగరవేస్తూ తన నైపుణ్యాన్ని ప్రదర్శించింది. అలాగే మగవాళ్ళనుకూడా ఆడించగలదు గామోలు! మాలిక్ ఎంతో ఎత్తున వుయ్యాలల మీద సునాయాసంగా ఎగిరిపోతుంటే భయంతో కనురెప్పలు మూయలేకపోయాను.

వారం రోజుల్లో సుల్తాన్, నేను ఆప్తమిత్రులమయ్యాం. తన స్వవిషయాలన్నీ దాపరికం లేకుండా నాకు చెప్పాడు.

* * *

రాత్రి పదకొండు–

పక్కవూళ్ళో ఓ 'సీరియస్ కేస్' చూశాక రెండెడ్లబండిమీద తిరిగివస్తున్నా. సర్కసు తాలూకు సంగీతం గాలిలో చెదిరిపోయి చెవుల దగ్గరకు చేరుతుంటోంది. బండివాడు పాడుతున్న జానపదగీతం వినటానికి ప్రకృతి నిశ్శబ్దంగా చెవులు నిక్కబొడుచుకుని మరింత దగ్గరగా వచ్చింది. అసలు, ప్రకృతి సౌందర్యం మానవుల కంటపడకుండా దాగివుంటుందిగామోలు నిష్కల్మష హృదయంతో ప్రార్థించిన భక్తుడికి తప్ప దైవం కనపడనట్టు! వెర్రి ఆవేశంతో శరీరాన్ని మరచి ఎంతకు చలికి చలించక అన్వేషించే వ్యక్తులకు మాత్రమే ఆ సౌందర్యం కనిపిస్తుంది. చెట్లలోనూ, నక్షత్రాలలోనూ ఏముందనుకునే మనుష్యులంటే దానికి భయం. దూరంగా కనపడకుండా తెర వెనక దాగివుండి, తన్ను నిజంగా ప్రేమించేవారు కనపడగానే ఏ అర్థరాత్రి పూటో తెర తొలగించి బయటికొస్తుంది. అలాంటి సౌందర్యాన్ని చూసి ముగ్ధుణ్నైపోయాను. బండి ఒక్క కుదుపుతో ఆగింది. ఎదురుగా మరో రెండెడ్లబండి నిలబడుంది. రస్తా వెడల్పు తక్కువ. బండివాళ్ళ మధ్య సంఘర్షణ మొదలైంది. తప్పొప్పులు నిర్ణయించటం ఎలాగూ సాధ్యం కాదు కనక, సంధి చేద్దామని బండి దిగాను. ఆ చీకట్లోనైనా సరే, అతన్ని గుర్తుపట్టాను.

'మాలిక్!' అన్నాను.

అతను ఆశ్చర్యపోతూ దగ్గరకువచ్చి 'నమస్కార' అన్నాడు. ముఖకవళికలు సరిగ్గా కనపడకపోయినా, నిర్జనప్రదేశంలో, ఒంటరిగా, వేళకాని వేళ నిలబడుంటం అనేక సందేహాలను రేకెత్తించింది. సర్కసు రెండో ఆట జరుగుతున్నట్టు స్పష్టంగా తెలుస్తోంది.

'బండి అడ్డంగా ఎందుకుంచావ్? ఇది రస్తాని తెలియదూ?' అని గద్దించాడు బండివాడు. ఒకే వృత్తిలో వున్న ఇద్దరి మధ్యవుండే 'అసూయ' అతని కళ్ళల్లోంచి తప్పించుకోలేకపోయింది.

'ఏమండి బాబూ! ఎంతసేపిలా కాసుకూచోటం? తొమ్మిదింటికి వచ్చాం. ఇప్పుడు పన్నెండు కావస్తోంది.' రెండో బండివాడు మాలిక్ నడిగాడు. మాలిక్ దిక్కులు చూడసాగాడు. అతనెవరికోసమో నిరీక్షిస్తున్నట్లు స్పష్టమైంది.

'ఏమోయ్! ... ఇదుగో నీ బాడుగ! తీసుకుని వెళ్ళిపో! నాకొంచెం పనుంది.' అన్నాను. మువ్వల చప్పుడు క్రమంగా దూరమై నిశీథంలో కలిసిపోయింది.

'మాలిక్! ఈ అర్ధరాత్రి ఏమిటిదంతా? నీ మనసు సరిగ్గా లేదు. అవునా?' అనడిగాను.

'మరేం లేదండి, త్వరగా చెన్నపట్నం వెళ్ళాలి. సుల్తాన్ వెళ్లమన్నాడు. అందుకని...' అని సాగదీశాడు. వస్తాదులా వున్న మాలిక్ గలివరు వూహలో మెదలిన 'పొట్టిమనిషి'లా మాట్లాడటం ఆశ్చర్యాన్ని కలిగించింది.

'అదేమిటి? పొద్దున్న ఏడింటికి రైలు—ఇప్పట్నుంచీ ఎందుకు? అదీకాక తొమ్మిదింటికే వచ్చారంటున్నాడు బండివాడు. తిన్నగా వెళ్లక మధ్య ఈ మజిలీ ఏమిటి?'

'అవును బాబు! స్టేషనుకు బండి కట్టాలన్నారు. మరొకరెవరో వస్తారట. అందుకని ఇక్కడ దాగి

పోయాం. ఆ రెండో మనిషి ఎంతకూ రాడు. నాబాడుగకూడా పోయింది. మాలిక్ మౌనంగా అతనికో రూపాయిచ్చి వెళ్ళనున్నాడు. ఇద్దరం ఏటి వొడ్డు చేరుకున్నాం. మాలిక్ గట్టుమీద కూర్చుని పిచ్చిగా గడ్డి మొక్కలు పీకిపారేస్తున్నాడు.

'మాలిక్! అసలు విషయం చెప్పు. నీలో నువ్వు మథనపడి లాభంలేదు. నావల్ల జరిగే ఉపకారం ఏదైనా వుంటే చెప్పు—తప్పకుండా చేస్తాను.'

'మీతో చెప్పవలసిన అవసరం నాకెంతమాత్రం లేదు. జరిగినదంతా కుట్టన్‌తో చెప్పుకోండి నాకేం భయంలేదు.'

అలా అనటం కేవలం తన పిరికితనాన్ని సూచిస్తుందని మాలిక్ గమనించలేదు అతన్ని వంగదీసే తీరు ఇది కాదు.

'మంచిది. నాతోవన నేనుపోతా. కుట్టన్‌తో ఫిర్యాదుచేసే ఆవశ్యకత నాకేముంది? మానసికంగా నువ్వు క్రుంగిపోతున్నావని నాకు తెలుసు. మనిషిని చూసి మనిషి ఎంతకాలం భయపడగలడు? గౌరవం, ప్రేమ, ఆదరణ—ఇలాంటి భావాలకు తలవంచి కొంతకాలంవరకుమాత్రమే జీవించగలడు. ఏనాటో ఒకనాడు వీటన్నిటినీ ఛేదించవలసివుంటుంది.' దీపాల్తో సర్కసు గుడారం ఓ వెలుగు చక్రంలా కనపడింది. చప్పట్ల చప్పుడు దూరంగా వినిపిస్తోంది.

'దేవకి రంగంలోకి వచ్చినట్టుంది.! అన్నాను.

మాలిక్ పళ్లు పటపట కొరికాడు. దేవకిరాకకూ, అతని కోపానికీవున్న సంబంధం నాకర్థంకాలేదు.

హఠాత్తుగా నా చేతులు రెండూ పట్టుకుని 'క్షమించండి. నేను ఆవేశంతో మంచీ మర్యాద లేకుండా మాట్లాడాను. నా తెలివి తక్కువకు సిగ్గుపడుతున్నా.' అన్నాడు. తరువాత రెండునిమిషాలు మౌనం.

'డాక్టరుగారూ! ఎందుకో, మీతో నా ఆవేదన చెప్పుకోవాలనిపిస్తుంది. అసలు కథయిది. దేవకీ, నేనూ ప్రేమించుకున్నాం. అది ఈనాడు హఠాత్తుగా జనించింది కాదు. ఈ కంపెనీలో అయిదేళ్ళక్రితం ప్రవేశించినప్పుడే ఆమెను ప్రేమించాను. ఒకటి రెండుసార్లు కుట్టన్‌తో పరోక్షంగా కదిపిచూశాను. మాట తప్పించివేశాడు. అతనీ పెళ్ళికి సమ్మతించడు. ఎందుకో, ఏమో నాకు తెలియదు. ఇలా ఎంతకాలం ఒకర్నొకరు చూసుకుంటూ తృప్తిపడటం? ఆ రకం అనుభూతి నాకక్కర్లేదు. మనం జీవించేది అనుభవాలకోసం. ఈ రాత్రి నాతో వచ్చేయటానికి దేవకి అతికష్టంమీద ఒప్పుకుంది. అన్ని ఏర్పాట్లూచేసి రెండుగంటలు ఎదురుచూశాను. మీరు రాకపోతే ఇంకా నిరీక్షించేవాడినేమో...! మోసపోయాను. ఆడదాన్ని నమ్మటం మగవాడి అసమర్థతల్లో ఒకటి.' అతను కోపంతో వణికిపోయాడు.

'దేవకి మోసగించిందని ఒప్పుకుంటూ—కాని నిన్ను పూర్తిగా ప్రేమించికూడా ఎందుకురాలేదో ఆలోచించావా? బహుశా నీ వుద్రేకంలో ఈ ప్రశ్నకు చోటు దొరికివుండదు.'

సర్కసు బ్యాండు ఏదో హిందీపాటను పలికిస్తోంది.

'అందుకొక్కటే కారణం. తండ్రంటే ఆమెకు ప్రాణం. తన్ను పెంచి పెద్దచేసి ఈ విద్యంతా నేర్పాడు కనక అతని కోరికకు విరుద్ధంగా నడుచుకోరాదంటుంది. అక్కడే వచ్చింది చిక్కంతా.'

సర్కసు పూర్తై జనం బయటకు వస్తున్నారు. మాలిక్ కంగారుగా లేచి 'వస్తాను. తొందరగా వెళ్ళకపోతే దేవకిని కలుసుకోలేను.' అంటూ కదలిపోయాడు.

* * *

ఆ మర్నాడు తెల్లవారటమే తరువాయి.

దేవకికి వంట్లో బాగాలేదని, వెంటనే వచ్చి చూడవలసిందని కుట్టన్ కబురంపాడు. మెడికల్ చెస్టు తీసుకుని బయలుదేరాను. రకరకాల ఆలోచనలు పుదయిస్తూ మాయమవుతున్నాయి. నిన్న రాత్రి నమ్మించి మోసం చేయటం, జ్వరంవచ్చినట్టు నటించటం (నాటకని ఎందుకనుకున్నానో మరి) ఇవన్నీ కేవలం కల్పితాలనిపించాయి. కుట్టన్ ఒంటు పరిశీలించడానికి వెళ్ళాడు. కిటికీవారగా మంచంమీద పడుకుంది దేవకి. సౌందర్యం స్వగతం చెప్పుకున్నట్టు పొడుగాటి కళ్ళకదలికలు—శిరతాలూకు లేతగులాబీరంగు శరీరచ్ఛాయతో కలిసిపోయింది. ఉదయసూర్యుడి కిరణాలు బంగారురంగును రెట్టింపుచేశాయి. గుండెలవరకూ రగ్గు కప్పుకుంది. కుడి చేతికిమాత్రం రెండు గాజులున్నాయి. సర్కసు చేసేటప్పుడు తీసేస్తుందిగామోలు! అవును మరి. గాజుల గలగలలు నిశ్శబ్దంలో విని ఆనందించాలికాని బ్యాండు చేస్తున్న రణగొణధ్వనిలో కాదు. అలా ప్రజ్వలించిన అందాన్ని చూసేసరికి కళ్ళు గబర్పొచ్చింది. కొద్దిగా భయం వేసిందికూడా. అడుగుల చప్పుడు విని నావైపు తిరిగి నమస్కరించింది. పొడుగాటి వేళ్లు కలుసుకునేసరికి స్వర్గానికి మెట్లు కడుతున్నట్టనిపించింది.

'ఏమిటి మీకు? ఒంట్లో ఏం బాధ?' అనడిగాను పక్కనేవున్న కుర్చీమీద కూర్చుంటూ.

'ఏమోనండి! సరిగ్గా అర్థంకాదు. లేస్తే కళ్లు తిరుగుతున్నాయి. ఒక్కసారిగా బతుకుమీద వైరాగ్యం కలుగుతోంది.'

నాడి చూచాను. సర్కసుపిల్లకేక అభ్యంతరం చెప్పదని, ఏదో అపచారం (?) జరిగినట్టు భావించదని నాకు తెలుసు.

ఆమెకేరోగమూ లేదు. నిజం ఎక్కడ బయటపడుతుందోనని బెదురుచూపులు చూడటం నేను గమనించకపోలేదు.

'నువ్వు చెప్పేది శుద్ధ అబద్ధం! నీకు ఎలాంటి వ్యాధిలేదు.' అన్నాను. మొదట్లో 'మీరు' అని, వెంటనే 'నువ్వు' అని సంబోధించటం నాకే ఆశ్చర్యాన్ని కలిగించింది

దేవకి కనురెప్పలు నాలుగుసార్లు కదిపి వివరించమన్నట్టు చూసింది.

'అంటే, శారీరకంగా నీకే బాధా లేదు కాని మానసికంగా ఏదో వుంది.'

ఈ సారి దాచుకున్న నవ్వు కొద్దిగా బయటకు జారింది.

'అబ్బో! మీకు వైద్యంతోపాటు జ్యోతిషం కూడా తెలుసన్నమాట!'

'అంతా నాకు తెలుసు. నువ్వు?...' అంటూ నవ్వేశాను. దేవకి కంగారుపడింది.

'ఏమిటది? చంపక చెప్పండి. మీ తప్పుడు అభిప్రాయాన్ని సరిదిద్దుతాను.'

'దేవకి!...నన్ను మభ్యపెట్టలేవు. కావాలిస్తే మాలిక్‌ను పిలుస్తాను.' ఆమె చనువుగా చేత్తో నా నోరుమూసింది. అంగుక్షణం వెంటనే తెలిసింది, కుట్టన్‌గదిలో అడుగుపెట్టాడు.

'ఎలావుంది? మరేం ప్రమాదం లేదుకదా? ఈనాటిదాకా అమ్మాయి ముక్కుపీడ యెరగదు. నా మట్టుకు నాకు ఆశ్చర్యంగా వుంది.' దేవకి పక్కుమంది.

'నాన్నగారికి మరీ భయం. ఏవీ లేదన్నా వినిపించుకోరు. నామీదుండే ప్రేమతో మరింత బాధపడుతున్నారు.'

'ప్రేమతో బాధపడటంలో మహత్తర సంతోషం వుంది' అన్నాను, ఎవరికి నచ్చినట్టు వాళ్ళను అర్థం చేసుకోమని. ఎవరో పిలిస్తే కుట్టన్ బయిటికివెళ్ళాడు.

నిన్నరాత్రి జరిగిన సంఘటన వివరించి దేవకి అభిప్రాయం తెలుసుకోవాలన్న కుతూహలం ఇనుమడించింది. సరైన సందర్భం నిరీక్షించటూ సంభాషణ కుపక్రమించేలోగా కుట్టన్ తిరిగివచ్చాడు

'మరేం కంగారు పడక్కర్లేదు. మందు పంపిస్తాను. మానసిక శ్రమ. అంతే.'

'అంటే?' అనడిగాను అర్థంకాని కంఠంలో.

'మరేం లేదు. ఒకేరకపు యాంత్రిక జీవితానికలవాటుపడని శరీరానికి. మెదడుకి మధ్య సహకారం తగ్గింది. మనిషి నీరసించిపోయింది. ఈ రెండింటికీ మధ్య స్నేహితం కుదిరేదాకా విశ్రాంతి కోనివ్వండి' అన్నాను. కుట్టన్ అర్థం చేసుకున్నాడనుకోను. నేనుకోరేదీ అదే— 'మాలిక్‌ను పెళ్ళిచేసుకోవాలనే రోగం ఈమెను పట్టుకుంది.' అనెలా చెప్పగలను?

కుటన్ నామాట కాదనడు. దేవకి వారంరోజుల పాటు సర్కసులో పాల్గొనదని ప్రకటించాడు. అతను నన్ను డిస్పెన్సరీదాకా సాగనంపాడు. నా ప్రశ్న తాత్కాలికంగా అలాగే నిలిచిపోయింది. ఆ రాత్రి పడకొండు,

గదితలుపు తాళంవేసి ప్రకృతిలో కొచ్చాను. దూరంగా ఓసింహం గర్జిస్తోంది. మాలిక్ తనపని ముగించుకుని గది చేరుకునుంటాడు. చల్లగాలి ఎవర్నో వెదుక్కుంటూ పిచ్చిగీతం పాడుతూ వెళుతోంది. చందమామ 'నాకీ గగనం వద్దన్నట్టు' పరుగెడుతున్నాడు. పొడుగాటి కొబ్బరిచెట్లు రహస్యం మాట్లాడుకుంటూ మధ్య మధ్య నిశ్శబ్దంగా నవ్వుకుంటున్నాయి. అలా నడుస్తూ ఏటివొడ్డు చేరుకున్నాను. అలా గట్టంట నడుస్తూవెళ్ళి దాని జన్మస్థానం తెలుసుకోవాలన్న వెర్రివాంఛను అణచుకుని తన్మయత్వంలో మునిగిపోయాను. అలా ఎంతసేపు వూహాలోకంలో వున్నానో తెలియదు. అడుగులచప్పుడు, ఒంటిమీద మంచుబిందువులు పడ్డట్టు చిరునవ్వు తునకలు వినిపించేసరికి కాల్పనిక జగత్తును వీడ్కొలిచ్చాను. నవ్వునుబట్టి ఆ వచ్చే వ్యక్తుల్ని గుర్తించాను.

'మీరిక్కడుంటారని నాకు తెలుసు. మాలిక్ నా మాట నమ్మలేదు.' అంది దేవకి. ఆమెనుచూసి అసూయతో గామోలు నక్షత్రాలు కళ్ళు చిట్లిస్తున్నాయి.

'అన్ని విధాలా నేను ఓడిపోయాను.' అన్నాడు మాలిక్.

'ఇప్పుడు చెప్పండి—నా మానసిక వ్యాధికి తగిన చికిత్స.' ఆ మాట అంటుంటే దేవకి కళ్ళ కదలికలు చూడాలని చీకట్లో వ్యర్థప్రయత్నం చేశాను.

'వెంటనే మాలిక్‌ను పెళ్ళిచేసుకో.' అన్నాను నవ్వుతూ.

'మిమ్మల్ని మేము పూర్తిగా నమ్మవచ్చా?'

'మాలిక్! అది తెలివితక్కువ ప్రశ్న. ఏ మనిషినీ పూర్తిగా నమ్మలేం. మనసుకు ఓ స్థిరరూపం లేదు కనక—నన్ను పూర్తిగా విశ్వసించమన్నానంటే అందులో నిజాన్ని అనుమానించటానికి కవకాశంవుంది. కనుక నీ ప్రశ్నకు నువ్వే జవాబు స్పష్టంచేసుకో.'

అతను అర్థమైనట్లు తలూపాడు.

'కుట్టన్ మా పెళ్ళి ఒప్పుకోడు. మీరంటే అతనికి బోలెడు గౌరవం వుంది. మీ మాటెన్నడూ కాదనడు. మీరుకనక అతనికి తగినవిధంగా నచ్చచెబితే తప్పకుండా వింటాడు. తలచినపని నెరవేర్చే శక్తిసామర్థ్యాలు మీకున్నాయి.' కంఠంలో జాలి కరగిపోయింది.

'మాలిక్! ఈ సమస్యను మరింత సులువుగా పరిష్కరించవచ్చు. దేవకిని పెళ్ళిచేసుకుని మరో సర్కసుకంపెనీలో చేరిపో.'

మాలిక్ అడ్డుపడ్డాడు. చప్పున కాళ్ళగజ్జెల్లాగ్గుమ్మంది ఏదో పాడుతూ వెళ్ళింది.

'దేవకి ఒప్పుకోదు. నిన్నరాత్రి జరిగింది మీకు తెలుసుగా!'

'నాన్నను ధిక్కరించలేను. నేను లేకపోతే ఆయన జీవించలేడు ఆ స్థితి వూహించండి పిచ్చిగా అటూ ఇటూ ఓ చేతికర్ర పుచ్చుకుని తిరుగుతూ మధ్య మధ్య నా ఫోటో ఎదురుగా వుంచుకొని ఏడుస్తాడు. వేళకు తిండితినడు. ఎవరూ ఆయనమాట వినరు. అందరూ ఎదిరిస్తారు. కంపెనీ క్రమంగా దివాలా తీస్తుంది. అందరూ నాన్నను వేలెట్టి చూపించి 'ఫలానా దివాలాతీసిన సర్కసుకంపెనీ మేనేజరు' అంటారు. వద్దు. ఆ దురవస్థ ఎన్నటికీ వద్దు నా ప్రాణంపోయినా సరే నాన్నకాస్థితి వద్దు.'

దేవకి సన్నగా ఏడవటం మొదలుపెట్టింది.

'నేను చివరకు తెలుసుకున్నా. ప్రేమించటం పొరపాటు.'

'కాదు దేవకీ! అది నీ యిష్టాయిష్టాలమీద ఆధారపడుంటుంది. ప్రకృతి శాసనానికి ప్రేమ తలవంచి తీరుతుంది. అది సహజం.'

'సర్కసు పూర్తయినట్లుంది. దేవకి కనిపించక పోతే కుట్టన్ గాభరాపడతాడు. అంతా మీకే వదిలేస్తున్నా.' అన్నాడు మాలిక్ రెండడుగులు ముందుకు వేస్తూ.

ఆనాటి సంభాషణ ముగిసింది.

ఆరాత్రంతా ఆలోచించాను. ఈ బాధ్యతను నా నెత్తిన వేసుకోటం వెర్రితనం. ఈ సర్కసుకంపు ఇవేళుంటుంది. రేపు మాయమవుతుంది. దీనికోసం నేను తుఫానులో చిక్కుకోటం దేనికి?...మరుక్షణం ఎదురు దిక్కు నుండి ఆలోచనలు వీచాయి. ఇలా ఎంత కాలం జరుగుతుంది? ఓనాటి రాత్రి మనసు విరిగి మాలిక్ కుట్టన్‌ను బాకుతో పొడిచి చంపొచ్చు. లేక ప్రేమికు లిద్దరూ ఎట్లోపడి ఆత్మహత్య చేసుకోవచ్చు. చరిత్రలో తార్కాణాలు బోలెడు. ఇది నియమబద్ధమైన సంస్కారాల మధ్య జరిగే సంఘర్షణ కాదు. అనురాగం—అసూయ—కుట్టు—దాపరికం—గౌరవం—వీటన్నింటినీ కరిగించి ఓ అజంతా శిల్పాన్ని తయారు చేయాలి ఎలా?......ఆ శిల్పం పూర్తయ్యేలోగా మాలిక్ ముసలితనాన్ని కౌగలించుకుంటాడు. కుట్టన్ మంచం వదలనంటాడు. దేవకి నెరసిన జుట్టును చక్కగా జడవేసుకుని ముడతలు పడిన ముఖాన్ని వందసార్లు అద్దంలో చూసుకుని సంతోషిస్తుంది. అలా జరగటానికి వీల్లేదు. కుట్టన్ ఈ పెళ్ళికి ఒప్పుకోకటానికి ఏదో బలమైన కారణం వుండివుంటుంది. మాలిక్ సన్యాసిగానో హంతకుడుగానో మారితే నేను బాధ్యుణ్ణేమో ననిపించింది. కుట్టన్‌తో ఈ సంగతి కదిలించి చూడాలని నిశ్చయించుకున్నా.

ఆ మర్నాడు సాయంత్రం నేను వెళ్ళేసరికి కుట్టన్ కృష్ణుడి పటానికి హారతియిస్తున్నాడు. చప్పట్లు చరుస్తూ 'భేష్! భేష్...సర్కసు మనుష్యులకు దైవభక్తికూడా వుందన్నమాట!' అన్నాను.

కుట్టన్ హారతిపళ్ళెం నాముందుంచాడు. నుదుటి మీదున్న కుంకంబొట్టు ఉదయసూర్యుడిలా వెలిగింది. అతని ముఖంచూస్తే ఏమాత్రం కల్మషం వున్నవాడిలా కనపడలేదు.

'డాక్టరుగారూ! మీరన్నారు కనక చెబుతున్నా. దేవుడిమీద నమ్మకం లేనివారెవరూ లేరు. లేదని

రుజువుచేసే వాళ్ళ హృదయాల్లో కూడా బిక్కు బిక్కు మన్నభయం వుండేవుంటుంది. భక్తిని ప్రకటించేందుకేవన్నీ మార్గాలు. అదీకాక నాబోటి వాళ్ళంతా హారతులివ్వకపోతే కర్పూర పరిశ్రమ ఎలా అభివృద్ధి చెందుతుంది?'

'చాలా గొప్పగా వుందండి. మరోసారి విపులంగా మనవిచేద్దురుగాని. దేవకి ఎలా వుంది?'

'అలాగే వుందండి. చిత్రం! పైకి ఏరోగమూ వున్నట్టు కనిపించదు.' ఇదే సరైన సందర్భంగా కన

'నాకు తెలుసు. ఆమె మానసికంగా బాధపడుతోంది.'

కుట్టన్ కళ్ళు పెద్దవిచేసి 'అంటే? నిన్నకూడా ఈమాటే అన్నారు. వివరంగా చెప్పండి.' అన్నాడు.

'అంటే అసంతృప్తి, జీవితంమీద విరక్తి, కోరికలు తీరనప్పుడు కలిగే అశాంతి. అందుకని త్వరగా పెళ్ళిచేసేయండి.'

కుట్టన్ పెద్దగా నవ్వాడు.

'నేనూ అంతే ననుకున్నాను. కాని దేవకి రామన్‌ను చేసుకోనంటోంది!' తెల్లబోయి తేరుకునేసరికి రెండునిమిషాలు గడిచాయి.

'మిమ్మల్నొకమాట సూటిగా అడుగుతాను. ముసుగులో గుద్దులాటెందుకు?' కుట్టన్ పచార్లుచేస్తూ కోటుకున్న మెడల్ని లెక్క పెడుతున్నాడు.

'దేవకి మాలిక్‌ను ప్రేమిస్తోంది. అతనూ అంతే. ఇద్దరికీ పెళ్ళిచేయండి. మీకంపెనీ పదింతలు గడిస్తుంది.'

హఠాత్తుగా కిటికీవూచ పట్టుకున్నాడు. అతని స్థూలశరీరం వణుకుతోంది. కళ్లుకోపంతో ఎర్రబడి నుదుటిమీద బొట్టుతో పోటీపడ్డాయి.

'డాక్టరుగారూ! ఆవిషయం ఎత్తొద్దు. అది ఎన్నటికి జరిగేదికాదు. రోగం నయంకాకపోతే చావనివ్వండి.'

నేను లేచి నిలబడ్డాను.

'అతను పంజాబీయుడని మీరు వెనకాడుతున్నారా?'

'కాదు—కాని—అలాంటిభేదం నాకెన్నడూ లేదు. మనుష్యులందరూ ఒకటే. భాష, ఆచార వ్యవహారాలు. జీవితవిధానం, మారినంత మాత్రాన హృదయాలు మారవు.'

'అయితే మీ అభ్యంతరం ఏమిటి? కుట్టన్! ఆలోచించుకోండి. ఆమె నిష్క్రియణతో మీ కంపెనీ నిద్రిస్తుంది. అదలా వుంచి ప్రేమ ఓ మదించిన ఏనుగు—ఎదురీదలేని ప్రవాహం. దాన్ని మీరు కాదనలేరు. ఈ విషయంలో ఎలాగూ కలగజేసుకున్నాను కనక దాని అంతుచూడటం మంచిది. నేను చేయగలిగిందేమీ లేదని మీరు పొరబడవచ్చు. వారిద్దరి మనసులు సక్రమంగా మీనుండి దూరంచేస్తాను. పట్నంలో నాకు తెలిసిన సంస్థలు, పెద్దలు చాలామంది వున్నారు. మాలిక్‌ను ఎక్కడైనా చేర్పించి అతని జీవితవిధానం మార్చేస్తాను. తరువాత మీరు పశ్చాత్తాప పడతారు.'

అలా బెదిరించాలని మొదట్లో అనుకోలేదు. ఏదో వెర్రిఆవేశం నన్ను వశంచేసుకుని అర్థంలేని మాటలనిపించింది. దేవకిమనసు మార్చలేనని నాకు బాగా తెలుసు. నేను బయటకు వచ్చేస్తుంటే, కిటికీలోంచి బయటకు చూస్తూ నిలబడ్డ కుట్టన్ హఠాత్తుగా వచ్చి అడ్డంగా నిలబడ్డాడు. నాకొంచెం భయంవేసింది కూడా. ఎందుకంటే, మంచితనానికి, మూర్ఖత్వానికీమధ్య పల్చటి తెరమాత్రం అడ్డం—అదెప్పుడు చిరుగుతుందో తెలియదు.

'డాక్టరుగారూ! మీకు నేనేం అపకారం చేశాను? ఎందుకు నన్నిలా వేధిస్తారు? మిమ్మల్నిగౌరవించి స్నేహితుడుగా నమ్మినందుకా?' అతను ఏడుస్తున్నాడేమో ననిపించింది.

'కుట్టన్! నేను నమ్మకద్రోహం చేయలేదు. మీరంటే నాకెంతో గౌరవం వుంది. కాని మీరు తప్పుత్రోవన వెడుతున్నారు. సరిదిద్దడానికోసం ఇలా ప్రవర్తించవలసి వచ్చింది.'

'పోనీ, ఆరామన్‌ని చేసుకో మనదూ?' అన్నాడు ఆశగా. చిన్నపిల్లాడు 'తాయిలం పెట్టవూ?' అన్నట్టుగా వుంది ఆ కోరిక!

'అదెలా కుదురుతుంది? పూలదండ దేవుడికి వేసినా, దయ్యానికి వేసినా ఒకటేనని మీరు వాదించినా, వేసేవాళ్ళకు తోచవద్దూ?'

'కాదు డాక్టరుగారూ! కాదు. అందుకు తగిన కారణంవుంది. ఎవరికీ చెప్పనని మాటివ్వండి. చెప్తాను.'

ఈమాటు ఆశ్చర్యపడటం నావంతు. ఈసమస్య వెనక ఏదో రహస్యంవుందని మొదట్నుంచీ అనుమానిస్తూనే వున్నాను. అది నిజమైంది.

తిరిగివచ్చి కుర్చీలో కూర్చున్నా.

ఇంతలో రామన్ వచ్చి కుట్టన్‌ను ఎక్కడికో తీసుకుపోయాడు. పదినిమిషాల దాకా అతను తిరిగి రాలేదు. తలుపులు దగ్గరగా చేరవేసి కుట్టన్ పదేళ్ళ క్రితం జరిగిన సంఘటనలు వివరించాడు. అతని ప్రతి మాట నిజంమీద నడిచింది.

'ఈ కథంతా నాకు ముందే తెలియదు. మీనమ్మకాన్ని వదులుకోమనను. కాని ఈసంగతి దేవకితో ఎందుకు చెప్పలేదు? వెంటనే రామన్‌ను చేసుకునేదిగా!'

కుట్టన్ బరువుగా నిట్టూర్చాడు.

'అక్కడే పొరపాటు చేశాను డాక్టరుగారూ! దానికి మంచిచెడ్డలు తెలిసే వయసురాగానే చెప్పదలిచాను. పెళ్ళిచేసుకుంటే ఎక్కడ నాకంపెనీ సరిగ్గా నడవదోనన్న స్వార్థంతో దాచివుంచాను. ఈలోగా మాలిక్ రావటం—ఈ ప్రేమగోల మొదలవటం జరిగింది. ఇప్పుడు దేవకితో వున్న విషయం చెప్తే తప్పకుండా ఆత్మహత్య చేసుకుంటుంది. మీకు తెలియదు. ఆమె మనసు పువ్వుకంటె సున్నితమైంది. నేనంటే ప్రాణం దానికి. చెప్పండి. ఏం చెయటం?'

సర్కసు అమ్మాయిల పకపకలు, రిహార్సలు చేసుకుంటున్న బ్యాండు ధ్వని వినిపించాయి. అయిదు నిమిషాలు మౌనం రాజ్యంచేసింది. కుట్టన్‌ను ఎలా సమాధానపరచాలో నాకర్థంకాలేదు. అతని సమస్య, నమ్మకాలు, దానిచుట్టూ అతను నిర్మించుకున్న గోడలు ఇవన్నీ నిజానికీ, తర్కానికీ లొంగవు. ఆగోడల్ని అతనే నేలమట్టం చేయాలి. మూర్ఖత్వానికి మందు లేదు.

'నాకేదో ఆలోచన తడుతూంది... ఈ మాలిక్‌ను పంపేస్తే సరి!' అన్నాడు వున్నట్టుండి.

'దేవకి అతనివెంట వెళుతుంది.'

కుట్టన్ పెద్దగా నవ్వాడు.

'పంపటమంటే ఎక్కడికనుకున్నారు? తిన్నగా పైకి.' అంటూ ఆకాశంకేసి చూశాడు. అతనిలో రాక్షసత్వం ప్రవేశించిందన్నమాట. పది నిమిషాల్లో అతని పశ్చాత్తాపం, బాధ అన్నీ మంటలో అంతమయ్యాయి. కుట్టన్ అనుకున్నంతపని చేయగలడు. మాలిక్‌కు తెలియకుండా విషం పెట్టొచ్చు, ఓసింహాన్ని మీదకురికించవచ్చు. ఎవరికైనా లంచంపెట్టి ఉయ్యాలమీదనుండి క్రిందకు తోయించవచ్చు. అనుకోవాలి కాని మార్గాలు బోలెడు. 'కుట్టన్! ఆఖరుసారిగా చెప్తున్నా. మాలిక్‌కు ఏదైనా ప్రమాదం జరిగితే మిమ్మల్ని బోనులో నిలబెట్టిస్తాను జాగ్రత! కర్తవ్యాన్ని ఎన్నడూ మర్చిపోను.' జవాబుకోసం ఆశించకుండా బయటకు వచ్చేశాను.

తిన్నగా మాలిక్‌ను వెతుక్కుంటూ వెళ్ళాను. అతనెక్కడికో వెళ్ళాడని, మరో గంటదాకా తిరిగి రాడని తెలిసింది. అప్పట్లో ఆశాభంగం కలిగినా, నా తెలివితక్కువ వెంటనే అర్థమైంది. కుట్టన్ చెప్పిన రహస్యాన్ని అతనికి చెప్పటం ప్రమాదకరం. తెలిసినా అతనేం చెయలేడు. ఒక స్త్రీ కోసం తన భవిష్యత్తును తాకట్టుపెట్టాడు. దాన్ని విడిపించుకోటం వివేకం కలిగాక-ఆ వివేకం శక్తులు, యౌవనం, నశించాక-కాని కలుగదు. అప్పుడు ఆ స్త్రీ అతన్ని పరాయివాడిగా చూస్తుంది.

మాలిక్‌తో ఏ విషయమూ ప్రస్తావించకూడదని నిర్ణయించుకున్నా. రెండు రోజులు గడిచాయి.

ఏం తోచక సర్కసు చూద్దామని వెళ్ళాను. దేవకి ఎలాగూ వుండదని తెలుసు. నన్ను చూడగానే బుకింగ్ దగ్గరున్న కుట్టన్ ఆశ్చర్యపోయాడు.

'ఇవేళ కొత్త ఫీట్లేమీ లేవు. చూసిందే చూడటం మీకు విసుగ్గా వుంటుందేమో!' అన్నాడు. ఈ మాటలు నన్ను ఆలోచనలోకి దింపేశాయి. ప్రతిరోజూ సర్కసు చూడమని వేధించుకుతినే కుట్టన్ ఒక్కసారి, డొంకతిరుగుడుగా 'వచ్చిన దోవ చూసుకుంటే మంచిది.' అన్నాడంటె అందులో ముళ్ళూ, అడవులూ, క్రూరమృగాలూ వుండాలి.

సర్కసు మొదలైంది. కుట్టన్‌కోసం నాలుగువేపులా చూశాను. అతని జాడెక్కడా లేదు. పంచరంగుల్లో అమ్మాయిలు కనిపించి, భూమ్మీద అడుగులు వేయక గాల్లో తేలిపోతున్నారు. మాలిక్ వచ్చేసరికి చప్పట్లు డేరాను చీల్చుకుపోయాయి. అతనంటే ప్రజలకంత అభిమానం! బారుమీద మొగ్గలు వేసి మళ్ళీ కరతాళధ్వనులు తరుముతుంటే పారిపోయాడు. కుట్టన్ చెప్పినమాట నిజం—అంతా పాత—విసుగెత్తి వెళ్ళిపోదామని లేచివచ్చిన జనాన్ని చూసి మళ్ళీ కూర్చున్నా.

ఆ తరువాత ఉయ్యాలలూగటం. మాలిక్ నిచ్చెనెక్కి ఉయ్యాల అందుకోటం—అది పుటుక్కున తెగటం—ఒక్కసారే జరిగాయి. హాహాకారాలు ఎదురెదురు బాణాల్లా దూసుకుపోయాయి. మాలిక్

ఎగిరి మరో వుయ్యాలందుకున్నాడు. ఆ రెండో వుయ్యాల అందుకోని పక్షంలో అతన్ని గురించి ఆలోచించవలసిన అవసరంలేదు. మాలిక్ నెమ్మదిగా క్రిందకు దిగివచ్చాడు. డేరాబయట అతన్ని కలుసుకోగలిగాను.

'నాకే ఆశ్చర్యంగా వుంది. సాయంత్రం ఐదు గంటలకు వచ్చి చూశాను. అంతా సరిగ్గా వుంది. ఇది మృత్యువుతో చెలగాటంకనక ఎంతో జాగ్రత్తగా వుంటాను. తాడెవరో సగంకోసి వదిలేశారు.' మాలిక్ ఇంకేమీ చెప్పక గబగబ వెళ్ళిపోయాడు. అతన్తో ఎన్నో చెప్పాలనుకున్నా. అవకాశం జారింది. రుజువు లేదు కనక ఎవర్నీ ఏం చేయలేం—తిరిగి వస్తుంటే కుట్టన్ ఎదురుపడ్డాడు.

'చూశారా డాక్టరుగారూ! ఎంత ఘోరం జరిగిపోయింది! ఒక క్షణం ఆలస్యమైతే మాలిక్ మనకు దూరమైపోయేవాడు.'

'మీరు కోరుకున్నదేగా! మీ పన్నాగం పారనందుకు బాధపడుతున్నారా? ఈనాడే కాదు. ఏనాడూ మీరు నిజాన్ని మోసగించలేరు. మన చర్యల్ని గమనిస్తూ నడిపిస్తున్నవాడొకడు పైన వున్నాడని మాత్రం మర్చిపోకండి. అతను కొంత కాలంవరకూ మన తప్పుల్ని క్షమిస్తాడు. కాని ఎల్ల కాలం కాదు.'

చరచర నడిచి వచ్చేశాను.

అలా కాకుండా, కుట్టన్ చెప్పే సమాధానం విని వుండాల్సిందేమో ననిపించింది. ఒకవేళ ఈ నాటకంలో అతనికి పాత్ర లేదేమో!...నా మొదటి నిర్ణయం నీటిమూటలా ఎంత అస్థిరమైందో అర్థమైంది.

కుట్టన్‌కూ నాకూ మధ్య ఈ నాలుగురోజుల్లో జరిగిన సంభాషణ—సంఘర్షణ మాలిక్‌కు వివరిద్దామని, సూర్యోదయం బయలుదేరే సరికి టెలిగ్రాం ఎదురు వచ్చింది. ఆరాత్రి ఒంటిగంటకు మెడికల్ ఆఫీసరు కుమార్తెకు వివాహం. వెంటనే రమ్మని దాని సారాంశం. వెళ్లకపోతే అతను బాధపడటం సంగతలావుంచి నా జీవితానికి స్వరూపాన్ని ప్రసాదించి, నన్ను ఔన్నత్యానికి లేవనెత్తిన ఆయన ఆహ్వానాన్ని తృణీకరించటం తలపులో కూడా నల్లగీతలా కనపడింది. రైలు సరిగ్గా పదిగంటలకు—మరో ఆలోచనకు స్థానంలేదు. మాలిక్‌తో మాట్లాడేందుకవకాశం లేదు.

తిరిగి వచ్చాక చూసుకుందామని తృప్తిపడి వెంటనే బయలుదేరాను.

* * *

రైలుదిగి డిస్పెన్సరీకి వస్తుంటే దేవకి ఎదురు వచ్చింది. ఆమె నాకోసం నాలుగైదుసార్లు వచ్చిందట. చక్కటి చిత్రపటం గీసి వెంటనే సిరా ఒలకబోసినట్లు ఆమె రూపురేఖలు చెదరివున్నాయి. కళ్ళు రెండూ భయంతో వణికాయి.

'డాక్టరుగారూ! కొంప మునిగింది! వెంటనే రండి' అంది. ఆమెను వివరాలడిగేందుకు వ్యవధి లేదు. అవకాశంలేదు. ఒకవేళ అడిగినా ఆపరిస్థితుల్లో దేవకి నోరు మెదపలేదు. అంతులేని ఆవేదన ఆమె శరీరంలో ప్రతి అణువునూ అంటువ్యాధిలా పీడిస్తోంది. మెడికల్ ఛెస్టు తీసుకుని వెళ్ళేసరికి మాలిక్ పక్కమీదున్నాడు. కుట్టన్ కిటికీ దగ్గరున్నాడు.

'నిన్న ఈయనకు జ్వరం వచ్చిందండి. కుట్టన్ గారు మందిమ్మన్నారు. సరేనని మనం మామూలుగా ఇచ్చే మిక్చరు కలిపి ఇచ్చాను. తెల్లవారుజామున వాంతులు ప్రారంభమయ్యాయి.' అని వివరించాడు కంపౌండరు. మందుసీసావంక చూస్తే ఇంకా రెండు పూటలకు మందు మిగిలివుంది. అంటే మాలిక్ ఒకపూట మాత్రమే తాగాడన్నమాట, మాలిక్ శరీరంలో విషపదార్థం ప్రవేశించిందని వెంటనే తేలిపోయింది. విరుగుడిచ్చి, పెద్దగా ఏడుస్తున్న దేవకిని ఓదార్చటానికి యత్నించాను.

'నువ్వేం కంగారు పడొద్దు. మందు పంపిస్తాను, జాగ్రత్తగా చూసుకోండి. మరికొంచెం ఆలస్యమైతే మనకు దక్కేవాడు కాదు. ఎవరో ఇతన్ని విషంపెట్టి చంపటానికి ప్రయత్నించారు. దురదృష్టం కొలదీ బతికిపోయాడు. ఈ మందు తీసికెళ్ళి పూర్తిగా పరీక్షించి పోలీసుకు రిపోర్టిస్తాను.' అనేసి బయటకొచ్చాను. కంపౌండరు నన్ను వెంబడించాడు.

'నువ్వు చేసేపని నాకర్థమైంది. పిల్లి కళ్ళు మూసుకుంటే చీకటి పడుతుందటయ్యా వెర్రివాడా? డబ్బుకోసం కక్కుర్తిపడి ఈ పనిచేశావు. తిన్నగా జైలుకు వెడతావు.' అని గద్దించానతన్ని.

'మీరు పొరబడుతున్నారు. నే నేపాపమూ ఎరుగను. నేను తతిమా రోగుల్ని గమనిస్తుంటే కుట్టన్ మందు సీసాలన్నీ పరిశీలించాడు. ఒకవేళ అతనే

కలిపివుంటాడు. కొన్ని సీసాలమీద మనం 'విషం' అని రాసివుంచాం- అవతనికి సాయపడింది. నేను హత్య కెన్నడూ తలపెటను. అలా బతికేదానికంటె నాలుగిళ్ళల్లో అడుక్కుని జీవిస్తాను నాకూ హృదయమంటూ వుంది. నన్నుమాత్రం గంగలో ముంచకండి.' అని ప్రాధేయపడ్డాడు కంపౌండరు.

నేను ఆశ్చర్యపోయాను. కంపౌండరు ముఖంలో అమాయకత్వం వుంది. కుట్టన్ తెలివిగానే ప్రవర్తించాడు. నేను వూళ్ళోలేని సమయంలో చేయవలసింది చేసేసి నేరం కంపౌండరుమీద తోసేద్దామని ఎత్తువేశాడు. అతని అంతటి మంచితనం ఒక్కసారిగా స్వార్థంలో అంతమైంది అనురాగం ద్వేషంలో అంతమైంది. విజ్ఞానం మూర్ఖత్వంలో కలిసింది. కొండకోనమీదవున్న మనిషిని అగాధంలోకి విసిరివేసేశక్తి పరిస్థితులకుంది. నా కర్తవ్యంగురించి ఆలోచించాను. మాలిక్ ఎలాగూ జీవించాడుకనక ఎవర్నీ దండించనక్కర్లేదు. కాని కుట్టన్ మళ్ళీ వుపాయం వెతగ్గలడు. రేపు 'కాత్యాయని' చేత తొక్కిస్తే ఏం చేయటం? ఒక మనిషి తనకోసం చనిపోతే దాంట్లో అర్థంవుంది. మరొకరు సృష్టించే చిక్కుల్లో చిక్కుకోవటం కన్నా అన్యాయం అసంభవం. వెంటనే అధికారులకు తెలియజేయాలని నిర్ణయించుకున్నా. ఆ మధ్యాహ్నం పోలీసుస్టేషనుకు బయలుదేరుతుంటే దేవకి వచ్చింది. రెండు నిముషాలు తీక్షణంగా చూసింది.

'మాలిక్ ఎలా వున్నాడు?' అనడిగాను

'బాగానే వున్నారు మీదయవలన ... నేను మీదయకోసం వచ్చాను.'

'మందుతోబాటు దయకూడా సీసాల్లో వుంచాననుకుంటున్నావా?'

'కాదు. కాదు. మీ హృదయంలో వుంది...'

'నువ్వు చెప్పేది సూటిగా చెప్పు- నాకు పనుంది.' అంటూ హాండ్‌బాగ్ అందుకున్నా. దేవకి చటుక్కున బాగ్ లాక్కుంది.

'ఆ పనేమిటో నాకు తెలుసు. డాక్టరుగారూ! నాన్నగారు అమాయకులు- ఆయనకేమీ తెలియదు. దురదృష్టం కొలదీ ఈ చిక్కులు ఆయన్ని చుట్టుకున్నాయి. అంతేకాని మాలిక్‌ను చంపాలన్న కోరిక ఆయనకే కాదు నాకూ లేదు. నాకోసం - మా అందరి మంచికోసం మీరు జరిగినదంతా మర్చిపొండి.'

'దేవకీ! మాలిక్ మీద నీకుండే ప్రేమ నాకు తెలిసిపోయింది. ఇంక ఆ విషయం ప్రస్తావించను. నేను వూహించిన విలువలు దానికిలేవు. కనుక నాకర్తవ్యాని కొస్తాను. అదేమిటంటే. నన్నూ, కంపౌండరునీ మోసగించి రోగానికిచ్చిన మందులో విషంకలిపి హత్యకు ప్రయత్నించిన ఓ వ్యక్తిని న్యాయస్థానంలో వుంచటం -అదే నాకర్తవ్యం దీంట్లో జాలి, ప్రేమ, కోపం, నిరాశ ఏమీ లేవు. నా వృత్తి గౌరవానికి సంబంధించినది. కుట్టన్‌ను నిర్దోషిగా రుజువు చేసేందుకు మీరందరూ కోర్టులో సాక్ష్యం ఇవ్వండి!'

ఈమాటలు నేను ఎటో చూస్తూ అనటంవల్ల దేవకిముఖంలో మార్పులు గమనించలేదు. ఏదో పెద్ద చప్పుడు. చటుక్కున తిరిగిచూశాను. ఓ క్షణం క్రితం వరకూ నిశ్చితరూపంలో కనిపించిన సీసా ముక్కలై మూలపదార్థంగా మారింది. దేవకి బాగ్‌లోంచి మందు సీసాతీసి బయటకు విసిరేసింది. ఆమెకేసి కోపంగా చూశాను.

'డాక్టరుగారూ! క్షమించండి. నేను రెండు విధాలా చెడిపోయాను. నాకింక మనశ్శాంతి వుండదు. అంటూ చేతుల్తో మొహం కప్పుకుని ఏడుపు సాగించింది

'పోనీలే! జరిగిందేదో జరిగిపోయింది.'

అలా ఎలా అనగలిగానో నాకే ఆశ్చర్యంగా వుంది. నాకు తెలుసు. ఈ నాడేకాదు. ఏనాడూ ఆమె కన్నీరు ఇంకిపోదు.

* * * *

ఆ మర్నాడు మాలిక్‌ను పరీక్షించటానికి వెళ్ళినప్పుడు ఈ వారంరోజులుగా జరుగుతున్న సంఘటనలన్నీ వివరించాను కుట్టన్ అతన్ని చంపటానికి యత్నిస్తున్నాడని కూడా రుజువుచేశాను. కాని అతను చెప్పిన రహస్యాన్నిమాత్రం దూరంగా వుంచాను. మాలిక్ హృదయంలో ఎలాంటి సంఘర్షణలుదయిస్తాయో తెలియదుకాని, అతను మరింత పిచ్చివాడవుతాడని మాత్రం నిశ్చయించుకున్నా. పళ్ళుపటపట కొరికాడు.

'ఏదో ఒకనాడు నన్ను పైకిపంపిస్తాడని తెలుసు. ఈలోగా అతన్ని ముగిస్తే బాగుంటుంది. ప్రేమకు త్యాగం అవసరం. కాని మనం ఆ ప్రేమనుంచి కోరే ఆనందాన్నే త్యాగంచేయవలసివస్తే దాన్ని ద్వేషంగా మార్చటం మంచిది. నాకోరిక నెరవేరేందుకు వేరే మార్గాలు వెతుక్కోవా లన్నమాట.'

ఆ మాటలు నన్ను భయంలోకి విసిరేశాయి. అనురాగమైనా, ద్వేషమైనా అవధులు దాటితే ఓ మహా

ప్రవాహంలా పురకలువేస్తూ పరుగు లెడుతూ ఎదురు పడ్డ శక్తుల్ని నిర్మూలిస్తాయి.

ఏమైనా, నా కర్తవ్యం పూర్తయింది.

వారంరోజులతరువాత ఆ సర్కసుకంపెనీ ఉత్తర దిశగా కదలిపోయింది. కుట్టన్, మాలిక్, దేవకి నన్ను కలుసుకుని నా ఔన్నత్యాన్ని మెచ్చుకున్నారు. ఎందుకో, ఏమిటో వాళ్లకూ తెలియదని నా నమ్మకం. దేవకి కళ్ళచివర నీటిముత్యాలు, మాలిక్ కళ్ళల్లో ఎర్రదనం ఒక్కసారి కనిపించి మాయమయ్యాయి.

*　　*　　*　　*

నాకు తెలుసు. యావజ్జీవితమూ ఆ సర్కసుతో వుండలేనని, కాని ఉన్న కొద్దిరోజుల్లో ఆ ముగ్గురు వ్యక్తులూ హృదయానికి సన్నిహితంగా వచ్చారు. ఆ జ్ఞాపకాలుమాత్రం మిగిలాయి.

అన్నట్టు, కుట్టన్ చెప్పిన రహస్యాన్ని మీకు చెప్పనేలేదు. పదేళ్ళక్రితం, కుట్టన్ తల్లి దేవకికి పెళ్ళి చూడాలని ప్రాధేయపడిందట. రామన్‌కూ, దేవకికీ పెళ్ళిజరిగింది. అప్పటికి దేవకి చిన్నపిల్ల. కుట్టన్ సర్కసుకంపెనీ స్థాపించలేదు ప్రపంచయుద్ధం మొదలు కాగానే రామన్ యుద్ధంలో చేరాడు. యుద్ధం ముగిసే వరకూ అతని జాడే ఎవరికీ తెలియదు. చాలామంది అతను తిరిగిరాడనుకున్నారు. ఈలోగా కుట్టన్ సర్కస్ కంపెనీ మొదలు పెట్టాడు. దేవకి యౌవనంలో అడుగు పెట్టి వికసించింది. యుద్ధంనుండి రామన్ తిరిగివచ్చి సర్కసులో చేరాడు. కుట్టన్ అతన్ని గుర్తించాడు కాని రామన్ అంతా మర్చిపోయాడు. అతని జీవితక్రమమే మారిపోయింది. స్వార్థంకొద్దీ కుట్టన్ ఏమీ ఎరగనట్టు నటించాడు. ఇంతలో ఈ ప్రేమ తలెత్తి నవ్వింది. అందుకే కుట్టన్ ఈ పెళ్ళికి సమ్మతించలేదు.

ఎందుకో ఈ కారణం కల్పితంకాదనిపించింది. మనిషి ప్రవర్తననుబట్టి అతని మాటల్లో నిజానిజాలు గ్రహించవచ్చు. కుట్టన్ ఏవిషయంలోనూ అబద్ధం చెప్పడనిపించింది. కాత్యాయనిమీద అతను చూపిన ప్రేమ ఎన్నటికీ మరపురాదు. ఆ జంతువులకు, మనుష్యులు ఋణపడివున్నట్టు భావించటం బహుశ అతని ఔన్నత్యానికి మెట్టుకడుతోందేమో! దైవభక్తి, భావసత్వం నీడల్లా వెంబడించాయి. ఎదురుగా భర్తవుండగా, దేవకిని పెళ్ళికాని పిల్లగా ప్రకటించి మరొకరికిచ్చి ఎలా పెళ్లి చేయగలడు? అవకాశందాటాక నిజం తెలుసుకున్నాడు.

దేవకిభవిష్యత్తుగురించి వూహించలేకపోయాను. ఎడారిలో గులాబీపువ్వులా ఆ వాతావరణంలో జీవిస్తూ ఒకవంక మాలిక్‌నూ, మరోవంక తండ్రినీ ప్రేమిస్తూ కూర్చుంటుంది. మాలిక్ ప్రతిరోజూ ఆమెకోసం ఎదురుచూసి విసుగెత్తి, ఆనాటికి నిద్రపోయి మర్నాడు మళ్ళీ వస్తాడు. సర్కసుమనుష్యుల జీవితాలే చిత్రమైనవి. రాత్రి ప్రజలముందు తళుకుబెళుకులతో గగనంలో విహరించే దేవకన్యల్లా తళుక్కనమెరిసి మాయమవుతారు. యథార్థజీవితాలు వేరు. అశాంతి—అసహనం—అసూయ - చీకటి—రేపు ఏం జరుగుతుందో తెలియని మిడిమిడిజ్ఞానం—ఇవన్నీ చేతులుకలుపుకుని చుట్టూ నాట్యంచేస్తూంటే అలసిసొలసి నిద్రపోయే ఆమనుష్యుల జీవితక్రమాన్ను, మనస్తత్వాలనూ ఎన్నటికీ మర్చిపోలేను.

ఇంతకూ నాక్కలిగిన సందేహం ఇది మాలిక్ సరైన సమయంచూసి కుట్టన్‌ను హత్యచేసివుంటాడు. దేవకి కొంతకాలంఏడ్చి, ఏకాంతంలో పిచ్చిగా పాడుకుని, ఏటివొడ్డున మౌనంగా నిద్రపోయి, వర్తమానాన్ని గుర్తించి తిరిగి మాలిక్‌ను పెళ్లి చేసుకుని వుంటుంది. అందుకే, చాలాకాలం తరువాత నేనతన్ని గుర్తించినా అతనుమాత్రం నన్నెరగనట్లు 'మనుష్యుల్ని పోలిన మనుష్యులుంటార'ని చెప్పి తప్పించుకున్నాడు. కుట్టన్‌ను హత్యచేశాడని తెలిస్తే జైలుకువెళ్ళవలసివస్తుందని భయపడివుంటాడు. కనుక అతనే మాలిక్ అయి వుంటాడని నమ్మకం. ఆ సర్కసులో మరెవరినైనా అడిగి నిజానిజాలు తేల్చుకుందామని నిర్ణయించుకునేసరికి వాళ్లంతా మరోవూరు వెళ్లిపోయారు. అసలు దేవకి మాలిక్‌ను పెళ్లి చేసుకుంటుందన్న నమ్మకం నాకు పూర్తిగా లేదు. ప్రేమకు. వివాహానికి మధ్యవున్న అంతరాన్ని ఆమె ఎలా వూహించుకుందో మరి! అందుకని దేవకిలాంటి మరోఅమ్మాయిని చేసుకున్నాడేమో!... ఇలా అర్థంలేని సందేహాలు ఎన్నోవుదయిస్తున్నాయి. ఇదీ కథ—

అంతా చదివారు కనుక నా ప్రశ్నకు జవాబు చెప్తారన్న ఆశతో ఎదురుచూస్తున్నా.

మీ ప్రియమైన
అప్పు.

అతనికి కలిగిన సందేహాలకు రెండింతలు నాక్కలిగాయి. గట్టిగా నిట్టూర్పుం తప్పించి సమాధానం వెదకలేకపోయాను. ఈ సందేహాలు అలాగే వుండిపోతాయేమోనన్న భయంతో ఈ కథంతా మీకు తెలియచేశాను. ఈ సమస్యను మీరు తప్పకుండా సాధిస్తారన్న నమ్మకం నాకుంది.

# సిద్ధేంద్రయోగి పదునైదవశతాబ్దివాడే

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

సిద్ధేంద్రయోగి కూచిపూడిభాగవతుల నాట్యగురువై భామాకలాపమును వారి కుపదేశించినాఁడని యనుశ్రుతముగా వచ్చుచున్న కథ. కాని యితఁడే మహారాజాస్థానములో నున్నట్లుగాని, తన కృతి నేరాజునకైన యంకిత మిచ్చినట్లుగాని తెలుపు చారిత్రకాధారములు లేవు. కాన నితని కాలమును నిర్ణయించుట కితనిఁగూర్చి యనుశ్రుతముగా వచ్చుచున్న నా కథయొక్కటే యాధారము. ఆ కథను నమ్మకపోయిన నాతని యస్తిత్వమే లేదు; అభూతకల్పనమైపోవు నతని విషయము. అతని జీవితకథకూడ ననేకవిధములుగా నున్నను, కూచిపూడివారికి అతఁడు నాట్యగురు వనుటలో మాత్రము భిన్నాభిప్రాయములు లేవు. కాన కూచిపూడి నాట్యగురుత్వ విషయమున మాత్ర మనుశ్రుతముగా వచ్చుచున్న కథను యథాతథముగా గ్రహించిన నేతప్పు, దానిలో మార్పులను చేసినచో యసలునకే ముప్పువచ్చును. కూచిపూడివారికి నాదిలో నాట్యభిక్ష పెట్టినవాఁ సిద్ధేంద్రయోగియే యని జనశ్రుతియు, కూచిపూడివారి విశ్వాసమును గూ

మాచుపల్లి కైఫీయతునుబట్టి కూచిపూడి భాగవతులు క్రీ॥ శ॥ 1502-1509 వరకు విజయనగర రాజ్యము పాలించిన నరసింహరాయల యాస్థానమున యా రాజుచే గౌరవింపఁబడినటు తెలియుచున్నది. కాన వా రా కాలముతర్వాతివారు కారని నిర్ణయింపవచ్చును. అయితే, అప్పటి కెంతకాలము పూర్వమునుండి యుండియుందురని తర్వాతి ప్రశ్న. నటులు - నాటకములు, నాట్యము - నర్తకులనుగూర్చి బసవపురాణ పండితారాధ్య చరిత్రములలో పాల్కురికి సోమనాథుడు ప్రస్తావించుచు కూచిపూడివారిని గూర్చి చెప్పకపోవుటచే, నప్పటికి వారు లేరను నిర్ణయమును నామిత్రులు శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు 1960 సంవత్సరం జనవరి భారతి సంచికలో వెలిబుచ్చుచు, నటుతర్వాత 14, 15 శతాబ్దులలో నెప్పుడో వారిగురువగు సిద్ధేంద్రయోగి యుండియుండునని తేల్చిరి. ఇంతవరకు బాగుగనే యున్నది.

పాల్కురికి సోమనాథుడే కాక, యతనితర్వాతివాఁడైన శ్రీనాథుఁడును, నతని మిత్రుడగు వల్లభరాయుఁడును గూడ క్రీడాభిరామములో నటులు - నర్తకులఁగూర్చి ముచ్చటించుచు, కూచిపూడివారి పేరైనను స్మరింపక పోవుటయే కాక యందు విశేషించి యిట్లు రచింపఁబడెను:

నటులది ఘోరసముద్రము,
విటులది యోర్గల్లు కవిది వినుకొండ మహో
త్కటభేదన మీ త్రితయము,
నిటలగూర్చెను బ్రహ్మ రసికు లెల్లరు మెచ్చన్.

పుట 90.

దీనినిబట్టి క్రీడాభిరామరచనమునాఁటికి కూచిపూడివారు నటవృత్తి గ్రహింపలేదనుట స్పష్టము. వారప్పటికే నటవృత్తిగా నున్నచో నా కీర్తి ఘోరసముద్రము వారి కంటకట్టక క్రీడాభిరామకర్త వీరిని పేర్కొనెడివాఁడే కదా! క్రీడాభిరామమునఁ బేర్కొనఁబడిన మాచల్దేవి క్రీ॥ శ॥ 1487 ప్రాంతమున నున్నట్లు దక్షిణ హిందూదేశ శాసనసంచయము VI వాల్యూం 778 నెం. శాసనమునఁ గలదు. ఇందునే క్రీ॥ శ॥ 1440 ప్రాంతమువరకు కూచిపూడి భాగవతులుగాని, వారి నాట్యగురువగు సిద్ధేంద్రయోగిగాని లేరని విశ్వసించవచ్చును కదా. ఈ విషయమున నేను "కూచిపూడిభాగవతులు- యక్షగాన ప్రదర్శనము" అను వ్యాసమున ('Annals of Oriental Research' of the University of Madras Vol. XV 1958-59 పుట 66-69 లలో) వ్రాసినాను. అప్పారావుగారు నా వ్యాసము నుదాహరించియు, సిద్ధేంద్రునికాలము 14, 15 శతాబ్దముల మధ్యయని మాత్రము స్థూలముగా చెప్పుటలో, వారు పాల్కురికి సోమనాథుని వాక్యముల కిచ్చిన ప్రామాణ్యము, తెలుగునేల నాలుగుమూలల పర్యటించిన శ్రీనాథుని వాక్యముల కీయకపోవుట విచిత్రముగా నున్నది. పై క్రీడాభిరామ పద్యమును దృష్టిలో నుంచుకొని సిద్ధేంద్రయోగి క్రీ॥ శ॥ 1450 ప్రాంతమువాడని నేను నిర్ణయించినాను. అప్పారావుగారు చేసిన కాలనిర్ణయము నేనుచేసిన కాలనిర్ణయములో

చేరినదేయైనను, కాలవైశాల్యము చాలపెద్దదైనది. నేను చేసిన కాలనిర్ణయము సత్యసన్నిహితముగా నున్నది. ఇందుచే నొకటిన్నర శతాబ్దముల వెనుక విషయములు విచారింప నవసరములేదు. విమర్శకుని నిర్ణయములు సాధ్యమైనంతవరకు సత్యమున కెంత సమీపముగ నున్న నంతవిలువ హెచ్చునుగదా. ఇది వారికేల సంతృప్తిని గలుగఁజేయలేదో వారు కారణములను దెలుపలేదు నేను చేసిన కాలనిర్ణయము తగిన ప్రమాణములపై నాధారపడినదికాన నిర్బాధకమైన దని నా యభిప్రాయము.

ఈ అప్పారావుగారి యభిప్రాయమువలన ప్రమాదము లేదు. కాని, శ్రీ విస్సా అప్పారావుగారు మాత్రము విపరీతవ్యాఖ్యానము చేయుట విచిత్రము గాకపోదు. సిద్ధేంద్రయోగి కూచిపూడి భాగవతులకు ప్రారంభముననే నాట్యభిక్ష పెట్టినవాఁడు గాక, వారు నాట్యవిద్య నేర్చిన కొన్ని శతాబ్దముల తర్వాత వారికి భామాకలాపమును మాత్రము బోధించినాఁడట. ఈ విషయము చాల క్రొత్తది. పూర్వమే నాట్యవిద్యా నిష్ణాతులైన కూచిపూడివారికి భామాకలాపమును మాత్రము నేర్పినంతమాత్రమున సిద్ధేంద్రయోగిని తమ కులదైవముగా భావించి వారు పూజించెడివారని తలంచుట యౌచిత్యమునకు భంగము గల్గించును. ఆదినే నాట్యభిక్ష పెట్టినవారియందు మాత్రమే కృతజ్ఞతతో నట్టి పూజ్యభావము వారి కుండెననుట సమంజసముగా నుండును. కాని తద్భిన్నులయం దంతగౌరవ ముంచుట స్వభావవిరుద్ధముగను. కూచిపూడి భాగవతులు కాకతీయుల కాలము నాఁటనుండియుఁ గలరనియు, వా రప్పుడు శతవిధ శివలీలా నాట్యపద్ధతులను నృత్యముసేయుచు గ్రామ గ్రామములను దిరుగుచుండిరనియు, 17-వ శతాబ్దోత్తరార్ధమున నారాయణతీర్థులవారి శిష్యుఁడగు సిద్ధేంద్రయోగి పారిజాతాపహరణకథగల భామాకలాపమున నష్టవిధ నాయికావస్థల నిర్దేశించుచు నాట్యాభినయముల కనువగునట్లు మహాకావ్యమును రచించి కూచిపూడి వారికి బోధించి, వారిని వంశపారంపర్యముగా దాని నభ్యసింపవలసినదిగా ననుశాసించి, తాను కూచిపూడి భాగవతులకు కూచిపూడిగ్రామము నగ్రహారముగా గోలుకొండ నవాబగు అబ్దుల్ హసన్ తానాషా వద్దనుండి సంపాదించి యిచ్చినట్లు రాగిరేకు శాసనము కలదని శ్రీ విస్సా అప్పారావుగా రభిప్రాయపడిరి.

ఆ రాగిశాసన మేయూర నెక్కడ నున్నది? దాని వాచక మెట్లున్నదియు నెవరు నింతవరకు యథాతథముగా, మాచుపల్లి కైఫీయత్తునగల్గు తాయికొండ శాసనమువలె స్పష్టపరుపలేదు. తానాషావలన నగ్రహారమును కూచిపూడివారు పొందియుండవచ్చును. కాని సిద్ధేంద్రయోగియే దానిని సంపాదించిపెట్టెనని సుస్పష్టముగా నందున్నచో సిద్ధేంద్రయోగికాలము స్పష్టపడినట్టే కదా. అట్లేయగుచో సిద్ధేంద్రయోగికి బూర్వమే కూచిపూడివారు వీర నరసింహరాయలను విజయనగర రాజ్యమున క్రీ॥ శ॥ 15[illegible]2 ప్రాంతమునఁ గలిసికొనినట్లు తెలియవచ్చుచున్నది. అప్పుడు సిద్ధేంద్రయోగి కూచిపూడి భాగవతులకు నాట్యము నేర్పిన మూలపురుషుఁడు, నారాధ్యదైవమని భావింపఁబడుట యెట్లు? సిద్ధేంద్రయోగికిఁ బూర్వము శివతాండవ నాట్యమునందు ప్రవీణులగు కూచిపూడివారికి భామాకలాపమును నేర్పి వారి నాతఁడు భాగవతులను జేసెననియు, నప్పటినుండియే యక్షగానము లాంధ్రదేశమున మొలకలెత్తిననియు విస్సా అప్పారావుగారు దెలిపినారు. అందుచే భామాకలాపము క్రీ॥ శ॥ 17-వ శతాబ్దోత్తరభాగముననే పుట్టిననియు, నంతకుఁ బూర్వ మాంధ్రమున యక్షగానములు లేవనియు భావింపవలయునా? అట్లేయగుచో క్రీ॥ శ॥ 1550 ప్రాంతమున కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయమను యక్షగానమును రచించినట్లు స్పష్టపడినదికదా? సుగ్రీవ విజయమునకుఁ బూర్వమే సౌభరిచరిత్రమును యక్షగానముగా ప్రోలుగంటి చెన్నశౌరి యనునతఁడు క్రీ॥ శ॥ 1502-9 ప్రాంతమున వీర నరసింహరాయల కాలమున రచించినట్లు హరిభట్టు తన యుత్తర నారసింహపురాణములో తెలిపినాఁడు గదా. దానిగతి యేమి? (ఆంధ్ర యక్షగానోత్పత్తినిగూర్చి నేను Annals of Oriental Research of the University of Madras Vol XIV, for 1957 58 వ్రాసిన 'నాటకకళ' యను తెలుగు వ్యాసమును Triveni Vol. XXVIII, No. 4 for January 1958 లో నాంగ్లమున వ్రాసిన 'Yakshagana, Origin and grouth' అను వ్యాసమును చదువునది) కాన సిద్ధేంద్రయోగి 17-వ శతాబ్దోత్తరభాగమువాఁడు గాక, తత్పూర్వమువాఁడై కూచిపూడి భాగవతులకు నాట్యవిద్య గఱపిన మూలగురువై యుండవలెననియే చెప్పవలయును.

# సిద్ధేంద్రయోగి పదునైదవశతాబ్దివాడే

కూచిపూడి భాగవతులు వీరనరసింహారాయల రాజ్యకాలములో హంపీ విజయనగర రాజ్యమునకు వెళ్ళుటకు సుమారు 50-75 ఏండ్ల పూర్వమే నాట్యశిక్షణను పొంది కీర్తికెక్కియుండిరి. కాని యంతకుం బూర్వము బ్రాహ్మణ నటనర్తకులుండెడువారు గారు. పూర్వము నటనృత్తి బ్రాహ్మణేతరులలో మాత్రమే యుండెడిది. వారిలో స్త్రీపాత్ర స్త్రీలే ధరించెడువారని పాల్కురికి సోమన, శ్రీనాథాదుల రచనలను బట్టి తెలియుచున్నది. అప్పటి యక్షగానప్రదర్శనములు కేవలము గానరూపముననే యుండెడివి కాని, నాట్యాభినయముతో గూడుకొని లేదు. ఈ స్థితి క్రీ. శ. 1400 ప్రాంతమువరకు నున్నదని క్రీడాభిరామ పద్యములనుబట్టి స్పష్టపడును. కాకతీయుల కాలము తర్వాతనే యక్షగానములను ప్రదర్శించు వ్యాపారమును బ్రాహ్మణ నటులు గ్రహించి, దానికి నిండును, గౌరవమును గల్గుటకై బ్రాహ్మణేతరులు చేయు దేశి నృత్త - నృత్యస్థానములందు శాస్త్రీయమైన భరతనాట్యమును ప్రవేశపెట్టి, యా కళకు శాస్త్రగౌరవమును గూర్చిరి. ఆ కాలము సుమారు క్రీ. శ. 1400 - 1450 మధ్య యగును. ఆ తర్వాత నేబది సంవత్సరములకే వారు విజయనగరమునందును వ్యాపింపజాలిన కీర్తిప్రతిష్ఠలను సంపాదించి, యా నటు వీరనరసింహారాయల కొలువుకూటమునకు బోయియుండిరి. ఆ బ్రాహ్మణులే కూచిపూడి భాగవతులు గావలయు. వారే సిద్ధేంద్రయోగిచేత భామాకలాపమున శాస్త్రీయముగ భరతనాట్యములో శిక్షితులైరి. అందుచే సిద్ధేంద్రయోగి క్రీ. శ 1450 ప్రాంతమువాడు గాదగును. అంతకు విశేషముగ బూర్వమున గాని, విశేషముగ పరమున గాని యుండ వీలుపడదని పైన జూపిన యుపపత్తులనుబట్టి నిర్ణయించుట సహేతుకముగ గనబడును.

కృష్ణలీలా తరంగిణి కర్తయగు నారాయణతీర్థులవారు తమ తరంగములలో "సిద్ధనారాయణ తీర్థసేవిత శ్రీపాదం, శివనారాయణ తీర్థ సిద్ధానంద దాయకం," అని 'సిద్ధ' పదమును మూడు నాల్గుచోట్ల తన పేరుతో జోడించికొనియుండుటచే సిద్ధేంద్రుడును, తీర్థులవారును నొక్కరే యని కొందఱును, తీర్థులవారు ప్రియశిష్యుడగు సిద్ధేంద్రుని (సిద్ధప్ప) నామము వాదిముగా స్మరించెనని బాలాంత్రపు రజనీకాంతరావుగారు తమ 'ఆంధ్రవాగ్గేయకార చరిత్రము'నను తలంచుచున్నారు. ఆంధ్రవాఙ్మయములో సిద్ధేంద్ర నామధేయులనేకులు గనబడుచున్నారు. వారిలో గొందఱు శైవులు, మఱికొందఱు సాత్త్వికులుగూడ గలరు. అట్టివారిలో షట్స్థల దర్పణమును రచించిన సిద్ధనాథుడు; ప్రభుదేవర వాక్యమును రచించిన రేవణసిద్ధనలో నొకరు; మఱి సిద్ధలింగము, సుగణంజి యను నొకదానిని రచించెను; సిద్ధేంద్రయోగి యోగీశ్వరుల సమును వ్రాసెను. ఇట్టివారు మఱికొందఱు గలరు. కాని వీరి కాలము నిశ్చయముగా తెలియరాదు. ప్రస్తుతము నారాయణతీర్థులవారు తమ తరంగములలో వాడుకొనిన 'సిద్ధ' పద మెటిదో, యే సిద్ధేంద్రుని గూర్చియో స్పష్టముగా తెలియరాదు. ఇందుచే సిద్ధేంద్రుడును తీర్థులవారును నొక్కరే యని కాని, శిష్యుడగు సిద్ధేంద్రుని నామమును గురువగు తీర్థులవారు స్మరించిరని కాని తలంచుటకు తగిన ప్రమాణము లేదు. అట్లు చెప్పుటలో నౌచిత్యము గాని సారస్యము గాని లేదు. అట 'సిద్ధ' శబ్దమునకు 'సిద్ధించిన' యని కాని, లేక 'ప్రసిద్ధిచెందిన' యని కాని చెప్పవచ్చును. ఘుణాక్షరన్యాయముగా సిద్ధించిన సిద్ధేశ్వరునికి నారాయణతీర్థులవారి శిష్యత్వమంటగట్టి, వారి భామాకలాపమునకు వీరి శ్రీకృష్ణలీలాతరంగిణి ప్రేరకమయ్యెనని సమర్థింపబడినది సుచితముగ లేదు. అట్లే క్షేత్రయ పదాభినయము ననుసరించి సిద్ధేంద్రుడు భామాకలాపమును వ్రాసెనను శ్రీ విస్సా అప్పారావుగారి వాదముగూడ నున్నది. ఈ రెంటికి సమాధానమును చాల తేలికగ పోణంగి శ్రీరామ అప్పారావు, శ్రీనివాస చక్రవర్తిగార్లను క్రమముగ నిచ్చివేసినారు. క్షేత్రయ నారాయణతీర్థులను సిద్ధేంద్రుడనుసరించెననుటకంటె, నీయననే వారిద్దరు ననుకరించిరని యేల భావింపరాదు? సిద్ధేంద్రునిపై చిన్నచూపు వీరి కేల కలిగెనో తెలియదు.

క్రీడాభిరామాది గ్రంథ పద్యములనుబట్టి బ్రాహ్మణ పురుషనర్తకు లాంధ్రదేశమున క్రీ. శ. 1430 వఱకు నుండిరని తెల్పుటకు వీలులేకుండుటచే కూచిపూడి భాగవతులును, సిద్ధేంద్రయోగియు గూడ తత్పూర్వమునం దుండియుండిరని విశ్వసింపవచ్చును. పోణంగి అప్పారావుగారు తెల్పినట్లు జాయసేనాని, వాని గురువగు గుండామాత్యుడును, వెన్నెలకంటి సూరామాత్యుడును నాట్యశాస్త్రము నభ్యసించియుండవచ్చును. అందుకు సందేహము లేదు. అంతకు పూర్వముగూడ నాంధ్రులలో గొందఱు భరతుని

నాట్యశాస్త్రమును బాగుగ నభ్యసించి దేవదాసీలకు నేర్పి, వారిచే నాట్యము చేయించుకొని, రసికులు రసజ్ఞులైనవా రనుభవించి యానందించి యుండ వచ్చును. సిద్ధముగానున్న భరతుని నాట్యశాస్త్రము వలన నాశింపదగిన ప్రయోజన మిదియేకద. కాని పురుషులు, వారిలో బ్రాహ్మణులు తాముగా భరత నాట్యము చేసినట్లు క్రీ శ. 1430 వరకు నిదర్శన పూర్వకమైన ప్రమాణము గానరాదు. అట్టిది కూచిపూడివారితో సిద్ధేంద్రునివలన గనబడుచున్నది క్రీ. శ. 1430 తర్వాతనే. అందుచేతనే సిద్ధేంద్రునికాలము సుమారు క్రీ. శ 1450 ప్రాంతమని నిర్ణయించితిని. ఆయన లక్షణమునకు వెంటనె సిద్ధేంద్రుడు లక్ష్యముగా భామాకలాపమును రచించె ననుటకు ప్రమాణము లేదు; 200 సంవత్సరముల తర్వాత గావచ్చును.

తర్వాత క్రీ. శ. 1160 - 1300 వరకు వీరశైవ విజృంభణకాల మగుటచేతను. కూచిపూడి భాగవత సంప్రదాయము వైష్ణవభక్తి సంప్రదాయక మగుటచేత నిది 1300 తర్వాతనే ప్రచారములోనికి వచ్చియుండ వచ్చునను ప్రామాణికుల పైవిశ్వాసము విచారింపదగినది. పైకాలము వీరశైవ విజృంభణ కాలమని కొందఱు భావించినను, వీరశైవు లాకాలమున దమ గ్రంథములలో నితరమతములవారిని దూషించినను యితర మతములను నిర్మూలము చేయలేకపోవుటయే కాక వాని నరికట్టలేకపోయిరి. కాన, కన్నడదేశమున బసవేశ్వరుడు పుట్టి వీరశైవమత ప్రచారము చేయు సమీప కాలముననే. తమిళదేశమున రామానుజులవా రుదయించి వైష్ణవమత ప్రచారమును చేయుచుండిరి. ఉభయమతముల ప్రభావ మాంధ్రదేశముపై పొడసూపినది. పల్నాటివీరుడగు శిరం బ్రహ్మయనాయని వైష్ణవమత ప్రభావమే పల్నాటి యుద్ధమునకు కారణమయ్యెనని కొందఱందురు తర్వాత గోన బుద్ధారెడ్డియు వారి పుత్ర పౌత్రులు వైష్ణవ మతస్థులై, వైష్ణవుడగు చక్రపాణి రంగనాథునిచే రంగనాథరామాయణమును రచింపించిరి. అప్పుడె ప్రతాపరుద్రుని యాశ్వసైన్యాధ్యక్షుడగు సాహిణమారని ప్రేరణమున హుళక్కి భాస్కరాదులు రామాయణమును రచించిరి. కాన పై కాలమున వీరశైవమును వీరవైష్ణవమతము ప్రతిఘటించుచునేయుండెను. ఈ స్థితి 1800 వరకే కాక 1500 తర్వాతకూడ సాగుచునేయున్నది. పిఠపర్తి వంశీయులు వీరశైవమును పోషించుచుండగా, తాళ్ళపాక వంశీయులు వైష్ణవమతమున కండగానుండిరి. కాని సిద్ధేంద్రుడు గాని, కూచిపూడి భాగవతులుగాని మతోద్రేకమునకు బాల్పడని శుద్ధ స్మార్తులు. వీరి కళాసేవకు మత ప్రచారమునకు ముడిపెట్టుట యనవసరము. మతములపై నాధారపడి సిద్ధేంద్రుని కాలనిర్ణయము చేయవలసినచో క్రీ. శ. 1150 నుండి 1550 వరకు గూడ కొనసాగింపవచ్చును. దానివలన ప్రయోజన మేమి?

వీరనరసింహరాయుల యాస్థానమున కూచిపూడివారు సంబెట గురవరాజు దుశ్చర్యలను నాటకముగా కల్పించి, ప్రాసంగికముగా, భామాకలాప ప్రదర్శనము మధ్య జూపిరని కోణంగి అప్పారావుగా రూహించిన విషయము సంభావ్యమునను, సమంజసముగనే యున్నది. కాని కూచిపూడివారు 18వ శతాబ్దివరకు నృత్యనాటకములను చేపట్టక, కేవలమొక్క భామాకలాప ప్రదర్శనముతో మాత్రమే విసిగిపోయిరనుటకు ప్రమాణమేమియో తెలియరాదు. భామాకలాపముతో పాటు గొల్లకలాపమునుకూడ సిద్ధేంద్రయోగి రచించి కూచిపూడివారికి నేర్పినాడని కొందఱు చెప్పుదురు. కాని కొందరు దానిని కూచిపూడి భాగవతులలో శ్రేష్ఠులగు భాగవతు రామదాసుగారు తర్వాత రచించిరని చెప్పుదురు. గొల్లకలాపకర్త యెవరైనను కూచిపూడి భాగవతులు భామాకలాప గొల్లకలాపములను రెంటిని ప్రదర్శించుచుండిరని నిస్సందేహముగా విశ్వసింపవచ్చును. మఱియు కూచిపూడి భాగవతులలో ననేకులు సంస్కృతభాషాపండితులును, కవులును, ప్రతిభావంతులును, మంత్రశాస్త్రవేత్తలును గలరు. వారు కేవలము నాట్యసంగీతశాస్త్రములందు మాత్రమే ప్రవీణులుగారు. క్రీ.శ. 18వ శతాబ్దమునకు బూర్వమే యాంధ్రదేశమున ననేక యక్షగానములు భారత భాగవత రామాయణకథల నాశ్రయించి రచింపబడినవి సిద్ధముగా నుండినవి. వానిలో గొన్నింటిని బ్రాహ్మణేతరులు వీథినాటకములుగా నాడుచుండిరి. భామాకలాపము మధ్య ప్రాసంగికముగా సంబెట గురవరాజు దుశ్చర్యలను నాటకముగా కల్పించి ప్రదర్శించి వీరనరసింహరాయల మెప్పును పొందజాలిన ప్రతిభావంతులగు కూచిపూడి భాగవతులు నీరసములైన బ్రాహ్మణేతరుల నాటి యక్షగాన ప్రదర్శనములను జూచి యాదరింతురని యెట్లు విశ్వసింపనగును? క్రీ శ. 1506-9 ప్రాంతమున వీర నరసింహరాయల కంకితముగా ప్రోలుగంటి చెన్నశౌరి రచించిన సౌబరిచరిత్రమును యక్ష

# సిద్ధేంద్రయోగి పదునైదవశతాబ్దివాడే

గానము గలదు గదా. కూచిపూడి భాగవతులు విజయనగర సంస్థానమునకు బోయినపుడు, తన కంకితమైన యా యక్షగానమును వారిచే ప్రదర్శింపజేసి యానందించియుండడా యా వీరనరసింహరాయలు? కాన 18వ శతాబ్దమువరకు కూచిపూడి భాగవతులు నాటకములను చేబట్టలేదనుట విశ్వసింపదగినది కాదు. యక్షగానములలో భరతనాట్యమును ప్రవేశపెట్టి, రసవంతముగా నొనర్చి యాంధ్రదేశముననే చిన్నెలు వన్నెలు గూర్చుకొనిన తర్వాతనే వారు దక్షిణదేశమునకుబోయి యక్కడి వారికి దమ నాటకప్రదర్శన ప్రభావమువలన యక్షగానదోహదము గావించిరని విశ్వసించుటయే మేలు. యక్షగానముల కాంధ్రదేశమే పుట్టిన యిల్లు గాని, దక్షిణదేశము గాదు. ఈ విషయమై నేను రచించిన త్రివేణిలోని వ్యాసాదులను పైన పేర్కొనినవి చూడనగును.

ఈ సందర్భమున నొక చిన్న సందేహమును నివర్తించి యీ వ్యాసమును ముగింతును. ఈ జనవరి నెల భారతిసంచికలో శ్రీ సాళ్వ కృష్ణమూర్తి, శ్రీ ముట్నూరి సంగమేశము గార్లు రచించిన 'గొల్లకలాపము భాణికయే' యను వ్యాసము చివర "కలాపములన్నియు 'పారిజాతము'లని యనబడేవని తెలియుచున్నది... కాని వీనిలో పారిజాతమను నుపరూపములకు సంబంధించిన లక్షణము లేవియు కాన్పింపవు ముఖ్యముగా మఱికలాపములకీ పారిజాతములన్న పేరెట్లు గలిగెనో విచారింపదగిన విషయమే." యను సందేహమును వెలిపుచ్చి యీ వ్యాసమును ముగించిరి. దానికి నాకు దోచిన సమాధానమును తెలుపదలచినాను. మనభాషలో మొట్టమొదటి కలాపము భామాకలాపము. ఇందు శ్రీకృష్ణుడు సత్యభామకొరకు దేవలోకమునుండి పారిజాతాపహరణము చేసినకథ యితివృత్తము. ఇందు నారదుడు శ్రీకృష్ణున కొసగిన పారిజాతపుష్పమును రుక్మిణి కొసగుటచే సత్యభామకు గల్గిన సపత్నీకలహము ప్రధానముగా గల్గి విప్రలంభశృంగారము రసవంతముగా నుండును. ఇందుచే నీ భామాకలాపమునకు పారిజాతమను పేరు గల్గినది. పారిజాతకథ ప్రయోజనముగా కలదికాన, తర్వాత సపత్నీకలహకథను ప్రతిపాదించు కలాపములన్నియు రాధవేషము, కృష్ణవేషము, భామవేషము, గొల్లవేషము మొదలైనవి పారిజాతములను పేరితో వ్యవహరింపబడినవి. ఈ వ్యవహారము శ్రీకృష్ణసంబంధనాటకములకే కాక, శివసంబంధనాటకములకు గూడ వ్యాపించి క్రమముగ, వానికి గూడ ననువర్తింపజేయబడినది. శివుడు గంగను వివాహము చేసికొని, పార్వతికి సపత్నీకలహము గూర్చిన యక్షగానమునకు 'శివపారిజాత'మని తరిగొండ వెంకమాంబాదులు వ్యవహరించిరి. ఇందు పారిజాతపుష్పమునకు గాని, వృక్షమునకు గాని స్థానము లేకపోయినను సవతుల కలహకథకు పారిజాతమను పేరు రూఢియైనది; కాని పారిజాతకమను పారిభాషిక నామముగల యుపరూపకభేదలక్షణము దీని కనువర్తింపదు. పారిజాతకమనునది సంస్కృతభాషలోని యుపరూపకభేదము. తెలుగు 'పారిజాతము'లు కేవలము ఆంధ్రదేశీయములు. ఇదియే భేదము. సంస్కృతోపరూపకము పారిజాతకముగాని, పారిజాతము గాదు. వీని రెంటికి 'క' వర్ణభేదమున్నట్లు గమనింపవలయును. ఇట్లే నాటికయను నుపరూపకలక్షణము గూడ ప్రస్తుతము రచింపబడు వచననాటికలకు వర్తింపదు. వానికిని వీనికి నెట్టి సంబంధము లేదు. అదేవిధమున 'కావ్య'మను మఱియొక యుపరూపకభేదము గూడ నొక పారిభాషిక పదమే. దాని లక్షణమును సామాన్యకావ్యలక్షణము నొకటి కాదుకదా. అవన్నియు నుపరూపకభేదములకు గల పారిభాషికపదములు.

# ధర్మదీక్ష

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

[వ్రతదీక్షలోనున్న దిలీపుని పరీక్షింపవలెనని సింహరూపమెత్తిన శివసేవకుఁడు కామధేనువుబిడ్డను గుర్తింపక స్వకర్మమునే పాటించెడి – ఆ మహారాజు వైఖరి :-]

శంకరు కింకరుండ ననిశంబు తదీయ దయాసుధారసం
బుంకువగొన్న భక్తుఁడ మహోగ్రచరిత్రుఁడ, వన్యసత్త్వముల్
గొంకుచు నీ యరణ్యమునఁ గ్రుమ్మరు నాదు పరాక్రమంబు ని
శ్శంకముగా నెఱింగియు – విచార మదేల మహీశ! నీ కిఁకన్?

ఏ మృగమైన నాకు బలియేయగు – నియ్యది యీశ్వరాజ్ఞ నీ
వేమి యొనర్తు వయ్య! చనుమీ, గురువర్యునిమీఁది భక్తి నీ
వీమెయిఁ జూపినాఁడ విపు డేదియు నీకిఁకఁ జేతఁగాదు పో
పో! మరియాదగానని యపూర్వ తిరస్కృతిఁ జూప నాతఁడున్.

తల నటువంచి యందలి ప్రధాన రహస్యము దైవికంబుగా
వెలయుటఁ జేసి దానికి వివేకియుఁ గావునఁ గోపతాపముల్
సలుపక సత్త్వమార్గమె ప్రశస్తముగా మది నెంచి దాఁత్రోఁ
బలి కెవు నాదుమాట వినవా మృగరాజ! యటంచు నిట్టులన్.

చాఁచిన చేయి సాఁగక విచారములోఁబడి నేను నెమ్మదిం
దోఁచిన మాటలన్ బలికి దోయిలిపట్టుట నవ్వులాటగాఁ
దోఁచునుగాని నాకుఁగల తుందుడుకున్ వెలిఁబుచ్చి యింక ధ
ర్మాచరణంబు నా హృదయమందు స్ఫురించెడిదానిఁ జెప్పెదన్.

సకల చరాచరంబులకు స్వామి యుమాపతి; వాని ప్రాభవం
బకలుష మద్భుతం బపరిహార్య మటంచు నెఱింగి యేను వా
నికిఁ గడు దోయిలింతు మహనీయ! యదేమియుఁ గాదుగాని యిం
తకు నొక చిక్కువచ్చిపడె దానినిమాత్ర మెఱుంగఁ గోరెదన్.

నియమ పురస్సరంబుగ వశిం గురుదేవుని ధేను వెట్టిచో
భయపడకుండఁ జూచుటయె 'బాధ్యత'నాది; మహాత్ముఁ డాహితా
గ్నియు నగువాని యీ ధనము నెమ్మదిగా నట చేర్చివత్తు సం
శయమును మాని నా మనవి చయ్యన సైరణసేయ వేఁడెదన్.

ఇది గుర్వాజ్ఞయటంచు దర్పముగ నీ కీరీతి బోధింపఁ బూ
నదు నా జిహ్వ; దయామయుండవయి విజ్ఞానంబు చూపెట్టి యా
పదకుం దీనిని బాపవేఁడెదను - సౌభాగ్యంబు చేకూర్చు న
ట్టిదిగాఁదోఁచె భవత్సమాగమము; గోష్ఠింబట్టి గుర్తించితిన్.

ఆఁకటఁ దూలి తల్లికయి యక్కట! లేఁగయు వేచియుండు న
ట్టాఁకలఁబెట్టి యావు నిటు లాఁగిన నయ్యది చచ్చిపోవు నీ
కి కథ నేను జెప్పవలెనే మహితాత్మ! క్షమించి ప్రాణర
క్షాకృతిఁజేసి దీనికి సుఖం బొడఁగూర్పవె మ్రొక్కి వేఁడెదన్.

ఇంగ నీ యాఁకలి యందువా! యిదిగో! నా యీ మేను నీకిత్తుఁ జ
క్కఁగ నీ విక్కడె యారగింపు మదియే కైవల్య మీజీవి కొ
ప్పగ నా విన్నప మాలకించి యిది సంపూర్ణంబుగాఁ దీర్చి న
వ్వగఁ బాపంగదవే యనంగ నదియుం బల్కెన్ మహారాజుతో.

చాలిఁకఁ జాలు భూవర! విచారము కల్గెడు నిన్నుఁ జూడ నీ
వేల యపోహలోఁ బడెద విట్టులు - సర్వధరాతలంబు నీ
వేలుచు నిండు జవ్వనము నిట్టి సురూప మలంతి జీవికై
రాలి యొసర్తువే తెలిసియుండియు విభ్రమ మందె దేలొకో!

ఏకచ్ఛత్రముగాఁగ నేలుచును నీవీ భూమిలో శాశ్వతా
స్తోకంబై పెనుపొందు కీర్తి ధనమున్ జూఱాడఁగా నోపుదో
భూకాంతా! యిదియేల నీ యసువులన్ బోఁద్రోవఁగాఁ జూతు వే
దో కానిమ్మిఁకఁ బొమ్ము దైవికమె యం చూహించి యీ పాటికిన్

మఱియొకమాట చెప్పెద సుమా! విను నీవు గతింప ధేను వి
త్తఱి నొకటే సుఖించు వసుధావర! నిన్ను సమాశ్రయించి యెం
దఱో బ్రదుకంగఁ జూతు రిది తథ్యము గావున నాదుమాట ద
బ్బఱయని యెంచఁబోకు మశుభంబును గోరకుమయ్య యిమ్మెయిన్.

గురువు వశిష్ఠుఁడున్ దనదు గోవు గతించినఁ గోపగించు నం
చెఱుఁగక పల్కెదేమొ! యొక యేఁబది లక్షల గోవులైన భూ
వర! సొగసైన వాతనికి భక్తిగ నీయఁగవచ్చు—హాని సం
బర పడవచ్చుఁగాన నిఁక వచ్చినదారినిబట్టి పోవుమా!

అని మృగరాజు పల్కిన భయంబున ధేనువు మోరసాఁచి తే
నిని గనుదోయితో నడిగి నెయ్యముగూర్చి మదీయ దేహ ర

క్షణ మొనరింపవే యని—విచారముతోడ దిలీపుఁ డంతయుం
గని వచియించె నిట్టులు వికారము లేశములేక వెండియున్.

క్షతమునుండి కాచుటను గాదె జగంబున క్షత్త్రియుండు శా
శ్వతమగు కీర్తిఁ గాంచు; నిఁక క్షత్త్రియుఁ డయ్యది సేయఁడేని యా
బ్రతుకొక లెక్కయే? మఱియు రాజ్యముతోఁ బనియేమి వానికిన్?
బఱతుఁడె వాఁడు భూభరణ పాలన ధర్మములందు సర్వథా.

మునివరుఁ డెన్నఁడేని యనుమోదము చూపునె లక్షగోవు లి
చ్చిన—నిది లేనినాఁ డిఁక వశిష్ఠుల వైభవ మేమియుండు? నీ
వును గణుతించియుండవు; భవుండు కలండని దీనిఁబట్టి వం
చన యొనరింపఁ జూతువు—సుసాధ్యమె యేరికినైనఁ బట్టఁగా?

ఇది సురధేను సంతతి మహిం గనరా దిఁక దీనివంటి జా
తిది, మునివర్యు హోమమున దివ్యఫలం బొసఁగూర్చు నిచ్చ లి
య్యది యటుగాన నా మనవి వ్యర్థము సేయక నాదు దేహ మి
య్యదనున వాడుకోవలయు నంచుఁ బదింబది మ్రొక్కె వెండియున్.

నరపతి పల్కె నేర్పరితనంబుగ నిట్టులు—లోకమందు ని
బ్బరముగ నేను వాక్యము లవశ్యముగా వచియింప మైత్త్రి యుం
బొరయును దాని నార్య జనముల్ గణుతింతురు గాన నిప్డు డి
ద్దఱకును నేస్తముం గలిగె; దానికినైనను సమ్మతింపవా!

అని వచియించి భూపతి మహావినయంబున దాని మ్రోల వం
చిన తల యెత్తఁ; డింతకుఁ జేతను దాల్చిన విల్లునమ్ము లిం
కను బనియేమి యంచు వెటకారముగా నటఁ బాఱవైచి భో
జనమును జేయుమా యని విచారము చూపక నిల్చి పొల్చెనన్.

అప్పుడు సింహ మా మొదవు నట్టె గబాలున వీడి యంతలోఁ
జప్పుడులేక విస్మయము నల్పుచు నొయ్యన మాయమయ్యెఁ; దా
నెప్పటి యట్ల యావు ధరణీశుని క్రేవ మెలంగి వానితో
మెప్పుగ నిట్లు పల్కె మితిమీఱిన ప్రేమము జాలువాఱఁగా.

ఓ నరనాథ! మెచ్చితి మహోత్తము భక్తికి—నీ విరక్తికిన్;
మునివరుండు చూపు నభిమానము మూలమునన్ దదీయ వి
జ్ఞాన వశంబునన్ భువిని ఘాతుక సత్త్వము దేనికైన నా
మేనికిఁ గీడుసేయఁ దరమే! యిది నీదు పరీక్ష మాత్రమే.

# శ్రీ రంగరాజు కేశవరావు

**శ్రీ బి. రామరాజు**

ఇటు ఓరుగల్లునుండి అటు గోలకొండవరకున్న భూభాగమును అట్టుడికించిన ట్లుడికించిన వీరుడగు సర్వాయిపాపనిగన్న షాహాపురమే సంస్కృతాంధ్ర ఫారసీ యరబ్బీ ఉర్దూ భాషలందు సమానపాండితీశోభితుడును, సరసకవిచక్రవర్తియు, సంగీత చిత్రలేఖన శిల్పాదికళాకుశలుడును, జ్యోతిషగణితశాస్త్ర విద్వాంసుడును అగు రంగరాజు కేశవరావును గన్నది. ఈ పండితకవి తన ఫారసీకవిత్వముచే నవాబు యాఖ్యాంగ్ద్దౌలాను మెప్పించి "కవిశిరోమణి" బిరుదనుందినట్లు కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు తమ "గోలకొండ కవులసంచిక" (పుట 379) లో వ్రాసియున్నారు. ఈ సంచికయందే కేశవరావుగారికి సంబంధించిన విషయములు — జనన మరణములు — ముద్రితా ముద్రితరచనములు — ఉన్నవి. కవిజననకాలము కాళయుక్తి జ్యేష్ఠ బహుళ 14 అనగా క్రీ. శ. 1858, మరణము 1314 ఫసలీ. అనగా క్రీ. శ. 1904. (ఈ రెండు తేదీలందు ఏదో కొంత పొరపాటు ఉన్నట్లున్నది. ఈ తేదీలనుబట్టి కవి 46 వత్సరములే జీవించినట్లు తెలుచున్నది. కాని నాకు లభించిన ఈ కవి చిత్రపటమును చూచినచో డెబ్బదేండ్లకు తక్కువగా బ్రదికియుండడనితోచును.) ఈతని యముద్రిత రచనములు 1. విక్రమాదిత్యము 2. ఇంద్రద్యుమ్నీయము. 3, రామాభ్యుదయము. 4. లీలాపరిణయము 5. కల్కిపురాణము 6. నీలాసుందరీపరిణయము. ముద్రితగ్రంథము దాశరథీశతకము. ఇవి కీ. శే. సురవరం వారిచ్చిన వివరములు. కవిగారివి కొన్ని పద్యముల నుదాహరణముగా రెడ్డిగారీ సంచికలో ప్రకటించినారు. వాని సంఖ్య 26 — చంద్రశేఖరోపాఖ్యానమను శీర్షికతో నున్నవి. ఈ పద్యములు బహుశః విక్రమాదిత్యము నుండి గ్రహింపబడియుండును. ఈ విక్రమాదిత్యము, రామాభ్యుదయము, లీలాపరిణయము, కల్కిపురాణము మున్నగు గ్రంథములేమైనవో తెలియదు. తదితర ఫారసీ యరబ్బీ ఉర్దూ రచనము లేమైపోయినవో తెలియరాదు. వారి వంశస్థుల చెంతనైన కలవో లేవో?



షాహాపురగ్రామవాసియైన పేర్వారం జగన్నాథమను నామిత్రునివలన కేశవరావుగారి "ఇంద్రద్యుమ్నీయము" వ్రాయబడినపుస్తకమొకటి నాకు లభించినది. కీ. శే. కేశవరావుగారిచెంత ఉద్యోగిగానుండిన పెరుమాండ్ల రామయ్యగారు (ఇప్పుడు వీరివయస్సు 85 సంవత్సరములు) ఈ పుస్తకమును జగన్నాథంగారి కిచ్చిరట. కేశవరావుగారి సర్వతోముఖపాండిత్యప్రతిభావిశేషములు కనుగొనుటకీ పుస్తకమొక్కటి చాలును. ఇంద్రద్యుమ్నీయముతో పాటు ఇందనేక లఘుకృతులు కూడ ఉన్నవి. ఫూలుస్కేపుసైజులోనున్న ప్రాతకాగితములపై చీటికొట్టు అట్టగా కుట్టబడియున్న దీ పుస్తకము. చిత్రలేఖన నైపుణి యొకచోట, సంగీతశాస్త్ర ప్రావీణ్యమొకచోట, గణితశాస్త్ర పరిజ్ఞానమింకొకచోట, గీర్వాణవాణీ నూపురారావములొకచోట, ఉర్దూ సంస్కృతపు ముద్దులొల్కు వ్రాతలింకొకచోట, చతుర్విధ కవితావిలాసము లొకవంక గల ఈ పుస్తకము కేశవరాయల ప్రతిభాపాండిత్యముల నందనోద్యానముగానున్నది. ఈ యుద్యానవనము విహరించి తన్మయుడనైన నేను అందున్న విశేషములు స్థాలీపులాకముగా పాఠకలోకమునకు, పరిశోధకమండలికి నివేదించుకొందును.

ఈ పుస్తకములో —

1. "కృష్ణా రాధికా నాయకా" మకుటముతో 25 పద్యములున్నవి. ఉదాహరణమునకు :

"శుకవు ల్కి దయ గానలేక సతత
 క్రూరావనీ పాలక
ప్రకరంబు న్వినుతించి యల్పతర దు
 ర్ద్రవ్యార్జనా బుద్ధి సం
తత భృత్యవ్రజ హుంక్రియాభయదసం
 ధానారత క్షోణినా
సకలాఘౌఘముల న్భజింపుగదరా కృ
 ష్ణా రాధికా నాయకా!"

2. రామాయణ కథామృతాంత మంజరియు 21 పద్యములందు వ్రాయబడినది. ఉదాహరణమునకు శరధి బంధనమును గూర్చి చెప్పిన పద్యము.

"ధరణీజాతాధవుడు
ద్ధురభుజబల సార గర్వ దుర్భరపుర సం
హరణోద్యమ ధూర్జటి పటు
శరధిశయన విశిఖభరాన శరధిక్ శరధిన్".

3. 'బాలికమతీ భజియింపుము చక్రహస్తునిన్" మకుటముతో వైరాగ్యబోధకములగు పద్యముల దొక తారావళి (27 పద్యములు).

"దలదురు మౌక్తిక ప్రకర
 చారుమణీ తపనీయఘంటికా
సలలిత మేఖలా కలిత
 చంద్రముఖీ జఘనస్థలంబె ని
చ్చలు సుఖసీమగా గొనెదు
 చందలమాంస వసాదిపుష్టిగా
దెలియగజూచి బాలిశమ
 తీ భజియింపుము చక్రహస్తునిన్."

4. గోలకొండ కవుల సంచికలో ముద్రితముగా పేర్కొనబడినట్టిది (కౌబోలు) దాశరధీ శతకము సంపూర్ణముగా 108 పద్యములందున్నది. రామచంద్రు నుపాలంభించిన పద్యములలో నొకటి—

"కట్టిన నిన్నె కానొరుని
 దిట్టను సన్నుతిజేసి పాదము
ల్బట్టిన నిన్నె కానొరుని
 బట్టను ధీగతి సాక్షి వీవె న
న్నెట్టులనైన నేగ దరి
 కీడ్చుము వీపున నీదు చేయితో
దట్టి భయంబువల్దనుచు
 దాశరధీ కరుణా సుధానిధీ!"

ఈ శతకమున 50 నుండి 66 వరకున్న పద్యములలో శ్రీరామచంద్రుని నఖశిఖపర్యంతము మనోజ్ఞ వర్ణనమున్నది. 106వ పద్యమున కవి తన నామాదికముల నిట్లు పేర్కొనియున్నాడు.

"శతమాయమేధ సంభవయ
 శస్సంఘాంగాంగ తరంగ పావనీ
కృతమగు రంగరాట్కులజ
 కేశవరాయకవి ప్రవీణతన్
కతిపయ సంస్తుతంబులు వ
 గానముల్లైన భవద్గుణాళి సం
తతబున హృద్యమయ్యెడిని
 దాశరధీ కరుణా సుధానిధీ!"

5. 'చిప్పంతగా కీర్తిభగవత వేంకటేశ" మకుటముతో నాల్గుసీసపద్యములున్నవి.

6. 'హనూమదగ్ర (హనుమకొండ) వాసా సాస్వామి రామానుజా" యనుమకుటముతో 13 పద్యములును, 7. కృష్ణశతకమునందువలె "శ్రీ కృష్ణా" మకుటముతో విరుపద్యములును, 8. ఇటులే "శోభనరమా" మకుటముతో తొమ్మిది పద్యములును నున్నవి.

9. విష్ణు పంచాయుధములను స్తోత్రముచేయు మత్తేభవృత్తములైదు. వానిలో మొదటి పద్యమున చక్రస్తోత్ర మిట్లున్నది. ఇది సంస్కృత పంచాయుధ స్తోత్రమున కనువాదము.

"సితసాహస్ర శిఖాగ్ర తీవ్రమును బుం
 జీభూత నానారవి
ద్యుతి జాలంబును దేవతాసుభయ కృ
 ద్దోషాకర క్రౌర్యత
స్ఫురదంగ క్షయ హేతు భూతమును దా
 శార్హాయుధశ్రేష్ఠమై
నుతుల న్మించు సునాభ చక్రమును సం
 తోషంబునన్ బాడెదన్."

10. "సౌమ్యవర దేశికపుంగవ మేల్కొనంగదే" మకుటముతోనున్న మేల్కొలుపుల పద్యములు 21.

"రవి యుదయించె నేనియును ని
 రస్తముగాదు మదంతరంగ సం
భవ తిమిరంబు పంకరుహ
 పంక్తులు విచ్చిన నస్మదీయ హృ
న్నవవనజాత పద్మిక స
 సంబొనగూడదు సజ్జనావళీ
దివిషద వంద్య సౌమ్యవర
 దేశిక పుంగవ మేల్కొనంగదే."

# శ్రీ రంగరాజు కేశవరావు

11. "శేషాద్రి వేంకట వృషాద్రీశ్వరా" మకుటముతో వేంకటేశ్వర సుప్రభాతమను శీర్షికతో 22 పద్యము లున్నవి. వానిలో మొదటిది.

"శ్రీ లక్ష్మీ కుచకుంభ సంభృతఘన
శ్రీ గంధ కస్తూరికా
జాలోద్యత్పృథువక్షు వేంకట నగ
స్వామిత్వ దీప్యన్మహో
ఖేలా చందనకుంద సుందరయశః
క్షీరాంబు పూర్ణాప్త ది
క్కూలే భద్రశ్రుతిరంధ్ర నీరనిధి శే
షాద్రే వృషాద్రీశ్వరా."

12. "పట్టాభిరామ" మకుటముతో పదకొండు సీస పద్యములు, 13. "జగదీశా వేంకటాద్రీశ్వరా" మకుటముతో తొమ్మిది పద్యములు నున్నవి.

14. ఇంద్రద్యుమ్నీయము లేదా ఐంద్రద్యుమ్నము. ఇది ఆరాశ్వాసముల ప్రబంధము. కవి పైరెండు గ్రంథ నామములను వాడియున్నారు. దీనిలో మొత్తము 767 పద్యములున్నవి. ప్రతిలోనున్న తేదిని బట్టి చూచినచో (ప్రమాది సంవత్సర మాఘ శు॥ 5 గురువారం) ఈ గ్రంథమును కేశవరావుగారు నూనూగు మీసాల నూత్నయౌవనమున వ్రాసినట్లు తేలుచున్నది. అరువది రెండేండ్ల ప్రాయమున పిలకను చరిత్రమునంటి ప్రౌఢప్రబంధమును రచింపగలిగిన కేశవరావుగారి ప్రతిభాపాండిత్యము లమోఘములై యుండవలెను. కేశవరావుగారు పరమభాగవతోత్తములు. వారి రచనములందంతటను భగవద్భక్తి కానవచ్చును ఈ గ్రంథమును వారు శ్రీ వేంకటేశ్వరస్వామి కంకితముగా రచించిరి.

"గాంగేయకుధర చాప
సంగనిధగు శైలరత్న సంగున కసితో
త్తుంగవలాహక సమునీ
లాంగునకు వేంకటాచలాధిప నతన్"

అంకితముగా రచితమగు నీ ఉత్తమకావ్యమున ఇంద్రద్యుమ్నుడేలు ద్రవిడదేశమునకు రాజధానియైన మహిళాపుర వర్ణనముతో కథ మొదలగును.

"సురసాల ఫలదృప్త శుకముఖ సద్విజ
సేవితాయత కేళి కాననముల
ప్రోద్యత్సువైజయంతా ద్యంకశోభితా
త్యలఘు హైరణ్మయ హర్మ్యతతుల
రమణీయలావణ్య రంభోరు నాట్య లీ
లాభవ్య రంగస్థలముల వలన
ప్రథిత విక్రమ చిత్ర రథభట గంధర్వ
కుంజర సంపూర్ణ గోపురముల
త్రిదశపుట భేదనంబుతో దీటుగాంచి
వెలయు దానురసంపదమై వివిధ భోగ
భాగ్యముల గ్రాలి సత్కుమారభాగమునకు
పెంపుగను మహిళాపురాభిఖ్య నొకటి."

వర్ణనము లన్నియు ప్రౌఢ ప్రబంధమార్గమం దిటులే యున్నవి. కథానాయకుడగు ఇంద్రద్యుమ్నుని వర్ణన మిట్లున్నది.

"విద్యుత్సన్నిభ నైజపాణి కలితో
ద్వేల్లాగ్ర నిస్త్రింశక
ప్రోద్యద్వజ్ర సమార సందళిత శ
త్రు ప్రౌఢ యోధాది సం
పద్యుక్తు, డకళంకు డమ్యత రమా
ప్రాశస్త్యత న్మించు నిం
ద్రద్యుమ్నాఖ్యుడు చక్రమిత్రకుల దు
గ్ధ క్షీర దిందూపమున్"–

ప్రథమాశ్వాసమున మహిళాపుర వర్ణనము, చాతుర్వర్ణ్య వర్ణనము, పురస్త్రీల వర్ణనము, ఇంద్రద్యుమ్న మహారాజు తత్సభా వర్ణనము లున్నవి. ఆటవికులు కొందరు మృగబాధనోర్వక రాజుగారికి తమ ఇడుములు నివేదించి మృగయా ఖేటమున కాహ్వానింతురు. రాజుగారు వేటకు కావలసిన సన్నాహము లొనర్చుటకు మంత్రి కాజ్ఞాపించును. ఇంతలో సూర్యాస్తమయమగును. ఇచట సూర్యాస్తమయము, సంధ్యారాగము, చీకటులు, నక్షత్రములు, చంద్రోదయము వర్ణింపబడినవి. ఈ వర్ణనములతో ప్రథమాశ్వాసము ముగిసినది.

ద్వితీయాశ్వాసమున ప్రభాతము, వేటకొఱకు సన్నాహము, ఇంద్రద్యుమ్నుడు తోడి రాజలోకముతో వేటకు సన్నద్ధుడై వెడలుట, చతురంగ బలములు, యవనభటులు, బోయలు, మున్నగువాని వర్ణనము లున్నవి. ఇంద్రద్యుమ్నుడు బయలుదేరి పట్టణము విడచి అడవులు గడచి గంగా సమీపమునకేగెను. ఆతనికచట త్రికూటము కానవచ్చెను. త్రికూట ప్రాంతారణ్యములందు ఇంద్రద్యుమ్నుడు సపరివారముగా ఆఖేటనము సలిపెను. ఆ యా వేటకొఱకు చాకచక్యమున కలరి వారి నుచిత బహుమానము లిచ్చెను. ఎరుకలు

కోటరాజు కోలాహలములు చేయుటతో ద్వితీయాశ్వాసము ముగియును. రాజుగారు పూజకై యోగుల నియమించిన పట్టున నున్న పద్యమిది.

'పవమూలన్వృతలసత్ఫణిగాన నీలకం
ఠస్ఫూర్తి నీలకంఠంబు జూపె
కృతఫలాహారయై శ్రుతిహితవాక్య వి
శ్రుతగిల శుకలీల శుకము జూపె
సౌగంధిస్యామోద సౌభాగ్య మనుటవా
సవనృత్తి యిటనవాసరము జూపె
హంసవాహనవృత్తి నేరుట కమలజా
తత్వంబు కమలజాతంబు జూపె
గాన నీగాన గోనలో గానసైన
గానవేలుపురాజుల గాంచి యాలరు
పూజసేయించుడని కోటరాజు నచట
నచట నియమించె విశ్వవిశ్వాధిపాభుడు."

తృతీయాశ్వాసము సూర్యాస్తమయవర్ణనముతో ప్రారంభమైనది. వెన్నెలలు కన్నులపండువులైనవి. రాజట పటకుటీరములందు తన చెలులతో నివసించుట, "చంద్రలేఖ"తో రాజు వనవిహారము చేయుట విపులముగా శబ్దాలంకారములతోడ వర్ణింపబడిన పద్యము లధికము. చంద్రలేఖ తన చెలులతో గలిసి పుష్పాపచయ మొనర్చుట రగడలో నున్నది.

"భానుభాను వితాన వికసిత పద్మపద్మసువాసనాసము
ధీధినవషట్పదీతతి తేనెదే నెనరించె భృంగము
కొనకొన నవబోడి తానసెగానగానము జేసె నదివిను
తానతానగతుల్యరించె ముదాన దానుదాళిగతిగగ"

ఇది యిటులే దీర్ఘముగా సాగినది. ఇంద్రద్యుమ్న సరోవరముకడ రాజుగారి వనవిహార కోలాహలరవ మాలించి హాహాహూహూ నామ గంధర్వరాజు ఉత్తాలుడను వాని నంపి రాజుగారి సమాచార మంతయు తెలిసికొనును. గంధర్వదూత రాజుగారిని సత్వరమే యావనము విడిచిపొమ్మనును. లేనిచో గంధర్వరాజుతో యుద్ధము తప్పదనును. ఇంద్రద్యుమ్ననకును గంధర్వరాజునకును జరిగిన యుద్ధముతో మూడు నాలుగు ఆశ్వాసములు ముగిసినవి. ఈ యుద్ధములందు గంధర్వులు తరతర ఖేచరులతోడను, దైత్యులతోడను ఇంద్రద్యుమ్నని పైకెత్తి వచ్చినను విష్ణుభక్తుడును, అమితబలశాలియునగు ఇంద్రద్యుమ్ననకే విజయము సమకూరును.

పంచమాశ్వాసము ఆరంభమున ఇంద్రుడువచ్చి ఇంద్రద్యుమ్నని మెచ్చి గంధర్వపతికిని రాజునకును సంధి యొడగూర్చును. ఇంద్రుడింద్రద్యుమ్ననకు దేవతావిమానము బహుమానముగా నిచ్చి అప్పుడప్పుడద్దాని నెక్కి స్వర్గమునకు రాకపోకలు చేయుమని చెప్పి మైత్రి పాటించును. అప్పుడింద్రద్యుమ్నుడు తన పట్టణమునకు బయలుదేరును. ఈ పట్టున

"రణభేరికాధణంధణలు మత్తేభ ఘీం
కారంబు లొక్కట గలసి మెలసె
కాహళీ వీరశంఖస్వనంబులు ఘోట
క హ్రేషఘోషలు కలసి మెలసె
ఝల్లరీ పటహానిస్సాణరవంబులు శతాం
గపదగర్ఘరములు కలసి మెలసె" అని

వర్ణించిన పద్యము వసుచరిత్రమందలి "నృపమౌళి భవ సువర్ణ పరాగములు సువర్ణ పరాగములు నభిన్నత వహించె"నను పద్యమును దలపించును.

ఒకనాడింద్రద్యుమ్నుడు నిండుకొలువు దీరియుండ నారదు డరుగుదెంచెను. ఇంద్రద్యుమ్నుడు నారదు నుచితరీతి సత్కరించి పూజించును. నారదుడా రాజు నభినందించును. పరాజితుడైన హాహాహూహూ నామగంధర్వుడు మరల ఏదో యుపద్రవము కూర్చుటకై కృతకృత్యుడై యున్నవాడని నారదుడింద్రద్యుమ్ననకు చెప్పి ప్రతిక్రియగా విష్ణువ్రత మాచరింపుమని హితబోధమొనర్చి వెడలిపోవును. ఇంతటితో పంచమాశ్వాసము ముగిసినది.

షష్ఠాశ్వాసమున నింద్రద్యుమ్నని విష్ణువ్రతము, అన్నదానములు, విష్ణుభక్తియు వర్ణింపబడినవి. ఈ వర్ణనములందు కవిగారి విష్ణుభక్తి యొద్దులూరసినది. అతిథిసత్కారములు, భోజనోత్సవములు బాగుగా వర్ణింపబడినవి. ఒకనాడింద్రద్యుమ్నుడు పూజావసరమందుండ అగస్త్యు డరుగుదెంచును. రాజు వెంటనే వచ్చి తన్ను సత్కరింపడయ్యెనని యగస్త్యుడింద్రద్యుమ్నని మదగజ మగునట్లు శపించి వెడలిపోవును. ఇంద్రద్యుమ్నుడాతని వెంబడించి ప్రార్థించును. కొంతకాలము శాపమనుభవించి శ్రీ మహావిష్ణువు దయకు పాత్రుడవగుదువని శాపమోక్షమును ప్రసాదించి ముని వెడలిపోవును. రాజు తనవిధికి వగచి కుమారు నభిషిక్తుజేసి శాపానుభవమున కెదురుచూచుచుండ నారదుడువచ్చి రాజు నూరడించి శాప మొక కారణమనియు తత్కారణముగా విష్ణుసాయుజ్య మందెదవనియు చెప్పి, హాహాహూహూ గంధర్వుడు పరాభవ మీగికొన బలము కూర్చుకొనుటకై శివునిగూర్చి

# శ్రీ రంగరాజు కేశవరావు

తపమాచరించుట, శివు డాతని కోరికను మొదటమన్నించక శపించినను తరువాత మన్నించి వేరొకజన్మమున (మకరియై) ఇంద్రద్యుమ్నుని (గజమును) విడించునట్టుల వరమిచ్చుట లాదిగాగల విషయములు చెప్పి వెడలిపోవును. కేశవరావుగారు వైష్ణవులైనను పరమత విద్వేషకారనుటకు శివుని గూర్చిన మనోహరవర్ణనములు సాక్ష్యములు.

తరువాత కథ అనగా గజేంద్రమోక్షణకథాభాగము అంతయు దండకరూపమున శుకుడు పరీక్షిన్మహారాజునకు చెప్పినట్లున్నది. ఈ దండకము పలుతావుల పోతనగారి గజేంద్రమోక్షమును దలపించును

శాపమోక్షణ మందినగజేంద్రు డింద్రద్యుమ్నుడు శ్రీమన్నారాయణుని స్తోత్రము చేయుటలు గోమూత్రికా. శార్ఙ్గబాణ. పుష్పమాలా, ఛత్ర, నాగబంధములందున్నవి. ఈ పద్యములే కావ్యాంతమున నాయా చిత్రములందు కూర్పబడియున్నవి. మరియును మత్తేభకందగర్భితసీసములు చిత్రకవిత్వములును గలవు. శ్రీ మహావిష్ణువు పాంచజన్యమును పూరించిన పద్యమును గమనించిన పోతనగారి కవిత నీతని యెంతగా జీర్ణించుకొనెనో తెలియును.

"శౌరి పూరించెను పాంచజన్యము స్వకీ
యస్వాన వేపన్నికా
చర సైన్యంబు విధూత దైన్యమును చం
చత్స్వర సన్మానముల్
పరిహృష్టీకృత వన్యము న్ముదిత జృం
భ న్మౌని రాడ్జన్యముల్
భగితధ్వానదరణ్యము న్ఛరిమిత సే
వాహీన భక్తాన్యమున్."

శాపవిముక్తులైన హూహూ గంధర్వేంద్రద్యుమ్నులు తమతమ నెలవులకేగిరి ఇంద్రద్యుమ్నుడు సుఖముగా రాజ్యమును పాలించును. అతని ధర్మపాలనమే కావ్యాంతమున భరతవాక్యముగా నున్నది.

రమణీయసుఖము ధరాజనంబులకును
శోభావిభూతి వసుంధరకును
జారచారాసుర సంఘంబునకు భీతి
బుధకలాపములకు మోదగరిమ
బంధుసంతతికి సంభావనీయంబుగ
దేవావళులకు తోషావహంబు
ప్రథితౌషధులకు పుష్పఫలాభి సంప్రాప్తి
గో బ్రాహ్మణాళికి కూటవృద్ధి
యొసగ వీతధరాధరీకృత నితాంత
జరఠకమఠాహికరటి భూధర కిటీంద్ర
పరమచరమాంగభోగ కుంభాగ్రవంక్తి
కాగ్రభూధర రవిగు ప్తమైన క్షితిని."

దీని తరువాత రెండుమూడు ఆశ్వాసాంతపద్యములును, ఒక మంగళమహాశ్రీయును కలవు. తరువాత గద్యమున్న గద్యముక్రింద అంగుళీయకముద్ర గోధుమవర్ణముసిరాతో ఒత్తిబడియున్నవి. వయాపైస ప్రమాణములోనున్న యా ముద్రయందు ఫారసీలో నేవో యక్షరము లున్నవి. ఇంద్రద్యుమ్నీయమంతయు నల్లసిరాతో వ్రాయబడియున్నది. ముద్రక్రింద మరి బెత్తెడు స్థలమున్నది. కాని యచట ఏమియు వ్రాయబడలేదు. ప్రక్క పుటలోనైన వేరొకసిరతో ఇట్లు వ్రాయబడినది:

"ప్రమాదినామసంవత్సర మాఘ శు॥ 5 గుర్వారం నాడు రంగరాజు వెంకట్రామయ్యగారి కొమారుడైన రంగరాజు కేశవరాయుడు ఖుదుగా విరచించి వ్రాసుకున్న ఇంద్రద్యుమ్నీయము చ 2 రబ్బియులవ్వలు 1297 హిజిరి." పైవరిమాట హిజిరియో ఫసలియో సరిగా తెలియరాదు. అటుతరువాత బంధకవిత్వపు చిత్రములున్నవి. ప్రమాది మాఘ శు॥ 5 యనగా క్రీ. శ. 15 2-1880 అగుచున్నది. కాని వారము సరిపోవుటలేదు. ఇంగ్లీషు తేది ప్రకారము ఆనాడాదివారమగుచున్నది. అరబ్బీ తేదీకూడ కుదురుటలేదు. అది క్రీ. శ. 12-10-1879 తో సరిపడుచున్నది. ఈ తేదిలు కుదరకపోవుట యటుంచి ఇంకొకవిశేషము. పై తేదికవిగారిచ్చినది గ్రంథరచనా సమాప్తిని తెలుపునట్టిదో, లేదా మూలప్రతిని చూచి రెండవప్రతిగాని సవరణములతో ముగిసిన రెండవ వ్రాతప్రతిగాని, కావలెను. ఇట్లూహించుటకు మరియొక కారణమున్నది. తృతీయాశ్వాసమున 49 వ పద్యము రెండుమారులు వ్రాయబడినది. పద్యముక్రింద వరల నదేపద్యము మొదటిసారి వ్రాయుట పొసగదుగదా! రెండవమారు ఎత్తివ్రాసుకొన్నపుడీ పొరపాటు జరిగియుండునని నాయూహ.

ఇంతవరకు చెప్పినది కేశవరావుగారి తెలుగుపద్యకవిత్వమునుగూర్చి. కేశవరావుగారు గొప్పసంగీతవిద్వాంసులుకూడ. ఇంద్రద్యుమ్నీయాశ్వాసాంత గద్యములందువారు సంగీతకవిత్వ విద్యాధురీయుడనని చెప్పుకొనియున్నారు. అనేక సంకీర్తనములు, కృతులు, మంగళహారతులు, మేలుకొలుపులు, మున్నగునవి వ్రాసి వానికి రాగతాళము లిచ్చియున్నారు. ఒక పుటపై సప్తతాళ ప్రస్తారములపట్టికను, ఆయా సంకేతపదములకు వివరణములను ఇచ్చియున్నారు. మరియొకపుటమీద ఆయా రాగములు వాడియాదున్న స్వరముల పట్టికను ఇచ్చినారు.

అధ్యాత్మరామాయణ మారుకాండములు కేశవరావుగారు కీర్తనలుగా వ్రాసినారు. దీనికి నాందిగా.

రేగుప్తి "శ్రీరాగం" ఆది.

విరచించెద రామాయణము । సుక ।
విశ్రుతి వర్గరసాయనము
సుకృతి సురభివాతాయనము । రఘు ।
నూనురచిత పారాయణము

నృపతీకృత పారాయణము । బహు ।
నిర్మిత పుణ్యపరాయణము
వృత్తిముదిత కవిగాయనము । శ్రీ ।
వేంకట రమణోపాయనము"

అని నివేదించుకొన్నారు. ఈ రామాయణమున మొదటి కీర్తనము "శ్రీకరమగు రామాయణ చరితము చేరి వినవె గౌరీ" యని యారంభమైనది. చివరనున్న మంగళహారతిలో "రంగరాట్కేశవరాయకృత మృగుల రామాయణ కథారసాధిపతికి "మంగళమనవె ఘనవేణీ, సర్వమంగళా రమణీ" యని తన నామాంకితము గావించియున్నారు. గద్యము తరువాత "చాంద్రమాన ప్రభవాదిసంవత్సర మధ్యగత చిత్రభాను సంవత్సర వైశాఖ శు॥15లు స్వహస్తాక్షుర లేఖ్యమున లిఖియింపబడెను" అని యున్నది. ఇది క్రీ.శ.8-5-1882 తేదికి సరిపోవును.

ఇంకను వివిధ రాగములలో రామానుజులను గురు పరంపరను స్తోత్రము చేయునట్టి తొమ్మిది కీర్తనములున్నవి. ఇటులనే శేషాద్రి నిలయుని పై జెప్పిన కృతులు కలవు. చక్కని సాహిత్య సౌష్ఠవముతో సుమారు 10 కీర్తనములు, 10 జావళీలును భగవత్పరముగా రచింపబడి కవి నామాంకితములై రాగతాళములతో స్వరములతోనున్నవి. లభించినట్టి కేశవరావు చిత్రపటములో ఒక ప్రక్కన టేబిల్ మీద వయొలిన్ మరియు వీణియ కలవు. దీనినిబట్టి వారు జంత్రగాత్ర ప్రవీణులని తెలియనగును.

ఇంతవరకు కేశవరావుగారి తెలుగు కవిత్వమును సంగీత పాండిత్యమునుగూర్చి మాత్రమే మనవి చేసితిని. కేశవరావుగారు సంస్కృతమునగూడ గొప్ప పండితులు కవులు. వారు సంస్కృతమున నేయే కృతులు రచించిరో తెలియదు గాని ఈ పుస్తకమునందే వివిధ శీర్షికలతో వివిధచ్ఛందములందు వారు రచించిన 122 శ్లోకములున్నవి. కేశవరావుగారు గొప్ప వైష్ణవభక్తులగుట వారి కవిత్వమంతయు భగవల్లీలకును, భక్తి ప్రపత్తులకును వినియోగమైనది.

1. శఠకోపముని పేరుతో నాలుగు శ్లోకములొక్కకడ గలవు. మచ్చునకు వానిలో నొకటి.

"సుమతే ప్రసీదమయి దీనసేవధే,
కరుణారసైక కంశీపయోనిధే,
శఠకోప తాపసవరోర్ధ్వనిర్మితే.
శఠకోప కేశికమణే మహాఘృణే."

2. వేదాంత కేశికు నుద్దేశించి వ్రాయబడినవి. 62 శ్లోకములు వివిధ వృత్తములందున్నవి. 3. స్వాచా

# శ్రీ రంగరాజు కేశవరావు

ర్యులగు హనుమకొండ నృసింహాచార్యుల స్తోత్రరూపమున 28 శ్లోకములున్నవి. 4. "హనూమ ద్గిరీశం భజే భావ్యకారం" మకుటముతో పదునొకండు భుజంగప్రయాతవృత్తములందు స్వామాచార్యుల స్తోత్రమున్నది.

ఇంతవరకు కేశవరావుగారి యాంధ్రగీర్వాణ కవితాపాటవ మారసితిమి. వారు కవులే కాక వివిధ శాస్త్రములందును గొప్ప పండితులని ఈ పుస్తకము సాక్ష్యమిచ్చుచున్నది. కేశవరావుగారు గణితశాస్త్రమందును, జ్యోతిషవిద్యయందును గడిదేరిన వారు. ఈ పుస్తకము చివరన నాలుగు కమ్మలమీద అంకగణితము, క్షేత్రగణితమునకును సంబంధించిన లెక్కలున్నవి. ఆయా లెక్కల కుదాహరణములు వారే యిచ్చి వానిని గుణించి లెక్కలు తీయుటే కాక ఆయా సూత్రములను పద్యములుగా వ్రాసియున్నారు. ఈ పద్యములు మరి వారివో లేక ఇంతవరకితర పండితులు చెప్పినవో నేనెఱుగను.

"ఇదు గాశి మూటిలోపల
కదనదను గుణించి రాశిగై కొని మొదలన్
వడిబాలుగొన్న లబ్ధము
పుడమిం ద్వైరాశికంబు పొంగుగ వచ్చున్."
"మూడు నాలుగైగు కూడ నెచ్చుగుణించి
రాశి నొక్కచోట వ్రాసి మొదలు
ఒకటి రెంటబెంచి సుకృతులతో రాశి
భాగహారము జేయ వచ్చు పెచ్చు"

'సమపంచరాశికం' గూర్చియు. 'వ్యస్తపంచరాశికం' గూర్చియు పద్యములతో బాటు లెక్కలు గూడ గుణించబడియున్నవి. క్షేత్రగణితమునకు సంబంధించిన పద్యములు లెక్కలు గూడ కలవు. ఇవి గాక 'చతుర్భుజ' మున్నగువానికి పద్యములును ఉదాహరణపు లెక్కలును కలవు. క్షేత్రగణిత ప్రక్రియా వివరణము పట్టికగా నొక పుటపై వ్రాయబడియున్నది.

మరియొక కమ్మపై స్వప్నఫలితములు 16 శ్లోకములందు చెప్పబడినది.

రంగరాజు కేశవరావుగారు గొప్ప చిత్రకారులు కూడ. వారి వ్రాత చిన్నగా ముద్దులు మూటగట్టు ముత్యాల కోవవలె నుండును. కలముతో వాలిసుగ్రీవుల యుద్ధమును చిత్రించినారు. రామలక్ష్మణులు వెనుక నుండి వారి యుద్ధమును చూచుచున్నట్టులను, రాముడు వాలిపై బాణము సంధించుచున్నట్లును ఆ చిత్రమున నున్నది. మరియొక పుటపై మునివేషియగు రామచంద్రుని బొమ్మ వ్రాయబడినది. కుడిచేతిలో కమండలువు. వీపున విల్లునమ్ములు, నడుమున ఛురిక, ఎడమచేత బల్లము లున్నవి రామచంద్రునకు. ఇంకొక పుటపై కాళీయాహిపై తాండవమాడు బాలకృష్ణుడున్నాడు. ఒక పుటమీద ఇరువు రాశ్వికులు ముఖాముఖిగా నుండి తమతమ గుఱ్ఱములను పోరునకు పురికొల్పుచున్నారు. ఇది వ్యంగ్యచిత్రము వలెనున్నది. ఒక గుఱ్ఱముపై ఒక రౌతు స్వారియై యున్నాడు. ఈతడు తురకయని సూచించుటకు కాబోలు ఈతని నెత్తిపై కులా యున్నది. ఎదుటి రౌతు పానవారియై తన రెంకళ్ళెములను పురికొల్పుచున్నాడు. ఈ రెండు గుఱ్ఱములు వెనుక కాళ్ళపై నిలబడి ముందు కాళ్ళతో ఎదుటి గుఱ్ఱమును తన్నుచున్నవి. తురుష్కుని యోటమి సూచించుటకు కాబోలు అతడెక్కిన గుఱ్ఱము వెనుక నుండి పెంటికలు విడుచుచున్నట్లు చిత్రింపబడినది వ్యంగ్యచిత్రము. ఆయా చిత్రముల క్రింద కేశవరావుగారు తామీ చిత్రముల వ్రాసినట్లు తెలుగు మరియు ఉర్దూ భాషలలో చాల అందముగా వ్రాసికొన్నారు. నాగరలిపిలో గూడ తమ గద్యలను, కొన్ని శ్లోకములను అందముగా వ్రాసియుంచినారు. ఫారసీ భాషలో రెండు మూడు తావులందు తమ రచనముల యౌత్కృష్ట్యమును గూర్చి ఉత్కర్షగా వ్రాసికొన్నారు.

ఒక రెండు కమ్మలమీద ఆముక్తమాల్యద, భారతము, వసుచరిత్రము మున్నగు గ్రంథములందలి పద్యములలో కొన్ని శబ్దములకు అర్థవిచారణచర్చ లున్నవి. పరంపరగా కొందరాయా శబ్దముల కెట్టర్థము చెప్పుచున్నారో వాని నుట్టంకించి సరికాని వానిని ఖండించి వేరర్థములను ఉదాహరణములను ఇచ్చియున్నారు.

పై విషయములన్నియు నాకు లభించిన పుస్తకమాధారముగా వ్రాసిన వ్రాతలు. ఓరుగల్లు నల్లగొండ మండలములందలి వృద్ధపండితులు కవులు మున్నగువారి నోళ్ళయందు కేశవరావుగారి చాటువులు, వారి రచనములందలి చక్కని పద్యములును కలవు. ఓరుగల్లు మండలమున సజీవులై యున్న పండితకవులందు శ్రీ గార్లపాటి రాఘవరెడ్డిగారొకరు. కేశవరావుగారి పద్యములు వారికి కొన్ని కంఠస్థములు. వారు వినిపించగా నేను వ్రాసికొన్న పద్యములివి. తెలుగులో "వయసు వంకదీర్చు" నను సామెత యొకటి కలదు. దాని నాధారముగా గొని కేశవరావుగారు చమత్కారముగా వ్రాసిన పద్యమిది.

"వృత్తకుచముల తనులత వేణి కురులు
భావమున దృష్టి గర్వసంభ్రమత బొమలు
హాసమున మోవి వక్రంబులయ్యె వయసు
వంక దీర్చు ననుమాట బొంకు గాదె."

కేశవరావుగారికి రానివిద్య ఈతయొక్కటే నట. తక్కినవిద్యలన్నియు వారికి కరతలామలకములని వెనుకటి పండితులు చెప్పుచుండగా వింటిని. ఇట్టి మహాపండితకవిని గన్నతల్లి ధన్య. ఆయన గ్రంథములేవియు అచ్చుగాకుండుట మన దురదృష్టము. అన్నిగ్రంథములును లభించకపోవుట మరింత దురదృష్టము. సాహిత్యపోషకులైనట్టి యుదారులో, ఆయన వంశజులో కనీసము ప్రాంతీయాభిమానముగల ఆ యూరి వారో ఆమహానుభావుని గ్రంథములు ముద్రించుట లెస్స.

# దాగుడు మూతలు

## శ్రీ "రంగారావ్"

జీవితం—సంఘానికీ, దానికట్టుబాట్లకూ ప్రతిబింబం. మనసు ఆలోచనకూ, ఆలోచన ఆచరణకూ ఆధారం.

జీవితం అన్న పట్టకంమీద మనస్సనే కాంతి రేఖ ప్రసరించినపుడు అది పరావర్తనం చెంది—తనమధ్య వివిధవర్ణాల నిముడ్చుకున్న 'మంచీ—చెడూ' అన్న కిరణాలుగా పరిణామం చెందుతుంది.

మంచీ—చెడూ అన్నవి తరతరాలమీద ఆధారపడిన విశేషాలు; సరిహద్దులేని విభాగాలు; 'ఆల్జీబ్రా'లోని 'ఎక్స్, వై'ల రూపాంతరాలు. ఆ రెంటిలో దేనికీ స్వయం సంపూర్ణత లేదు. వాటిలో ఏది ఎక్కడ అంతిమయి, ఎక్కడ రెండోది ఆరంభమవుతుందో చెప్పడానికి వీల్లేదు. ఆ రెండూ సముద్రపు అలల్లాగా కలిసిపోయి, నురుగులు కక్కుతూ, ఉరకలు వేస్తూ, పరుగులిడుతూ మానవుడి మస్తిష్కాన్ని మథిస్తుంటాయి.

మనం 'చెడు'ని చరిస్తూ 'మంచి'ని స్మరిస్తుంటాం. లేదా తలపుల కడుగున 'చెడు' పరుగిడుతున్నా చేతలు 'మంచి'ని చేస్తుంటాం. ఈ రెంటి నిమ్నోన్నతాల్లో ఇరుక్కుపోయి—అనుకున్నది చేయకా, చేసినదానిని గురించి అనుకోలేకా మథనపడుతుంటాం. కావలసినదానిని చెప్పలేకపోతాం; చెబుతున్నదేదో అక్కర్లేకపోయినా వాచామాత్రం కావాలంటుంటాం. ఈ వెలుగు నీడల, దాగుడుమూతల పద్మవ్యూహాన్ని ఊహించి, సాహసించి, ఛేదించడానికి సిద్ధమయేసరికి తెర జారుతుంది. ఆ కారణంచేతనే ఈ సంఘర్షణ నర్థంచేసుకుని ఈ వారిధికి వారధికట్టినవారరుదు. అలా ఈ బాటను దాటినవారు సాధారణానికీ, సామాన్యానికీ ఓమెట్టు పైనివారు.

కానీ ఉషా, శర్మా ఈ ప్రవాహంలో ఈదలేకపోయారు; ఈ చీకటిలోనే కాలుజారారు.

తనలోని స్త్రీ సహజమైన మాతృవాత్సల్యానికి జోడుగా శర్మకు దైవత్వాన్ని ఆపాదించి ఆరాధించింది—ఉష.

పురుష సహజమైన తన 'అహా'నికి ఉషని ఆహారంగా తీసుకుని, ఆమె జీవితవలయానికి తాను కేంద్రమనుకుని, ఆమెలో శైశవత్వాన్ని మాత్రమే చూచాడు.

ఇద్దరూ కూడా ఒకరిలోని మానవత్వాన్ని మరొకరు—తాత్కాలికంగానే చాలు—మరచిపోయారు. ఉష శర్మలోని పురుషుణ్ణీ, అతడామెలోని స్త్రీనీ ఆలస్యంగా గుర్తించారు.

* * *

ఒకానొక జన—ప్రపంచం అరణ్యంగా, జీవితం ఎడారిగా అనిపించిన రోజున—బీచి కెళ్ళాడు శర్మ. అక్కడ—నేలా, నీళ్ళూ, నింగీ, నిరంతర ప్రియమై దాగుడుమూత లాడుకుంటున్న—అక్కడ, ఒంటరిగా కూర్చుని నయాగరా జలపాతంలా కన్నీళ్ళు కారుస్తున్న ఉష కన్పించింది. ఇరవై నాలుగేళ్ళ ఆవిడ ముప్ఫైకన్న ఎక్కువ వసంతాలను చూచి వుండదనిపించింది. మత్స్యయంత్రాన్ని కొట్టబోతున్న అర్జునుడిలా శర్మదృష్టి ఆమెమీదను కేంద్రీకృతమయింది. 'ఏడుస్తున్న—ఆమె ఆ తెల్లచీర సరిపడలేదు. కనీసం ఆవిడ ఆ తెల్లచీర కట్టుకుని చేయవలసిన పని ఏడవడం కాదు. ఆమెలో భాష కందని ఆకర్షణ వుంది. ఆమె అందం ఆ ఆకర్షణలో ఒకభాగం మాత్రమే.' శర్మ మనస్సముద్రం ఆలోచనా తరంగాల ఆటుపోట్లు కాలవాలమయింది. "ఈమె ఎందుకిలా సముద్రంతో పోటీవేసుకుని ఇసుకను కన్నీటితో తడుపుతున్నది? ప్రపంచం ఈమెకేం అన్యాయం చేసింది?"

శర్మ ఆమెపక్క వెళ్ళి "ఏమండీ?" అన్నాడు. మరణం ప్రతిఫలిస్తున్న ఆమె కళ్ళల్లో భయానికీ, ఆశ్చర్యానికీ తావు లేకపోయింది.

"ఎందుకలా ఏడుస్తున్నారు?" తనెవరో ఇలా అడగడానికి—

"గుండెను ఎడారి చేసుకుందామని..." అంది ఆమె తడారిపోయిన గొంతుకతో.

"కారణం?"—ఈ ప్రశ్న శర్మ మళ్ళీ వేయవలసి వచ్చింది.

ఈ అపరిచితుడి కళ్ళల్లోని 'పిడికెడు' సానుభూతిని గుర్తించిందామె. ముగిసిన తన జీవితపు అధ్యాయాల పుటల్ని వెనక్కి తిప్పింది ఆమె.

ఐదేళ్ళక్రింద భర్త చనిపోయిన నాటికి చేతిలో పది నెలల పాపాయిట. టీచరుపని చేస్తూ, ఉన్న కొడుకును పెద్దచేయాలన్నది ఆశయంగా, జీవితం వ్రతంగా, అయినవాళ్ళని కాదని ఒంటరిగా బతకడం మొదలిడిందిట. రెండు నెలల క్రితం బడిమే నేజరుకు తన శరీరాన్ని అర్పించడానికి నిరాకరిస్తే “నీ ఉపాధ్యాయినీత్వం అక్కర్లేదు పొమ్మ”న్నాట్ట. ఉద్యోగం పోయిన నెల రోజులకు కుర్రాడు పోయాట్ట. డబ్బులేక మందులు సరిగా ఇప్పించక వాడిచావుకు తానే కారణమయా నన్నది ఉమ.

‘నా శీలానికోసం నా బిడ్డను బలిఇచ్చాను. ఇపుడు నా ప్రాణానికే విలువ లేదు. నా బ్రతుక్కి అర్థము ఆశయమూ దూరమయాయి. అటువంటప్పుడు నేనెందుకోసం, ఎవరికోసం బతకాలి?” అని అడిగింది ఆమె.

శర్మగుండె మండింది.

“ఒ ఘంట క్రితం మీ రెవరో నాకు తెలియదు. కాని ఇపుడు నాకు మీకన్న తెలిసినవాళ్ళు లేరు. ఎవరికోసం జీవించాలి—అన్నారు. జీవితం జీవితంకోసమే. క్షణికమైన దుఃఖభారంతో మనస్సుని అనువసరిసిగా చేసుకోవడం సహజమే. కాని వివేకం కాదు. జీవితలతకు సదా ఆధారంగా ఏదో ఒకటి వుండి తీరాలి. ఒకవృత్తి, ఒకఆశ, ఒకస్మృతి...దేన్నో ఆధారంగా తీసుకుని హెచ్చుతగ్గులు లేని రీతిలో సాగిపోతుంటుంది జీవితం; సాగిపోవాలి జీవితం. నాకెవరూ లేరు. నాతో బాటు రండి మీ రేదయినా ఉద్యోగం సంపాదించవచ్చు. రండి. నన్ను నమ్మండి నా మాట కాదనకండి.” అన్నాడు శర్మ.

ఆమె హృదయం చిగుళ్ళు తొడిగింది.

* * *

రెండు నెలలు గడిచాయి

ఆమె అతడూ ఒకే ఇంట్లో వేర్వేరు వాటాల్లో వుంటున్నారు. దినపత్రిక విలేకరిగా తనకున్న పలుకుబడిని వినియోగించి ఆమెకు ఒక బళ్ళో ఉద్యోగం ఇప్పించగలిగాడు శర్మ.

మొదట్లో ఉమ కొంత బెరుకుగా దిగులుగా కన్పించేది. సంతోషంతో మాట్లాడుతూ మాట్లాడుతూ హఠాత్తుగా ఆగిపోయేది. ఆమెకళ్ళు కంటికందని దూరాలను చూచేవి, బడిలో అందరి పిల్లల్లో తన అబ్బాయి ఉన్నాడేమో, తనకోసం వెతుకుతున్నాడేమో...అన్న భ్రమ కలిగేది. శర్మ ఏదయినా చెబుతుంటే దీక్షతో వినడానికి మొదలిడేది. మధ్యలో మరి ఏమయ్యేదో...“ఏమండీ...నే చెబుతున్నది వినరేం?” అన్న మందలింపు! స్వరం వినపడేదాక మనసెగిరిపోయేది. కానీ, క్రమంగా ఆమె మామూలు వ్యక్తి అయింది. బళ్ళో ఆనందోత్సాహాలు వెల్లివిరిసే చిన్నపిల్లల మొహాలూ, క్రొత్తస్నేహాలూ, అన్నిటినీ మించి శర్మ ఆదరణా ఆమెలో జీవిత వాంఛను పునః ప్రతిష్ఠించాయి. సముద్రం ప్రక్కన శోకమే రూపంగా కన్పించిన ఉమలోని గంభీరమయిన ప్రశాంతతా, వ్యాకర్షణీయమయిన అమాయికతా, మల్లెపూలు మాటాడినట్టనిపించే ఆమెనవ్వూ ఇవన్నీ...శర్మ క్రమంగా తెలుసుకున్న గుణింతాలు. ఆమె నల్లగిలో ఒకతెగా ఉద్యోగం చేస్తూ జీవించడం శర్మకనిర్వచనీయమైన గర్వాన్నీ, సంతోషాన్ని కల్గించాయి. శర్మ ఆమెజీవితంలో తన జీవితానికి అర్థాలు వెతుక్కున్నాడు. అవి దొరికాయని మురిసిపోయాడు. శర్మయొక్క అపేక్ష, అధికారంతో కూడిన అనురాగమూ ఉమాదేవి మనసులోని అగాడి రూపం మీదను వింతకాంతులను వెదజల్లేవి. బడిలోని ప్రతిసంఘటనా, తను కలుసుకున్న ప్రతివ్యక్తి రూపగుణాలూ, ఒకపుడు తాను సరిగా ఇలాంటి పరిస్థితుల్లో నే ఏవిధంగా ప్రవర్తించిందీ...మొదలయిన విషయాలన్నీ శర్మకి ప్రతిరోజూ వల్లించేది ఉమ.

ఆమెను అతడు పూర్తిగా తెలుసుకున్నాడు. కనీసం తెలుసుకున్నాననుకున్నాడు.

—ఒకరోజు పొద్దున తొమ్మిదిగంటలయింది. అలవాటు ప్రకారం నిరాడంబరంగా తన తెల్ల చీరతో ఉమ బడికి బయలుదేరింది.

“శర్మా...బడికి వెళ్తున్నా.”

శర్మ మాట్లాడకుండా ఆవిడకేసి చూశాడు. ఆమె కళ్ళతో నవ్వింది. “చాల...బాగున్నారండీ!”

ఆమె మొహం గులాబీల గుత్తి అయింది...

“ఇదిగో శర్మా...నన్ను ‘అండీ’ అనవద్దు బాబూ అని మొత్తుకోలేదూ...”

“మరేమన మంటారండీ...?”

నిస్సహాయంగా నవ్వింది ఉమ. “చాల అల్లరి పిల్లాడివి శర్మా...రాబోయే ఆ అమ్మాయి నీతో ఎలా వేగుతుందో కాని...” అంటూ వెళ్లిపోయింది ఉమ.

ఆ రోజు సాయంత్రం ఉమ ఇంటికొచ్చేసరికి శర్మ తనగదిలో కుర్చీలో కూర్చుని రేడియో వింటున్నాడు చేతిలో సిగరెట్టు పొగలు కక్కుతూంది.

“ఆఫీసుకు వెళ్ళలేదూ?” అని అడిగింది ఉమ...గదినిండా పడివున్న సిగరెట్టు పీకల్ని కంటితో లెక్కపెడుతూ.

"ఊహు. తలనొప్పిగా వుంది."

"తలనొప్పా! రాదూ మరి.. ఇలా కూచుని వందలు వందలు సిగరెట్లు తగలెడితే తలనొప్పేమిటి... ఊపిరి తిత్తులు కాలిపోయి—"

"—నేను రైలింజన్ అయిపోతాను కదూ..." అని నవ్వాడు శర్మ చేతిలోని సిగరెట్టు పారేస్తూ...

"ఛీ ఛీ... అయినా నీలా జ్ఞానం వున్నవాడికి నేను చెప్పడమేమిటి? కాకపోతే శర్మా... అడిగే వాళ్లెంటూ లేరుకదా అని ఇలా డబ్బు పాడుచేసుకుని..." అని తీవ్రంగా మందలించబోయింది ఉష.

"ఇదిగో... ఇదిగో... అపుడే లెక్చర్ ఆరంభించారూ..." అని శర్మ ఎగతాళిగా వెదరించేసరికి ఉష నీరసంగా నవ్వింది.

"నీఇష్టం బాబూ! నీకెవరు చెప్పగలరు.. అయితే ఇపుడు అలా వెళ్ళొద్దాం వస్తావా?"

"ఎక్కడకి?"

"ఏదైనా సినిమాకి వెళ్దామా?"

"నేను రాను... మీరు వెళ్ళరండి..."

"నే నొక్కత్తెనా?... ఎపుడూ ఎక్కడికీ ఒంటరిగా వెళ్ళనుగా... ఆఖరికి హాస్టల్లోకయినా తోటి టీచర్లెవరయినా వస్తే తప్ప వెళ్ళను... నువ్వెందుకు గాని రా, శర్మా వెళదాం... అలా వెళ్ళితే నీ తలనొప్పి కాస్త తగ్గుతుంది... రా... బయలుదేరు. రావూ.." అని ఉష అడుగుతుంటే తన్ని తాను వేయెట్టి గుణించుకున్నా వద్దనలేననిపించింది శర్మకి.

"మీరు దారిలో నా సిగరెట్ల ఊసెత్తనని మాటిస్తే వస్తా." అంటూ బట్ట వేసుకోవడానికి ఉపక్రమించాడు.

బయలుదేరబోతూ హఠాత్తుగా ఒక్కక్షణం ఆగాడు శర్మ. ఆ ఒక్కక్షణంలోకి గతంలోని కొన్ని సంవత్సరాల సంఘటనలు కుదించబడ్డాయి.

—ఒకానొకప్పుడు... శర్మ—అమ్మా నాన్నా లేక వాళ్ళ మామయ్య ఇంట్లో పెరుగుతున్న ఓ అమ్మాయిని తన సహధర్మిణిగా ఎన్నుకున్నాడు. ముహూర్తం వారంరోజు లుందనగా, 'సంఘం'లోని 'నాయకు'లయిన సోదరసోదరీమణుల నాలుకలు పాలవంటి మనసూ, నిప్పువంటి శీలమూ కల్గిన ఆ అమ్మాయి మనస్థైర్యానికీ, జీవితానికి మంగళం పాడాయి. వాళ్ళు అనాయాసంగా ఆపాదించిన నింద నిరాధారమని రుజువుపరచడానికి తన నిష్క్రమణే మార్గమని నమ్మిందా అమ్మాయి. శర్మ ఆ వూరు చేరేసరికి అవనిక జారిపోయివుంది. మూడునెలలపాటు శర్మ ఇవాళ వున్నచోట రేపుండక తిరిగాడు. హస్తులూ మళ్ళ కాలూ భుజాలు రాసుకుతిరిగే హస్తినాపురంలోని ఇనపస్తంభానికీ, ఆగ్రాలోని 'గడ్డకట్టిన వెన్నెల'యిన తాజమహలుకూ, అలలు ప్రజలుగా ఘోషించే నానా జాతినగరం బొంబాయికి, రా రమ్మని చేతులు జాచిన అజంతా కుడ్యచిత్రాలకూ, 'నేనే ఒకపుడు భీష్మాచార్యుల్ని సుమా' అంటున్న అడయారులోని మర్రిచెట్టుకూ, రాళ్ళూ రప్పలూ ప్రాణం పోసుకుని పలకరించే మహాబలిపురానికీ, జీవాత్మ పరమాత్మల అవినాభావసంబంధానికి తార్కాణంగా ఆకాశానంటుతున్న తంజావూరు బృహదీశ్వరాలయగోపురానికీ, ముగ్గురు సాగర రాజకుమారులలో ఎవరి నెన్నుకోవాలో తెలియక తికమకలాడుతున్న కన్యాకుమారికీ తనబాధను పంచిపెట్టాడు—మూడు నెలల సెలవుతర్వాత ఉద్యోగంలో చేరిన శర్మ మస్తిష్కంలో సంఘపు కొలతలకి విలువలు విప్లవకరంగా మారిపోయాయి.

"—ఈ నాడు కేవలం తోటిమనిషిగా నమ్మి, అనురాగంతో తన్ను సినిమాకు రమ్మని పిలుస్తున్న ఈమె సంఘం దృష్టిలో ఎంత అనైతికమయిన పని చేస్తున్నదో..?"

శర్మ నిర్వికారంగా నవ్వాడు.

"ఏం శర్మా... నవ్వుతున్నావేం...?"

"అబ్బే... ఊరికే..."

"అదేమిటో బాబూ, నీ మాటలు నవ్వులూ నీకే అర్థంకావాలి. సరే రోజులు గడిచినకొద్దీ కొత్తవాడివయిపోతున్నట్లుంది." అంది ఉష.

సినిమా థియేటరులో ఇద్దరూ పక్కపక్కన కూచున్నారు. నవ్వుతున్నపుడు రెండుమూడు సార్లు ఆమెభుజం శర్మభుజానికి తగిలింది. మసకవెల్తురులో శర్మ ఆమె మొహం పరికించాడు... ఆమె చూపులు తెర మీద వున్నాయి.

రాత్రి తొమ్మిదిన్నరకి సినిమా ముగిసింది. ఇద్దరూ బయటికి వచ్చారు. వర్షం ప్రారంభమయింది. ఉన్న రెండుబస్సుల్లోనూ ఖాళీ లేకపోయింది.

"ఆటోరిక్షాలో వెళదాం." అన్నాడు శర్మ.

"ఈ వర్షంలో ఒక 'ఆటో' దొరకడమే దుర్లభం. ఇపుడు మనకి రెండెక్కడ దొరుకుతాయీ?"

"రెండెందుకూ...?"

ఉషాదేవి కళ్ళల్లోకి చూశాడు. అతడి భావాల ప్రతిబింబాలు అందు కన్పించలేదు. కొన్ని ఘంటలసేపుగా శర్మ తాను రెండుసార్లు ఓడిపోయా ననుకున్నాడు.

సిగరెట్ ప్యాకెట్ ఒకటి కొనుక్కుని శర్మ ఆటోరిక్షాకి ఉష ప్రక్కన కూచున్నాడు. ఉష డ్రైవరుకు అడ్రసు చెప్పింది. దారిపొడుగునా ఇద్దరూ మాట్లాడుకోలేదు. "యినా వీళ్ళేం భార్యాభర్తలూ!" అనుకున్నాడు ఆటోరిక్షావాలా.

ఇరవై నిమిషాల తర్వాత ఆటోరిక్షా, వాళ్ళింటి ముందు ఆగింది. ఆటోరిక్షాను పంపేసి శర్మ ఆఖరి సిగరెట్టు ముట్టించాడు.

—శర్మ బట్టలు మార్చుకున్నాడు. హోటలుకు బయలుదేరుతూండగా ఉష అడ్డొచ్చి "రాత్రి ఈ వేళకి భోజనం వుంటుందని?" అంది.

"లేకపోతే చపాతీలున్నాయిగా?"

"ఏం అక్కర్లేదు. నేను అన్నం వండానుగా... ఆ ఉన్నదాన్ని చెరిసగం తిందాం రా..." అంది ఉష.

"ఊహు" అని వెళ్ళిపోయాడు శర్మ.

టిఫిన్ తిన్నాడు... సిగరెట్టు వెలిగించి ఇంటివైపు నడవసాగాడు.

తనమీద తానే ప్రశ్నపత్రం ప్రయోగించుకుంటే కనీసపు ప్యాసుమార్కులయినా రాలేదు. శర్మ తిన్నగా మరో మిత్రుని గదికి వెళ్ళి అక్కడే గడిపాడు ఆ రాత్రి.

మరునాటిరోజు పొద్దున ఇంటికొచ్చేసరికి ఉషగదికి తాళం వేసివుంది. ఆఫీసుకి వెళ్తూవెళ్తూ ఉష బడివైపు వెళ్లాడు. ఉష ఎవరితోనో మాట్లాడుతూ వుంది. ఆ ప్రక్కనే హెడ్ మిస్ట్రెస్ కూడా వుంది.

"ఏం శర్మా, రాత్రి ఏమయిపోయావ్? నీ కోసం పొద్దున ఎనిమిద్దాకా చూసిచూసి వచ్చేశాను. ఇవాళ బళ్ళో ఇన్స్పెక్షనుందీ... అందుకని త్వరగా రావాలని వచ్చింది. ఇదుగో డి. ఇ. ఓ. సచ్చిదానందరావు... ఇతడు మా శర్మగారండీ," అని పరిచయం చేసింది. మగాళ్ళిద్దరూ హాల్లో- అని పలకరించుకున్నారు. హెడ్ మిస్ట్రెస్ తో శర్మకు పరిచితే. రెండు నిముషాలు ఏవేవో మాట్లాడిన తర్వాత శర్మ వెళిపోయాడు.

ఆ రోజు ఆఫీసు అయిపోగానే శర్మ ఇంటికొచ్చాడు... ఉష అతణ్ణి పలకరించింది.

"పొద్దున ఇన్స్పెక్షన్ వుందని నిన్న నాతో చెప్పలేదేం?" అని అడిగాడు శర్మ.

"గుర్తులేదు శర్మా!" అంది ఉష యథాలాపంగా.

"పోనీ వెళ్తూ వెళ్తూ ఓ కాగితంముక్క రాసి తలుపు గొళ్లానికి చెక్కి వెళ్ళకూడదూ?"

"అవునవును... నీవుమాత్రం అన్నం తినకుంటే తినకుండా ఎక్కడో ఏదో చెత్తతిని రాత్రంతా దేశాలు తిరిగొచ్చావ్... నేనేమో ఒకగంటముందు వెళితే చీటీ రాసి వెళ్ళాలి కదూ..." అని గలగలా నక్షత్రాలు గిలిగిల్లా నవ్వింది.

శర్మా నవ్వేశాడు. నవ్వుతూ నవ్వుతూ గభుక్కున ఆగాడు. ఉష అతడివైపు చూచింది..... ప్రశాంతంగా—

ఒకరోజు పనుండి ఏడింటికల్లా ఆఫీసు కెళ్ళిపోయాడు శర్మ. తొమ్మిదింటికి ఫోనుమీద అతన్ని ఎవరో పిలిచారు! "మీ ఉషగారు హఠాత్తుగా క్రిందపడిపోయారు త్వరగా రండి" అన్నదొక గొంతు...

పరుగెత్తుకొచ్చాడు శర్మ. ఇంటిలోంచి బయటికి వస్తున్న డాక్టర్ ఎదురయ్యాడు... "ఉషగారి 'హజ్బెండ్'—మీరేనా?"

"ఔను... ఆమె ఏమయింది?"

"అబ్బే ఏమీ కాలేదు..." ఎక్సెస్ లాస్ ఆఫ్ బ్లడ్ వల్ల 'అనీమియా'నూ తద్వారా 'కంప్లీట్ డెబిలిటీ'నూ. మరి వారంరోజుల్లో—'షి విల్ బి ఆల్ రైట్'" అన్నాడు డాక్టర్.

"ప్రాణభయం ఏమయినా..."

"అబ్బే అటువంటిదేమీ లేదు... ఆవిడకు పళ్ళరసం, హార్లిక్స్ నేను వ్రాసిచ్చిన టానిక్... అన్నిటికన్న విశ్రాంతి... ఇవ్వండి. 'అర్జెన్సీ' ఫీలయితే నన్ను పిలవండి"—అని వెళిపోయాడు.

శర్మ ఉషగదిలో కెళ్ళాడు. అతణ్ణిచూసి అంతవరకూ ఉషను చూచుకున్న ప్రక్కింటావిడ... "ఇదుగో నాయనా... ఇప్పుడే కొంచెం కళ్ళు తెరిచి చూచింది. డాక్టరుగారు ఇంజక్షన్ ఇచ్చి టానిక్ రాసిచ్చి వెళ్ళారు..." అని చెప్పి వెళిపోయింది.

బలహీనంగా, కళ్ళు మూసుకుని, చిరుచెమటకు తడిసిన మొహంమీద నల్లటి వెంట్రుకలు ఆడుతుండగా రెండుచేతుల్నీ రొమ్ముమీద ఆనించుకుని మగతగా మంచంమీద పడుకుని వున్న ఉషను శర్మ చూశాడు.

ఐదునిముషాలు గడిచాయి.

దగ్గరకెళ్లి మంచప్రక్కన మోకాళ్ళమీద కూర్చున్నాడు. నెమ్మదిగా ఆమె తలవెంట్రుకల్ని దువ్వుతూ... "ఎలా వుందండీ?" అన్నాడు.

కళ్లు తెరచి చూసింది ఉష. ఆమె కళ్లలోకి చూశాడు శర్మ "ఎందుకొచ్చావ్ శర్మా... ఆఫీసు లేదూ?" అంది ఉష బలహీనంగా, చిరునవ్వుతో.

"మీ కిలా వుందని ఫోన్ వస్తే..."

"హు... ఇందుకు నువ్వు ఆఫీసొదలి రావడమా-? పిచ్చివాడివి. నాకేమీ ఫరవాలేదు..." అంది ఉష అతడి చేతిని తన చేతిలోకి తీసుకుని నిమురుతూ... ఆక్షణాన పాపాయిగా మారిపోయి ఆ అనురాగపు వెచ్చదనంలో ఇమిడిపోవాలనుకున్నాడు శర్మ.

శర్మ ఏమీ మాట్లాడకుండా తనవైపే చూస్తుండ డం గమనించిన ఉష గోడవైపు చూస్తూ... "నిజం గా నే నాకేమీ లేదు శర్మా" అంది.

శర్మ గభుక్కున లేచి నిల్చున్నాడు. "మీ కేమీ లేకపోతూ నాపరే—ఉన్నా సరే, ఈ వారం రోజులూ మీరు కదలడానికి వీల్లేదు. పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి."

"బడి కెళ్లొద్దూ?"

"బడికి సెలవు పెట్టి వేయండి. నేను హెడ్ మిస్ట్రెస్‌తో మాట్లాడుతాను."

"ఎందుకూ అనవసరంగా సెలవు పెట్టడం?"

"అనవసరం అన్నది మీ కక్కర్లేదు. నోర్మూసుకుని నే చెప్పినట్లు వినండి. తెలిసిందా? స్నానం వగైరా చేయకండి. ఇటూ అటూ తిరక్కండి. పండ్లూ, పాలూ, టానిక్కూ పుచ్చుకోండి..." అని శర్మ ఉత్తర్వులు జారీచేసి పారేస్తూంటే, ప్రతిఘటించే ఓపిక లేక ఉష ఒక కొత్తనవ్వు నవ్వింది.

ఆ రోజు సాయంకాలం అయ్యగారు పంపారంటూ ఒక మనిషి ప్రత్యక్షమయింది రాత్రి ఉష ప్రక్కన టేబిలుమీదికి ఆపిలుపళ్ళూ, బత్తాయిపళ్ళూ, హార్లిక్సూ, ఓవల్టీనూ, టానిక్కు సీసా వగైరాలు తయారయాయి.

"నాకోసమని ఇలా డబ్బు ఖర్చు పెడుతున్నావా అ డ్రాయిర్ లో నా పర్సుంది... తీసుకుని—"

"స్... నోరుమూసుకుని పడుకోండి," అన్నాడు హార్లిక్స్ కలుపుతున్న శర్మ.

ఆమెకు హార్లిక్స్ ఇచ్చాడు "నా కెందుకు ఈ సేవింతకీ?" అంది ఉష.

శర్మ మొహం చూచి... "అబ్బే అది కాదు శర్మా... నీవూ ఓగ్లాసు కలుపుకోకూడదూ?" అంది.

"నాకేమీ 'అనీమియా' రాలేదు." అంటూ శర్మ తనగదిలోకి వెళ్లి పోయాడు.

"మరీ ఇలా తయారవుతున్నావేం—" అనుకుంది ఉష.

వారంరోజుల తర్వాత ఉషాదేవి పూర్తిగా తేరుకుంది. మామూలుగా బడికి వెళ్లడం మొదలిడింది. శర్మ రొమ్మువిరుచుకు తిరగసాగాడు. ఓ వారంరోజులపాటు రోజూ—బీచికి తీసుకెళ్లి ఆమెకు అవీ ఇవీ కథలూ కబుర్లూ చెప్పేవాడు. ఒకరోజు తన ఆఫీసుకు తీసి కెళ్లాడు. తన స్థలమూ, అవీ చూపించాడు ప్రెస్సు ఎలా పనిచేస్తూందీ అనీ వివరించి చెప్పాడు. ఉష జీవితంలో ప్రతి రోజూ ఒక మైలురాయిగా నిలిచిపోసాగాడు.

ఆఫీసులో అసిస్టెంటు ఎడిటర్ నరసింహారావు గారు ఎప్పుడూ శర్మంటే చనువుగా వుండేవాడు. ఒకరోజు ఆయన ఇలా అడిగారు. "ఏం శర్మా పెళ్ళెప్పుడూ?"

శర్మ నవ్వి ఊరుకున్నాడు.

"అదిగో దబ్బాయ్... నీవు 'ఊ' అంటే పెద్దాపురంలో..."

"అబ్బెబ్బె-ఇంకా ఆ మాటే అనుకోలేదండీ."

"మరయితే శర్మా! ఒకట గుతా గాని—ఏమీ అనుకోవు గదా?"

శర్మ కనుబొమలు చిట్లించి చూశాడు.

"నీవు ఎవరితోనో వుంటున్నావుట గా?"

శర్మకి కోపం వచ్చింది. అసిస్టెంట్ ఎడిటర్ మీద కాదు, 'వీర'ని చూపలేని వారిమీద. కాని మహాశాంతంగా "కానీండి" అన్నాడు.

"ఆ అమ్మాయి మనవాళ్ళ దేనా?"

"తెలీదండి."

"ఆ అమ్మాయీ నీవూ..."

" ఒకే ఆటోరిక్షాలో కూచుంటాం. సినిమాల కెళతాం. బీచి ఒడ్డున కూచుంటూ... కబుర్లు చెప్పుకుంటాం... నవ్వుకుంటాం."

"అది కాదు శర్మా—"

"నరసింహారావుగారూ నేను ఎవరికీ సంజాయిషీ చెప్పాల్సిన అవసరం లేదు. కాని తండ్రివంటివారు గనుక మీతో చెబుతున్నా. ఆమె నాతో కలిసి మెలిసి వుంటుంది. అంతే. మీరు నమ్మినా నమ్మకపోయినా యదార్థం అదీ. మీరనుకుంటున్న అవసరమే వచ్చి ఇద్దరమూ పెళ్ళాడదలచుకుంటే— మీరూ, మీ సంఘమూ కలిసి చేయగలిగేదేమీ లేదని తెలుసుకోండి—" అని శర్మ చరచర లేచి వెళ్ళాడు.

బీచిలో ఇసుకతిప్పమీద పొర్లాడినంతసేపూ ఉత్తర. దక్షిణ ధ్రువాల్లాటి ఆలోచన లతనిలో ఘర్షిం

చాయి. కాఫీపు, తను నరసింహారావుగారి వద్ద గుమాస్తాగా ప్రవర్తించాడేమో అని బాధపడ్డాడు. ప్రొహిబిషన్ తెలుసుకున్నాడు. మూడో నిముషం... మరో ఆలోచన రాబోతుంటే బ్రహ్మప్రయత్నంతో మెదడుని శూన్యం చేసుకున్నాడు.

—ఒకరోజు—ఎవరో మంత్రిని ఇంటర్వ్యూ చేయాలని శర్మ పొద్దునే వెళిపోయాడు. ఆ పని పూర్తి చేసుకొని వెనక్కి తిరిగేసరికి ఒంటిగంట అయింది. ఏదయినా తిందామని దారిలో వున్న 'కైలాస్' కేఫ్‌లో దూరాడు శర్మ.

చెమటని రుమాలుతో తుడుచుకుంటూ ఒక కుర్చీలో కూలబడ్డాడు. సర్వీస్ కోసం చూస్తూంటేగా హఠాత్తుగా ఉమాదేవి అతనికి కంటబడింది!

ఓ మూల టేబిలదగ్గర కూచుని ఏదో తింటూంది. శర్మ ఆశ్చర్యంతో నిండిపోయాడు. ఆమె బడికీ ఇక్కడికీ మైలు దూరముంది. "ఇటీవలే జబ్బుపడి లేచింది కదా. ఈ యెండలో ఇంతదూరం ఎందుకొచ్చిందీ బుద్ధిలేని మనిషి—" అనుకున్నాడు శర్మ.

అతడి దృష్టి కాస్త జరిగింది. ఉమకి ఎదుట నోటితో ఆరంజి క్రష్, కళ్ళతో ఆమెనూ తాగుతున్న డి. ఇ. ఓ సచ్చిదానందరావ్ కన్పించాడు.

శర్మ హోటలునుండి బయటికొచ్చేశాడు—"ఏంకావాలన్నా అంటుంటే పక్కుండా లేచి పోతాడేం—ఈ మానవుడు! అయినా ఈ మహాపట్నం. ఇది వింత ప్రకృతి—" అనుకున్నాడు సర్వాగ్.

శర్మ ఇంటికెళ్ళి పడుకున్నాడు. పడుకోలేక పోయాడు. బీచికి వెళ్ళి జనసంచారం లేనిచోట కూచున్నాడు. అలలహోరులో జనఘోష కొంతకలిసిపోయినట్లనిపించింది. దీపాలు పెట్టే వేళకు ఇల్లు చేరుకున్నాడు.

గుమ్మంలోనే ఉమ చిరునవ్వుతో పలకరించింది: "ఎలా వున్నావేం?"

"ఎలా వున్నానూ?"

"పరీక్షలో ఫెయిలయిన అబ్బాయిలా!"

"నేను ఫెయిలయింది—పరీక్షలో కాదు" అని ఆమెను దాటి వెళ్ళిపోయాడు శర్మ. గదిలో పడకకుర్చీ మీద కళ్ళుమూసుకుని పడుకున్నాడు.

కాసేపటికి చేతిలో గులాబ్ జాములున్న ప్లేటుతో వచ్చింది ఉమ.

"ఇవి తిను శర్మా!"

శర్మ కళ్ళు తెరచి చూశాడు.

"ఇవాళ మా హెడ్ మిస్ట్రెస్ గారి అమ్మాయి పుట్టినరోజట. అందుకని నన్ను ఇంటికి తీసుకెళ్ళి ఇవన్నీ పెట్టి పంపింది. నేనంటే ఆమెకు ఎంత ఇష్టమని!" అంది ఉమ.

"మీరంటే చాలమందికి ఇష్టం" అన్నాడు కాని అతడనుకున్నట్లు తగలలేదు బాణం.

"అందులో మా శర్మాజీ మొదటివాడు."

"మొ...ద...టి...వా...డు" అని గొణుక్కున్నాడు శర్మ.

"ఏమిటది?"

"అబ్బే ఏమీ లేదు."

"ఇవి తిను"

"మీరు తినకూడదూ?"

"నేను తిన్నాను. నాకాకలి లేదు."

"నాకూ లేదు."

"అయితే తినవా మరి?"

"పోనీలే! రేపొద్దున్న ఆఫీసుకెళ్ళేముందు..."

"ఉహూ వీటిని నేనిప్పుడూ తినను."

"ఏం!"

"నాకు గులాబ్ జాములు సహించవు—మీరు వెళ్ళి పడుకోండి."

ఆ అబద్ధం ఉమకి లెంపకాయిలా తగిలింది. ఆమె అక్కడినుంచి వెళ్ళిపోయింది. ఆ రాత్రి ఆమె దిండు తప్పతడిసింది.

శర్మ ఏడవ్వాలనుకున్నాడు కాని ఏడ్వరాలేదు.

—జనవరి వచ్చింది. బళ్ళు మూసేయడానికి ఇంకా రెండుమాసాలే వున్నాయి.

ఒకరోజు సాయంకాలం ఉమ—"శర్మా నీవు రేపూ ఎల్లుండీ సెలవు పెడతావూ?" అంది అతడి ప్రక్కన కుర్చీలో కూర్చుంటూ.

"ఎందుకూ?"

"బళ్ళో టీచర్లమందరమూ తిరుపతికి పిక్‌నిక్ వెడుతున్నాం. నీవు రావాలని..."

"మీ పంతులమ్మలతో నేనేం చేస్తానూ?" అన్నాడు శర్మ నవ్వుతూ.

"నాతో బాటు రావుగారొస్తున్నారుగా. ఆయనతో బాటు నువ్వూను—"

"రావుగారా?"

"ఆయనే... డి. ఇ. ఓ. సచ్చిదానందరావు గారు..."

"ఆయన మీతో రావడం మెందుకూ?" శర్మ స్వరంలోని మార్పు ఉమ గుర్తించలేదు.

"ఈ పిక్‌నిక్ ఏర్పాటు చేసింది ఆయనే, రేపు పొద్దునే ఆయనే రెండు కార్లు తీసుకొస్తారు."

"ఓహో—'

"అందుచేత నీవు వస్తే—ఎంతో"

"నేను రాను. మీరు వెళ్ళిరండి."

"ఏం?"

"ఇంకో ముఖ్యమయిన పనుంది."

"ఆ పని రెండురోజులు ఆగ లేదూ?"

"అబ్బే—వీల్లేదు. రేపు నేనిక్కడ వుండితీరాలి."

"నీవూ వస్తే సరదాగా—"

'నేను రాకపోతేమాత్రం ఏం, సరదాగా వుండలేరూ—?'

"శర్మా...అలా మాట్లాడుతున్నావేం?" అని అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది ఉష

ఆమె వెళ్ళాక కాసేపు చూచి, లేచి నిల్చున్నాడు శర్మ. చేతిలో ఇంకా ఆయిర్దాయమున్న సిగరెట్టుని క్రిందపడేసి పాదంతో బలంగా రాచాడు. 'చుర్'మంది. కాని శర్మకు ఫీలింగ్ తట్టలేదు!

మూడోరోజు మధ్యాహ్నం ఉషాదేవి తిరుపతి నుంచి వచ్చింది. శర్మ మామూలుగా ప్రవర్తించడం చూచి సంతోషపడింది. ఒకవారం తర్వాత ఓ సాయంకాలం ఉష శర్మచేతికో పెద్ద ఫోటోనిచ్చింది

"ఇదిగో—ఆ మూల నిల్చున్నదే ప్రక్కవీధిలో వుంటుందని చెప్పానే శారద—ఇటు ప్రక్క విజయలక్ష్మి. ఎం. ఏ. బి. టి. సరే ఈయన్ని నీవెరుగుదువుగా. డి. ఇ. ఓ. రావుగారు. ఆయనప్రక్కనే నేను. అవతలేమో హెడ్ మిస్ట్రెస్. ఈ మూల మా సంగీతం టీచరు మంగళాదేవి..."

శర్మ గభుక్కున ఫోటోను ఆమెచేతికిచ్చేశాడు. "చాలా బావుంది" అన్నాడు.

"నిజంగానా—" అని అడిగింది ఉష.

"అవును."

"నేనెలా వున్నాను?"

"ఎప్పటికన్నా ఇంకా చక్కగా వున్నారు."

"ఫో శర్మా! ఎప్పుడూ ఎగతాళే—" అని ఉష గలగలా నవ్వింది.

మొట్టమొదటిసారిగా శర్మ ఆమె నవ్వుని ఆనందించలేకపోయాడు.

—రిపబ్లిక్ డేకు ముందురోజు.

"శర్మా! రేపు ప్రొద్దున పెరేడ్ కి వెళదామా" అన్నది ఉష.

"పెరేడ్లంటే విసుగెత్తింది. అయినా ఆ ఎండలో ఎవరు మాడుతారు?"

"మాడ్డం దేనికి? 'స్పెషల్ ఎన్క్లోజర్'లో కూచుందాం." అంది ఉష.

"మనమేం మంత్రులమా లేక నాయకమ్మన్యుల మానసపుత్రులమా?"

"ఆ రెండూ కాము ... అయినా మనకోసం మూడుసీట్లు సిద్ధంగా వుంటాయక్కడ." అంది గర్వంతో చిరునవ్వుతో—ఉష.

"ముగ్గురెవరూ?"

"నీవూ. నేనూ, రావుగారూ—"

"రా-వు-గా-రా?"

"అవును— ఆయనే. పొద్దున కారు తెస్తానని, నన్ను రమ్మనీ అన్నారు. నీవు వస్తావని చెప్పాను."

"ఆయన భార్యా బిడ్డల్ని తీసుకెళ్ళడేమిటి?"

"ఆయన భార్య చనిపోయి ఏడాదయిందట." కొడుకు కోడైకెనాల్ లో చదువుతున్నాట్ట. అయినా ఆ గొడవంతా ఎందుగ్గానీ. నీవు ఆరింటికి లేవాలి రేపొద్దున."

"ఊహు...నేను రాలేను. నేను 'ఫోర్ట్'కు వెళ్ళాలి పొద్దున్నే."

"అవునవును. నేనెప్పుడు పిలిచినా నీకేదో అడ్డం వస్తుంటుంది." అంది ఉష మొహం ముడుచుకుంటూ.

"మీరు వెళ్ళిరండి—హాయిగా."

"హా...యి...గా...హుం" అని ఉష తన గదిలోకి వెళ్ళిపోయింది.

శర్మ బయటికెళ్ళి వచ్చాడు. భోజనం చేయకుండానే పడుకున్నాడు. పన్నెండయినా అతనికి నిద్రపట్టలేదు. ఉష గదిలోనుంచి వెక్కిళ్ళ శబ్దం వినిపించింది. కొన్ని యుగాలసేపు అని మనసా మళ్ళీ శబ్దం శర్మ చెవుల కందలేదు. తటాలున శర్మ లేచి కూచున్నాడు. స్విచ్ నొక్కాడు. తన గది బయట కడుగు వేశాడు. హఠాత్తుగా వెనక్కు తిరిగి లోపలి కొచ్చి పక్క మీదికి వాలిపోయాడు. బాగా నిద్రపట్టింది. తెల్లవారు ఝామున నాల్గింటికి ఉష తన గది బయటి కొచ్చింది. శర్మ గదిలో లైటు వెల్గుతుండటం చూచింది. తిన్నగా అతని గదిలో కొచ్చి లైటార్పేసి తన గదిలోకి వెళ్ళిపోయింది.

పొద్దున ఏడింటికి శర్మకు మెలకువ వచ్చింది. ఉష తన గదిలోనే వుండటం గ్రహించాడు. తానూ గదిలోనుంచి బయటకు రాలేదు.

కాస్సేపటికి ఇంటిముందు కారాగిన చప్పుడయింది బూట్లశబ్దం లోపలికి వచ్చింది.

"ఉషా దేవి!"

"ఓ! రావుగారా...రండి..."

"ఇంకా డ్రెస్ చేసుకోలేదే?"

"తల నొప్పిగా వుందండీ—"

"అరెరె..."

"ఇవాళ్టికి మీరు క్షమించాలి. పెరేడుకు నేను రాలేను."

"అబ్బే, ఏమీ పరవాలేదు. నెవర్ మైండ్... పోనీ అలా కారులో అడయారు దాక వెళ్ళొద్దాం... కాస్త చల్లగాలి తగిలితే మీ తలనొప్పి తగ్గుతుందేమో"

"అబ్బే... అక్కర్లేదండీ... దానంతట అదే—"

"మైగాడ్! మీ కళ్ళు ఎర్రగా వున్నాయే—"

"ఏమీ లేదండీ... ఏదో కాస్త..." అని అనునయంగా సమాధానమిస్తున్న ఉష స్వరం శర్మని తేలులా కుట్టింది. శర్మ లేచి తొందర తొందరగా మొహం కడుక్కుని బట్టలు తొడుక్కుని బయటికి వెళిపోయాడు—ఉష గదివేపయినా చూడకుండా. ఆగదిలో రావూ, ఉషా మాట్లాడుకుంటూనే వున్నారు

ఆ రోజు మధ్యాహ్నం మూడింటికి శర్మ ఇంటికి వచ్చాడు. ఉష గదికి తాళం వేసి వుంది. తన గదిలో కెళ్ళి పుస్తకాలూ, ఫోటోలూ, బట్టలూ రెండు పెట్టెల్లోకి సర్దేశాడు. కుర్చీలు రెండింటినీ మడిచి కట్టాడు. రేడియోను అట్టపెట్టెలో వుంచాడు. ఇంతలో ఉష వచ్చింది.

"పొద్దున ఎక్కడి కెళ్ళావ్ శర్మా?"

ఆ ప్రశ్నే ఉష నడుగుదామని ఊర్కుండిపోయాడు శర్మ.

"బయట టాక్సీ వుంది...ఎవరొచ్చారు శర్మా?"

"ఎవరూ రాలేదు ... కాస్త దారి తీస్తారా?" అని శర్మ రెండు చేతుల్లోనూ పెట్టెలతో బయలుదేరాడు.

వేయి పిడుగుల కింద నలిగిపోయింది ఉష. "ఎక్కడికి శర్మా—?" పెట్టెల్నీ, మడత కుర్చీలనూ కారు వెనకాల వుంచేసి, రేడియోనూ, పెట్టెను కారు వెనక సీటు మీద వుంచాడు శర్మ. టాక్సీలో ఒక కాలుంచి వెనక్కి తిరిగి చూశాడు. గుమ్మంలో ఉష నిలబడివుంది

శర్మ మొహాన్ని మరో వైపుకు తిప్పుకుని— "నేను టి. నగర్ లో మరో ఫ్రెండ్ తో బాటు వుండబోతున్నాను. మీరు జాగ్రత్తగా ... సుఖంగా వుండండి..." అన్నాడు.

"మం-చి-ది." అనగల్గింది ఉష.

ఇంకా ఆమె ఏం చెబుతుందోనని ఎదురుచూచిన శర్మ దాదాపు నిముషం తర్వాత వెనక్కి తిరిగిచూస్తే గుమ్మంలో ఉష లేదు.

టాక్సీ బయలు దేరింది.

ఉష మూడురోజుల దాక బయటికి రాలేదు.

ఆరు వారాల తర్వాత శర్మ చైనాబజారులో బనియన్లు కొంటున్నాడు.

"అదెల్లాం ఇల్లెసామి-ఒరేటి ఒణ్ణె కొల్లుబా"

"ఒరు రూబాదాం తరవేం..." అంటున్నాడు

"శర్మా!"— ఉష కన్పించింది! ఎవరో అపరిచిత వ్యక్తిని చూసినట్లు చూశాడు ఒక్క క్షణం.

"కులాసాగా వున్నారా? వస్తా. పనుంది—" అని బనియన్లు కొనటం మానేసి అడుగు ముందుకు వేశాడు శర్మ.

ఉష నవ్వింది; మునుపటి కాదు. "శర్మా వెళ్ళిపోతున్నావా?—పోగవుగనిలే..." అని ఆమె ప్రక్కకు చేరేసరికి అతడు వేగంగా నడవసాగాడు.

ఆమె అతడితో బాటు నడవడానికి ప్రయత్నిస్తూ "శర్మా... స్నేహాన్ని చంపడంకంటే మనసుని చంపడం క్రూరం కదూ?" అంది.

శర్మ తన వేగాన్ని హెచ్చిస్తూ..."క్షమించండి ...నాకేమీ తెలియదు..."

"తెలియనిది నీకొక్కడికే; నాకు ...శర్మా... నీ ఇష్టమే నా—"—ఆ రద్దీలో ఉష పాదాన్ని ఒక బూటు తొక్కింది...'అమ్మా' అని కేక పెట్టిన ఉష ప్రక్కకు చూసేసరికి శర్మలాంటి తలకాయలు వందలూ, వేలూ కన్పించాయి

"హుం" అనుకున్న అప్పటి ఉషకూ—మొట్టమొదట బీచ్‌లో శర్మ చూసిన ఉషకూ, చాల కొద్ది తేడామాత్రమే వుంది.

పదిరోజు లయింది.

శర్మ ఆఫీసుముందొక కారు ఆగింది. ఉషాదేవి దిగింది. ఆమె వెనకాలే పచ్చిపానంరావు దిగాడు.

"త్వరగా రా ఉషా" అన్నాడతడు—ఆమె చేతిలోని గులాబీని తీసుకొంటూ.

పదినిముషాల తర్వాత ఉష ఆఫీసునుంచి బయటికి వచ్చింది. ఆమె మొహం పాలిపోయినట్లుంది. కారు పక్కన నిల్చున్నరావు చేతిలోని గులాబిని పారేసి, "ఇన్విటేషన్ ఇచ్చావా డియర్?" అంటూ ఆమెను చేత్తో పట్టుకుని కారులో ముందు సీటులో కూచోబెట్టాడు.

"లేదు ఇవ్వలేదు. తానింక ఈ ఉద్యోగం చేయదలచుకోలేదంటూ రెసిగ్నేషన్ లెటర్ పంపాట్ట— అక్కడెక్కడో, జబల్ పూర్ నుంచి!" అంది కారులో కూచున్న ఉష. ఆమె ప్రక్కన కూచున్నాడు రావు.

"నేను చెప్పలేదూ వాడుత్త సెంటిమెంటల్ ఫూ. నీ—" అన్నాడు రావు కారు తిప్పుతూ.

"హుం..." అని నవ్వింది ఉష.

కారు ఒక్క ఊపుతో బయలుదేరింది.

రావుగారి చేతుల్లో ఒకటి స్టీరింగుమీదా, మరొకటి ఉషాదేవి భుజంమీదా వున్నాయి.

రోడ్డుమీది గులాబీపూవు కారుచక్రం క్రింద నలిగింది.

# కాళిదాస కవి: తత్త్వవిజ్ఞాన వైభవము

శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి

కాళిదాసు మహాకవి కవితావాహినిలో నైహికవిషయములతో బాటు ఆముష్మిక విషయజ్ఞానవాహిని యంతర్వాహినియై ప్రవహించుచున్న రీతిని యీ క్రింది యుదాహరణములు మనకు స్పష్టము చేయగలవు. రఘువంశకావ్యములో రఘుమహారాజు గురుదక్షిణార్థియై తనవద్దకువచ్చిన వరతంతుని శిష్యునితో జెప్పిన మాటలే యీ క్రింది శ్లోకములోని ముఖ్యార్థము.

"గుర్వర్థ మర్థీ శ్రుతపారదృశ్వా
రఘోః సకాశా దనవాప్య కామం,
గతో వదాన్యాంతర మిత్యయం మే
మాభూ త్పరీవాద నవావతారః" (5-24)

ముఖ్యార్థంలో దీని తాత్పర్యమిది: "(శ్రుతపారదృశ్వా) శాస్త్రపారంగతుడగు నొకడు (గుర్వర్థం = గురవే + అర్థం) తనగురువునకై దక్షిణగా నివ్వతగినధనము గోరి రఘుమహారాజువద్దకు వచ్చి, ఆ రాజునుండి యతడు తన కోరికను బడయజాలక మరియొక దాతకడకు వెళ్ళినాడు- అనెడు క్రొత్త అపవాద(మే) రఘుమహారాజునైన నాకు లేకుండుగాక" అని రాజుమాటలివి. ఇక యీ శ్లోకమునుండియే వ్యంగ్యరీతిగా ధ్వనించుచున్న విశేషార్థమును విలోకింతము.

"శ్రుతము" అనగా వినబడినది; వేదము. (శ్రుతపారదృశ్వా) పారము నెరిగినవాడు అనగా తత్త్వవేత్త. (గుర్వర్థం=గురుశ్చ అసౌ అర్థః చ తం) పురుషార్థములలో గొప్పదియగు మోక్షపురుషార్థమును గోరి అట్టి మోక్ష విషయమగు దనకోరికను (రఘోః + సకాశాత్) రఘువంశమునుండి బడయజాలక యతడు మరియొక దాతకడకు అనగా మోక్షజ్ఞానప్రదమగు మరియొక గ్రంథముకడకు వెళ్ళినాడు.- అనెడు క్రొత్తదౌ నపవాదము (మే) కాళిదాసునైన నాకు లేకుండుగాక" అని యీ మహాకవి వ్యంగ్యరీతిచే పాఠకుని ప్రబోధించుచున్నట్లు భావించవలెను. అనగా రఘువంశములో (ఇది ఉపలక్షణమై "కాళిదాసకృతులలో" ననియు గను.) తత్త్వవిషయక విజ్ఞానము, నిగూఢముగా నిక్షిప్తమై యున్నదనియు వేదవేత్తలగు పాఠకులకు వలయు జ్ఞానము కూడ ఇందు లభ్యమగుననియు, నట్టిదింకు లేదని పాఠకుడజ్ఞతతో బోవుట కాళిదాసున కపవాదకారణమే కాగలదనియు, నట్టి దింతవరకు నీ కవికి లేదనియు, గాన నిందలి విశిష్టార్థమును విజ్ఞ పాఠకుడు సావధానతతో విలోకించి తనకోరిక సఫలమొనర్చుకొనుట కవికి సంతోష కారణమనియు నిందు వ్యంగ్యముగ నుపదిష్టమగుచున్న ఉత్కృష్టార్థము. ఈ యర్థము నే యింకను వివరింపదలచి మహాకవి. రాజుచే నీ క్రిందిరీతిని పలికించినాడు.

"సత్వం ప్రశస్తే మహితే మదీయే
వసం శ్చతుర్థోగ్ని రివాగ్న్యగారే,
ద్విత్రాణ్యహా న్యర్హసి సోఢుమర్హన్
యావ ద్యతే సాధయితుం త్వదర్థం." (5-25)

ముఖ్యార్థములో దీని భావమిది: "ఓ మాననీయా! ప్రశస్తమైన నా త్రేతాగ్నిగృహములో నీవు నాల్గవయగ్నివలె నుండి రెండుమూడురోజు లోపిక పట్టి నిరీక్షించినచో నీ యర్థమును (ధనమును) సాధించి నీకర్పించెదను. నీ కోరిక సఫలముకానిదే వ్యర్థముగ నిటనుండి వెళ్ళవలదు" ఇక యిందలి వ్యంగ్యార్థము మహాకవి పాఠకునితో చెప్పుచున్నట్లు భావించవలెను. "తత్త్వవిషయ గ్రహణార్హత గల యో పూజ్య పాఠకా! త్రేతాగ్ని గృహమువలె పవిత్రమై ప్రభావంతమైన నా కావ్య గృహములో నీవు కొలది దినము లోపిక పట్టి నీయర్థ (మోక్షార్థ) ప్రాప్తికై నిరీక్షించుచున్నచో నే నచిరముగనే నీకాంక్షితార్థమును (మోక్ష పురుషార్థమును) సాధించి నీకర్పించెదను." అనగా ఈ కావ్యము త్రేతాగ్నిగృహమువంటిది గాన పవిత్ర తత్త్వభావ భాసురానికే యిందలి పరమార్థతత్త్వము లభ్యము కాగలదని ధ్వనితము. పరమార్థదృష్టితో పరిశీలించినచో నిందెట్టి వ్యంగ్యార్థము లెన్నను లభ్యములు కాకపోవు. రఘువంశ కావ్యములో స్వాంతమైన పై పరమార్థమే కుమార సంభవములో గూడ సూచింపబడినది.

"చంద్రం గతా పద్మగుణాన్న భుంక్తే
పద్మాశ్రితా చాంద్రమసీ మభిఖ్యాం,

ఉమాముఖంతు ప్రతిపద్య లోలా
ద్విసంశ్రయాం ప్రీతి మవాప లక్ష్మీః. (1-43)

ఇందు ముఖ్యార్థమిది. చంచలయగు శోభాలక్ష్మి చంద్రు నాశ్రయించినపుడు పద్మగుణములలోని యానందము నందుకొనలేకున్నది. ఇట్లే పద్మము నాశ్రయించినపుడు చంద్రునిలోని శోభాగుణముల నామె అనుభవింపలేకున్నది. కాని ఆ శోభాలక్ష్మియే పార్వతీముఖము నాశ్రయించినపుడు చంద్రారవిందముల నాశ్రయించిన ద్వివిధమగు ప్రీతిని ఒక్కసారిగనే అనుభవింపగల్గుచున్నది. ఇది యింతులో స్వారంము సర్థమిది. ఇందు ఉత్తరార్థమే మనకు ముఖ్యమైనది. "...లక్ష్మీః ఉమాముఖం ప్రతిపద్య, ద్విసంశ్రయాం ప్రీతి మవాప" అనగా సంస్కృతకవితాలక్ష్మి ఉమాకారము, లేక కావ్య పరావతారమైన కాళిదాసుని ముఖము నాశ్రయించి రెండింటిని ఆశ్రయించిన ప్రీతిని అనగా పద్మ, చంద్ర శబ్దములచే ధ్వనించుచున్న యైహికవిషయ ప్రీతిని, ఆముష్మికవిషయ ప్రీతిని ఒక్కసారిగనే అనుభవింపగలుగుచున్నది.

ఈ విధముగానే యీ కుమారసంభవకావ్యములోని "కర్మబంధచ్ఛిదం ధర్మం భవస్యేవ ముముక్షవః" (2-50) మన్నసూక్తులీ కాళిదాసకవీంద్రునికి గల "ఆత్మజ్ఞాన కాంక్ష"ను సూచించుచునేయున్నవి. ఈ ఆత్మజ్ఞానము నరునికి వాని అహంకారాగు లంతరించినగాని అలవడదు. ఈ "అహంకారము" సాత్త్వికముచేగాని పమయదు. ఈ సాత్త్విక గుణలాభమునకు మాపుల తామసిక ప్రవృత్తి నల్లారవలెను. ఈ సాత్త్విక గుణముచేతనే మానవుడు మోక్షసాధనమైన తత్త్వజ్ఞానమును సంపాదింపగల్గుచున్నాడు. ఈ విశిష్టవిషయము నీ కవీంద్రుని శాకుంతల నాటకకథాభాగము వ్యంగ్యరీతి నెట్లు సూచించుచున్నదో యిక స్థూలముగ చూచెదము

దుష్యంతుడు పెంపుడు లేడిని వెంటాడుచుండుటతో శాకుంతలనాటక కథ ప్రారంభమగుచున్నది. రాజు రథాశ్వములను వేగముగా విడిచి యా లేడిని కొట్టబోవును. అది వానిని దూరముగా నాకర్షించుకొనిపోవును. ఇంతలో వచ్చుటిమునులు "ఆశ్రమమృగోయం న హంతవ్యో న హంతవ్యః" అని యరచుచు వచ్చి రాజు నా హింసాకార్యమునుండి నివారించెదరు. అతడు స్వతః సత్త్వప్రకృతి కలవాడు కనుకను, వానికి భావ్యభ్యుదయము ముందుబాటులోనికి వచ్చు తరుణమాసన్నమగుటచేతను, ఆ హింసాభావమును దన బాణములతోబాటు దిగనాడి, వచ్చిన మునుల నాదరించును. వాని యిట్టి యుదారభావమునకు సంతసించి మునులు ముదమునంది "పుత్ర మేవం గుణోపేతం చక్రవర్తిన మాప్నుహి" అని ఆశీర్వదించి, ఆశ్రమదర్శనమునకు వాని నాహ్వానించెదరు. అట వానికి ముముక్షువునకు ముక్తి కాంతివలె

Statement about ownership and other particulars about newspaper

**BHARATHI**

1. Place of Publication :
   6&7, Thambu Chetty St. Madras-1.
2. Periodicity of its publication :
   7th of Every Month.
3. Printer's Name :
   Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: 6&7, Thambu Chetty Street, Madras-1.
4. Publisher's Name :
   Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address : (As above)
5. Editor's Name;
   Sri S. Sambhu Prasad
   Nationality Indian
   Address: 29, Chamier's Road, Adyar, Madras 28.
   Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one per cent of the total capital.

| NAME | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 29, Chamier's Road, Adyar, Madras-28. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | 6 & 7, Thambu Chetty Street, Madras-1. |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(*Sd*) S. RADHAKRISHNA,

27-2-1960 Signature of Publisher.

శకుంతల కండ్లపండువు సేయును. ఇంతవరకు గల యీ నాటక కథాభాగమును విమర్శముగ విలోకించినచో నొక విశిష్టవిషయము విశదమగును.

మానవుడు తన యింద్రియములనెడు అశ్వములను కోరికలనెడి మృగములమీదకు విచ్చలవిడిగ విడిచి విహరించుచున్నంతవరకు, నట్టివాని నామృగములు దుష్యంతునివలె విషమ గహనములలోనికి నాకర్షించుచుననియు, నిట్టి విషమపరిస్థితిలో పడిన మానవునికి అహంకారమధికమై హింసాప్రవృత్తియే ప్రవృద్ధమగుచుండుననియు, నిట్టి సమయములో, నేమహానుభావుని యుపదేశాదులవలన గాని ఆ యింద్రియవశుడు వశ్యేంద్రియుడై తన యకృత్యములకై పరితపించి, పరిశుద్ధచిత్తుడు కాగలిగినచో నట్టివానికి గద్యంతునివలె సర్వాభ్యుదయ మూలమైన సంపదతో బ్రహ్మానందము ప్రాప్తమగు ననియు నీ కథలో ధ్వనించుచున్నది. పై ధ్వన్యర్థ మీ దుష్యంతుని భావిచరిత్రలో నెంతవరకు ప్రతిబింబించి నదో యిక తెలిసికొందము.

శకుంతలను బెండ్లాడినపిమ్మట దుష్యంతుడు శాప ముద్రితచిత్తుడై తన కర్తవ్యమును మరచియుండును. ఇట్టి సమయమున శకుంతల రాజసన్నిధికి వచ్చి తన వివాహవృత్తాంతము నతనికి దెలియజేయును కాని యా సమయమున నతడు శాపప్రతిబద్ధస్మృతుడు గాన, వచ్చిన యామెను దన గృహలక్ష్మిగా దెలిసికొనలేక, అజ్ఞాని ఆత్మజ్ఞానమునువలె దన కళత్రమును నిరాకరించి పొమ్మనును. తిన్నగా కృతఘ్నుడైన యా తపస్విని చేయునది లేక తన తల్లికడకు తరలిపోవును. ఇట్లుండగా కొంత కాలమునకు అభిజ్ఞానలాభముతో నా రాజునకు బూర్వ స్మృతికలిగి, తనయకృత్యముకై యెక్కుమ్మడిగ వానికి బశ్చాత్తాపము ప్రారంభమగును.

శకుంతలా దుష్యంతుల చిత్తశుద్ధినిగూర్చి మారీచ ముని యిట్లనును.

"వత్సే! చరితార్థాసి.
"శాపాదసి ప్రతిహతా స్మృతిరోధరూక్షే
భర్తర్యపేతతమసి ప్రభుతా తవైవ,
ఛాయా న మూర్ఛతి మలోపహతే ప్రసాదే
శుద్ధే తు దర్పణతలే సులభావకాశా." (7–196)

"ఓ శకుంతలా! నీవిప్పుడు కృతకృత్యురాలవైతివి. ఇంతకుముందు నీ ప్రియుని జ్ఞానము శాపగ్రస్తమగుటచే నీవతనిచే నిరాకరింపబడితివి. ఇప్పుడతడు విముక్తశాపు డగుటచే లబ్ధజ్ఞానుడై వినిర్మల చిత్తుడయ్యెను. కాన యిక నీ ప్రభావము వానిపై పనిచేయగలదు. అద్దము మలిన దూషితమై యున్నంతవరకు దానిలో వస్తుచ్ఛాయ ప్రతిఫలించదు. ఆ మలినము క్షాళితమైన వెంటనే యద్దె యద్దములో నగ్రస్థిత వస్తుచ్ఛాయ ప్రతిబింబించగలదు కదా"

ఈ శ్లోకారములో కాళిదాస మహాకవి దుష్యంతుని విశుద్ధచిత్తతను విముక్తతను ధ్వనింపజేయుచు దీనితో దైవిముక్తతను గూడ సూచించినాడు. ఇక శకుంతలా ప్రభుత్వము విశుద్ధుడైన రాజుపై పనిచేయ గలదు అనగా అజ్ఞానము నుక్తమగుటచే నిప్పటి యీ రాజు విముక్తుడై జీవన్ముక్తతనందినాడనియు, నిట్టి వీనిపై ముక్తికాంతా ప్రభుత్వమిక పనిచేయగలదనియు, గాన వినిర్మల చిత్తములో "పరమాత్మ" యనెడు వస్తుచ్ఛాయ యిక సులభముగ ప్రతిబింబించుననియు ధ్వనింపుచున్నది కదా! "పుత్రవతీ శకుంతలా స్మృతిమతా దుష్యంతేన ప్రతిగృహీతా" అని మారీచ ముని కణ్వునకు బంపిన ప్రియసందేశము కూడ ఒక మోక్షకామి సంపూర్ణ మనోరథముగ ముక్తికాంతనుబడసి, మనోరథసిద్ధిచే చరితార్థుడైన రీతిని వ్యంగ్యముగా సూచించుటలేదా? దీనితో దుష్యంతునితో బాటు మహాకవి కూడ నైహికసిద్ధితో బాటు ఆముష్మికసిద్ధి కూడ కూరినది. ఈ కవి కవితా ప్రతిభచే ఇంద్ర సన్మానముతో మర్త్యలోకము స్వర్గాధికముగా పరిణమించినది ఇరువురకు వాంఛితవాంఛలన్నియును సిద్ధించినవి. ఇక ఐహికముగ కోరదగినదేదియు వీరికి లేదు. ముక్తునకు జీవన్ముక్తియొక్కటే కోరదగినది గాని మరేమి వలయును? కనుక నె రాజుచే మహాకవి భరతవాక్యములో నీరీతిని పలికించును. "మమాపి చ క్షపయతు నీలలోహితః పునర్భవం పరిగతశక్తిరాత్మభూః." "సర్వశక్తిసంపన్నుడైన యీశ్వరుడు నాకు పునర్జన్మ లేకుండ చేయుగాక!" ఇట్లు పునర్జన్మరాహిత్యము పరమప్రాప్యముగా భావించిన ఈ మహాకవి భావమింత పరిణతిపొందుటకు దానంత పూర్వరంగమీనాటకమున ముఖ్యముగా ఉండి తీర వలెను గాద. ఆయా సందర్భములలో నీ కవీంద్రుడు తన యాభిమతము నెట్లు ధ్వనింపజేసినాడో సంగ్రహముగ చూపి యిక విరమించెదను.

శృంగార ప్రధానమైన యీ నాటకమున, తత్త్వ జ్ఞానసారమైన యిట్టి "పునర్జన్మరాహిత్య" సాధనము

మహాకార్యసాధనమనియే చెప్పవలసియున్నది. ఈ మహాకార్యసాధన మీ కవీశ్వరుని ముఖ్యప్రయత్నములో నొకటియని యీ క్రింది సందర్భము ధ్వనింపజేయుగలిగి యున్నది. వృక్షసేచననియుక్తయైన శకుంతలను జూచి మొట్టమొదట మహారాజు యిట్లనుకొనును.

"ఇదం కిలా వ్యాజమనోహరం వపు
స్తపః క్షమం సాధయితుం య ఇచ్ఛతి,
ధ్రువం స నీలోత్పల పత్రధారయా
సమిల్లతాం ఛేత్తు మృషి ర్వ్యవస్యతి." (1-18)

ముఖ్యార్థములో నీ శ్లోకభావమిది: "కణ్వమహర్షి యీ సుకుమారగాత్రియొక్క సహజసుందర శరీరమును తపః క్లేశసహనక్షమముగాజేయ నెంచినాడు. కనుక యితడు కల్వపూరేకు అంచుతో కఠినవస్తువును ఛేదించుటకు యత్నించుచున్నాడు." ఇక ధ్వన్యర్థములో నుత్తరార్థము పరిశీలించుడు ఋషితుల్యుడైన కాళిదాసు, సుకుమారమైన పరికరముతో కఠిన కార్యమును అనగా మహాకార్యమును సాధింప యత్నించినాడు. శృంగారప్రధానమగు కథాంశముతో తత్త్వజ్ఞాన సాధ్యమైన మోక్షవస్తువును సాధించుటే కదా ఈ మహాకార్యము. ఏతత్సాధనకై కథాసాధకునకు తత్త్వజ్ఞానమత్యావశ్యకము. అసలీనాటక రూపము కేవలజ్ఞానముచేతనే తెలియదగియున్నదన్న విషయము "అనాఘ్రాతం పుష్పం" అన్న శకుంతలా రూపవైభవ వర్ణనమున స్పష్టపరచినాడు. రాజు విదూషకునితో నిట్లనును. "శకుంతలారూపము ఇతవరకు పరిమళము చూడని పుష్పము. ఇట్టి తద్రూపమింకను చెయ్యితాకని చిగురుటాకు; సానపెట్టని రత్నము; చవిచూడని తేనియ; అఖండపుణ్యమునకు ఫలము. ఇట్టి యామె యపురూపమైన రూపము ననుభవించుటకై

బ్రహ్మ ఏ పుణ్యాత్ముని సృజించినాడో కదా!" ఇక దీనిలో ధ్వనించు విశిష్టవిషయ మిది. ఇందు ఐదు వస్తువులున్నవి. 1. పుష్పము, 2. చిగురుటాకు, 3. రత్నము, 4. తేనె, 5. పుణ్యఫలము. పుష్పము మొదలగు నీ వస్తుపంచకము వరుసగా 1. ఘ్రాణ, 2. త్వక్, 3. చక్షు, 4. రసన, 5. శ్రోత్రములు అనబడు పంచజ్ఞానేంద్రియముల చేతనే తెలియదగియున్నది. జ్ఞానేంద్రియములకు విషయమైన యీ వస్తుపంచకరూపమే శకుంతలా రూపసంపద కదా! కనుక ఈ శకుంతల కథారూపము కేవల జ్ఞానము చేతనే తెలియదగినది- అని ధ్వనితమగుచున్నది. ఇట్టి ఈ నాటక కథారూప వైభవము ననుభవింపుటకు బ్రహ్మ సహోదయుడైన విశిష్టజ్ఞానిని సృజించునో తెలియదు. అని కవి అనుకొనుచున్నట్లు భావించవలెను. ఈ భావమును ఈ క్రింది వాక్యములు కూడ వ్యక్తము చేయజాలి యున్నది. "సఖే! అనవాప్తచక్షుఃఫలోసి। యేన ద్రష్టవ్యానాం పరం న దృష్టం॥" (అంకం 2) శకుంతల నింతవరకు చూడని విదూషకునితో రాజు వినోదముగా అట్లనును. "మిత్రమా! నీవు కండ్లున్నందుకు తగినంత ఆనందమును పొందలేక పోతివి. కారణమేమనగా శకుంతల, చూడదగిన వస్తువులన్నిటిలో ఆఖరివస్తువుగా చూడవలసినది. ప్రపంచాతీతమగునట్టిది నీచే చూడబడలేదు. గాన నీ నేత్రానందఫలము నీకబ్బలేదు" అని. శాకుంతల నాటక కథారూపవైభవము తెలిసికొనదగిన విషయములన్నిటిలో పరంజ్యోతివలె ఆఖరివస్తువుగా జ్ఞాననేత్రములో చూడతగినది యనియు, అట్టి యుత్తమోత్తమవస్తువును చూడని (తెలియని) వాడు తన నేత్రానంద మనుభవింపనట్లే యనియు, గాన పాఠకుడీ కథారూప వైభవమును తన జ్ఞాననేత్రముతో తెలిసికొనినప్పుడే "చక్షుష్మాన్" అనిపించుకొనుననియు, అట్టివాని కిక తెలిసికొనదగిన దేదియు నుండదనియు మహాకవి మనకు వ్యంగ్యరీతిని విశదము చేయుచున్నాడు.

ఇంతవరకు జరిగిన చర్చనుబట్టి మనము గ్రహించిన పరమార్థమిది: మానవుడు తాను రాజస ప్రవృత్తిలో నుండి, అహంకారాదులకధీనుడై యున్నంతవరకు వాని ఇంద్రియవేగము వానిని హింసా ప్రవృత్తిలోనికి ఆకర్షించి, కర్తవ్యమును మరపించుననియు, సత్త్వప్రకృతినాశ్రయించి అహంకారాదుల నణగద్రొక్క గలిగినపుడే వానికి అభ్యుదయము హస్తగతమగుననియు, గాన తనలోని రాజసాదులను పాఱద్రోలుటకు మానవుడు, తాజేసిన యకృత్యములను పదేపదే మననముజేసికొని పశ్చాత్తాప సంతప్తుడు కావలెననియు, అప్పుడే వానికి చిత్తశుద్ధి చేకూరి పరతత్త్వము వాని నిర్మల చిత్తములో ప్రతిబింబించి బ్రహ్మానందానుభవమును, దానితో వాంఛారాహిత్యమును, దానితో మోక్షము సిద్ధించునని కాళిదాస కవీంద్రుని కావ్యాత్మ తన సరససుందర సుకుమార సూక్తులచే వ్యంగ్యరీతిని మన కుపదేశించుచున్నది. కనుకనే అలంకారికులు వేదపురాణాధికమైన కావ్యాత్మనిట్లు కీర్తించినారు.

యా వేదా త్ప్రభుసమ్మితా దధిగతం
శబ్దప్రధానా చ్చిరం
యా చార్థప్రవణా త్పురాణవచనా
దిష్టం సుహృత్సంహితాత్,
కాంతాసమ్మితయా యయా సరసతా
మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత
స్తస్యై స్పృహాం కుర్మహే.

# ద్విపద భారతము - తిమ్మయ గడుసుపోకడ

శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మ

ద్విపద భారతకవులలో మూడవవాడు సోమన. ద్రోణపర్వము దొరకొని స్వర్గారోహణ పర్వాంతము మొత్తము పదునొకండు పర్వముల రచనను ఒక్క చేతిమీదుగా నిర్వహించిన మొనగాడు. అయితే ఈయన తిమ్మయవలె అంత ప్రగల్భుడును గాడు, బాలసరస్వతివలె అంత అప్రగల్భుడును గాడు; కాని గడుసువాడు. తెనుగున కవిత చెప్పగల పాండిత్య పటిమ యున్నది; దేశిరచన చేయగల భావనాబల మున్నది. దీనికితోడు లోకవృత్తము బాగుగా నెరిగినవాడు. కనుకనే తిమ్మయ రచనావిధానమును నిదానముగా పరిశీలించి, తిక్కన కళావైభవమును బాగుగా గుర్తించుకొని, యుభయులకును మధ్యేమార్గము ననుసరించి, రచన నంతయు జాగరూకతతో నిర్వహించినాడు.

ఈ నిర్వహణములో నీతని కంటము పంచకల్యాణి వలె పరుగులు వారినదా యనిపించును. అనగా, నొక విషయమో ఘట్టమో వ్రాయదొరకొని, శ్రీకారము చుట్టినది మొదలు ఇతిశ్రీగా పూర్తియగువరకు నీతడు గుక్కతిప్పుకొన్నట్లు కన్పట్టదు. అట్టి ప్రవాహరూపమున నున్నది యాతని శైలి. కనుకనే పదునొకండు పర్వముల రచనను ఒక్కడుగా నొక్కడు విధి విరామము లేక సాగింపగల్గినాడు. "వెంకటాచలాధీశ్వర దివ్య పదపద్మమకరందపానద్విరేఫ" మగు నీతడు —

"శ్రీ వేంకటాధీశ, సృష్టిప్రకాశ,
భావజాతీతవైభవ, భోగనిలయ"

అని తిరువేంగళనాథుని పరమపవిత్రనామమంత్రము నొక్కమారు నోరార నుచ్చరించి, అతని దివ్యమంగళ మోహన రూపమును చిత్తమున హత్తుకొల్పి,

"అక్కథకుడు శౌనకాది సన్మునుల
కక్కథాసూత్ర మిట్లని చెప్పదొడగె"నని

తిమ్మయ గొంతుతో శ్రుతికలిపి,

"ఆరీతి సంజయు డాయంబు చూచి
వారణపురికి వలనొప్ప వచ్చి
తనరారు నంబికానందను మందిరము
ఘనతం బ్రకాశించు కరమర్థి గాంచి
యా రాజునకు మ్రొక్కి యాతండు తన్ను
గారవించిన నొక్క కనకపీఠమునం
దిరముగా గూర్చుండి ధృతరాష్ట్రు జూచి
పరువడి నొకమాట పలికె నిట్లనుచు" (కర్ణ - పు 3)

అని తనసాగినభంగి గంటమును హుటాహుటిగా పరువులెత్తించుచు, అంచెలంచెలుగా పదునొకండు పర్వముల రచనను నిర్వహించి, ద్విపద భారతరచన పూర్తి చేసినాడు.

ఈ రచించుటలో నీత డవలంబించిన విధానమెంతయును మెచ్చదగినది. అటు తిమ్మయ రచనావైవిధ్యమును, ఇటు తిక్కన కళావైభవములు బాగుగా గుర్తించినాడు. ఏయొకరిమార్గము ననుసరింపక సుగమమైన వేరొక త్రోవ త్రొక్కినాడు. సోమన యవలంబించిన విధానము లీ దిగువ తీరున చూపట్టును.

1. ప్రస్తుత కథకు అంతగా నక్కరలేని ధర్మప్రసంగములు, వర్ణనలు, దూరాపాతములగు కథలు మున్నగువానిని వదలివేయుట:-

ఇది తక్కిన పర్వములలోకన్న శాంతి పర్వములో బహుళముగా కానవచ్చును. ఇందలి ప్రథమాశ్వాసములోని సులభాజనక సంవాదము, నాల్గవ యాశ్వాసములోని మేధావి వృత్తాంతము, అజగర వృత్తాంతము, అయిదవ యాశ్వాసములోని ఇంద్ర వృత్రాసురుల యుద్ధప్రకారము మున్నగునవన్నియు నిందు విడువబడినవి.

2. సుదీర్ఘములగు ధర్మప్రసంగములు, నీతిబోధలు మున్నగువానిని సామాన్యునకు గూడ బోధపడు తీరులో క్లుప్తముచేసి ప్రసన్నమగు శైలిలో వ్రాయుట:-

భీష్మాదులు ధర్మజున కుపదేశించిన రాజనీతులు, రాష్ట్రజనుల కర్తవ్యములగు ధర్మములు, దండనీతి ప్రకారము, శాస్త్రతత్త్వ మెరుగనివారు చేయవలసిన విధులు మున్నగు * ధర్మప్రసంగములు చాలవరకు

* శాంతిపర్వము - పంచమాశ్వాసము. పు. 216 పు. 477 మొదలు ఆరవ యాశ్వాసము తుదివరకు గలవి.

తగ్గింపబడినవి. ఇంతయేల, శాంతిపర్వమును సగమునకు తగ్గించి విషయమంతయు క్లుప్తముచేసి సూక్ష్మముగా చెప్పి విడిచినాడు. అనగా, శాస్త్రీయ విషయములను ద్విపదరచనలో నుండనిగినంతవరకే గైకొని, భారత పఠనము సామాన్య పాఠకులకు గూడ సుగమము చేసినా డన్నమాట.

3. మూలమందలి విషయమును మాత్రము గ్రహించి రచన సాగించుట – కర్ణుని మరణమునుగూర్చి సంజయుడు ధృతరాష్ట్రునకు తెలియజెప్పు సందర్భము లోనిదగు

క. "బలవిక్రమములు వినుతం
బులుగా, మన మొనలు పాండుపుత్రానీకం
బులు రెండునాళ్లు వోరుట
తెలియంగాఁ జూచి వచ్చితిం గురునాథా"

వ. అని పలికి కర్ణుని ప్రశంసించి.

పరవు గొనండు పాండుసుత
సైన్యనికాయము నించు కేనియున్
గరుల రథంబులన్ హయములఁ
గాల్బలముల్ దవవీఁక విచ్చియున్
మరలియుఁ దూలియుం బిలుకు
మాగియు నల్గడ బాఱియున్ వియ
చ్చరులకు వేడ్క సేయు భుజ
సారము శౌర్యముఁ జూపె నేపునన్.

వ. చూపి యక్కౌంతేయుల గలంచియాడి పదంపడి,

తనకు బిమ్మిటిరైన యర్జునుని బాహు
లీల నెమ్మెయిఁ ద్రోవంగ లేక తెగిరె
వదిప, యాఁబోతు బెబ్బులి కగ్గమైన
పగిదిరైరె పాండవులకును జగ యణంగె."

(తిక్క న. కర్ణ. 1, 1-6)

అను మూలమందలి పద్యములలోని విషయమును మాత్రము గ్రహించి సోమన—

"మనవారి మొనలును మఱి పాండురాజు
తనయుల బలములుఁ దలపడి రెండు
దినములు పోరిన తెఱగెల్ల నేను
దిననాథసమతేజ, తెలిసి వచ్చితిని
అనిపల్క రాధేయు నతులవిక్రమము
గొనియాడి, మఱియు దగ్గత్తిక వెట్టి
పలికె కుంతీసుత బలసముద్రంబు
కలయ మందరగిరిగతి జొచ్చి కలచి
మొన లేపుచూపిన మొనసి యువ్వెత్తు
గొనియు, సామంతుల గ్రొవ్వణంచియును,
బొలమెల్ల బీనుగు ప్రోగులు గాగ
నలిమీఱు యోధుల నఱకి వేసియును,
అడరెడు కడిమి పై ననిలోన జముని
కొడుకు నుశ్వేత్తుగా గొని చెలరేగి
క్రీడి యెదుర్పడి క్రీడయు బోలె
జూడ నక్కజముగ భారత మెఱసి
పులికగ్గమైన యాబోతును బోలె
బొలిసె కర్ణుం డింద్రపుత్త్రునిచేత."

(సోమన కర్ణ పు 8)

అని ద్విపదీకరించినాడు. ఇది విషయ ప్రధానము.

4. తిక్కనగారి ప్రత్యేక కళాఖండములుగా నెన్నబడు సంస్కృతభూయిష్ఠరచనను ప్రసన్నమగు దేశిరచనలో వెలయించుట:- ఇట్టిపట్లు సోమన రచనలో నడుగడుగునను చూపట్టును. కొన్నిటినిమాత్ర ముదాహరింతును.

i. 'క్షేమధూర్తి భీముని సాహ్వానంబు చేసిన' తిక్కనగారి (గైర్వాణిని కర్ణ, 1-77) సోమన—

"అందెందు బోయెన వనిలజ, నీవు
ఇందు రమ్ము..." (16 వ పుట:)

అని తెనుగుగడ్డకు తెచ్చినాడు.

ii "దంతిఘటల్ మహోగ్ర సము
దగ్రతతో నడ తేర దర్పగు
ర్వాంత గజాధిరోహణ ని
తాంత సముజ్జ్వలభంగి బ్రాఢ వి
క్రాంతి విలాసమొప్పగ న
ఖండిత పౌరుషుడై......య
త్యంత సముద్ధతిన్......"

(తిక్క న. కర్ణ. 1-75)

అనీకము సంచలింప కవిసిన తిక్కనగారి భీముడు సోమన గంటమునుండి:

"ఏనుగు తండంబు లిరుగెలంకులను
మానుగా నేతేర మగటిమి మెఱసి
యైరావతారూఢుడగు వజ్రిపోలె
మారుతి యొక మహామదకరి నెక్కి
వేడి యశ్వత్థామ! వేడి కృపుండు!
వేడి కౌరవరాజు! వేడి! యటంచు

వేడి వాలమ్ములు వెదచలుకొనుచు
వాడిమి పచరింప...." (సోమన కర్ణప. పు. 16)
వెలువడినాడు.

iii సోమయాజిరచనలో సంస్కృత బహుళ సమాసఘటిత సీసపద్యమున ప్రళయతాండవము చేసిన మద్రవిభుడు (తిక్కన కర్ణ. 1-115) సోమన తెనుగు నుడులలో—

"కాఱడవుల గాల్చు కార్చిచ్చురీతి
మీఱి దంతుల గూల్చు మృగరాజుభంగి
మూడూళ్లు గాల్చిన ముక్కంటిపగిది
వాడిమి గౌంతేయ వరబలంబులను
సమరోర్వి బెక్కండ్ర సమయించి మించి
సమర త్రిపురికి విచ్చలవిడి" ననిచినాడు.

iv "నిబిడఘంటారవళి నిక్వణములు, భీషణ బృంహిత ఘోషలు, ఘననేమి నిష్ఠురధ్వనులు, కేతు నిర్భర కింకిణీ నినదములు, చటుల ఖురప్రాత పటురవంబులు, అఖిల హేషా మహాస్వనములు, భూరి భుజాస్ఫాలనారావములు, మేదుర తర సింహనాదములును బరగి దిక్తటముల బగిలింప ననిమిష ఖచర సిద్ధ యక్ష గరుడ గణము లంతరంగముల నితాంత కౌతుక భరితములుగా జూడ్కి గములు వఱుప, గరుడప్రహారంబుల నోర్చిన పంచాస్యపన్నగంబులబోని బాహువులును, గాంతిత్వరుచి సౌభంబు పెంపున సంపూర్ణ చంద్రార్క కమలంబుల గేలిసేయు నాననంబులను, నలంకృతమైన సంగ్రామరంగమున వాహనంబులమీదనుండి భూషణ కిరణంబులు మెఱయ, నేలంగూలు నపుడు పుణ్యావసాన కాలంబున నాకలోక పరిభ్రష్టంబగు మహోత్కలోకంబు చందంబు దోప కౌతూహలరసంబు బెనిచిన సాత్యకి ధృష్టద్యుమ్న చేకితాన ద్రౌపదేయ ప్రభద్రక చేది పాంచాల చోళ మగధ వంగాది దేశబలంబు లాదిగాగల యుభయ కవిమిత్రుని రణరంగయోధానుయోధులెల్లరును (తిక్కన కర్ణ ప. 1-74, 75) సోమన పోలికలనిలో 'కౌరవబలమును కౌంతేయబలము' నై 'దారుణగతిదాకి' —

"మంజులాగ్రంబులు మహితకుంతములు
భిండివాలమ్ములు పృథుముద్గరములు
పరతోమరములు బటిసంబులును
సురియలు తత్తళ్లు శూలము ల్గదలు
మొదలైన యాయుధంబులు మెఱయంగ
గదనంబ సేయంగ గడగి...
బలువడి బొడుతురు పంతంబుతోడ
బలుసుర నఱుకుదురు పేరువాడుదురు
మొత్తుగు రంగముల్ మోదలుకట్ట
గత్తుల నెమ్ములు గాడ నేయుదురు
పులులు కురంగాళి బొలియించునట్టి
పోలుపున బగతుర బుడమి గూల్చుదురు
అంచలు బిసముల నవని ఖండించు
సంచున ద్రెవ్వులు చక్క ద్రెంపుదురు
చెక్కులు ముక్కులు జెవులు బాహువులు
నక్కులు బిక్కలు నంసదేశములు
బరులు పేరురములు ఫాలస్థలములు
గర మ్రగముగ రణాంగణమున నిండ
గుంచియు నీడ్చియు గూల్చ గుమ్మియును
వంచియు వ్రాల్చియు వసుధ వైచియును
ముసలమ్ము లెత్తి రొమ్ములు నవియంగ
వెస వ్రేసి నడుములు విఱుగ వ్రేసియును
జేసేత విజయంబు సేకొనునట్టి
యాప గయ్యాళులై......"

(సోమన కర్ణ పు. 14, 15)

నరులచే బొగడ్త కెక్కిరి. అంతియగాదు. సోమన తెనుగు మొనలో—

"వెనుకదీసినవాడు వెదకిన లేడు,
మొనయుగ నడిచినవాడు మొదటికి లేడు
పాఱిపోయినవాడు పరికింప లేడు,
ఊఱకుండినవాడు నొకరును లేడు.
పందయు మఱి లేడు పరికించిచూడ."

(సోమన కర్ణ పు. 15)

ఈ తీరున తిక్కన భారతమునందలి సంస్కృత బహుళమగు రచనను, అలతి యలతి మాటలతో దేశీయమగు తెనుగురచనలో సోమన వెలయించిన భాగములు ఇంక నెన్నెన్ని గలవు.

5. తిక్కనమూలమును గైకొని ఛాయామాత్రముగా ననుకరించుచు రచన సాగించుట!

కర్ణుడు శల్యసారథ్యమును గోరుసందర్భములో—

"ఖండనము నెఱపు మెయి కృష్ణుపాటియనగ
మహి బొగడ్తకు నెక్కిన మద్రనాథు
నాకు సారథిగాగ నొనర్పవలయు
గెలుతు నక్లైన నన్నరు నలువు మెఱయ."

(తిక్కన, కర్ణ. 1-

అనుపద్యమందలి భావములను గ్రహించి,

"కౌన నసాధ్యమై కదనోర్వియందు
బూని వర్తించు నేర్పున గృష్ణుసాటి
యనగ సన్నుతి కెక్కిన మద్రనాథు
ఘనత నాసారథిగా నొనరింపు"

(సో. కర్ణ. పు. 40)

అని ఛాయామాత్రముగా ననుకరించినాడు.

6. ఒక్కొక్కచోట నలంకారాదులతో గూడ మూలభావమును పొదివిపట్టి ద్విపదలో నిముడ్చుట:—

కర్ణునకు సారథ్యమొనరింపుమని దుర్యోధనుడు శల్యుని నర్థించు ఘట్టములోని—

"ఇమ్మిత్ర్వరమ్ము సార
థ్యమ్మితనికి జేయు మీనున కరుణుడు సాపో
య్యమ్మెమ్మనరిచినట్లుగ దివి
రమ్ముక్రియున్ రూపుసెడి యరాతులఘంగన్."

(తిక్కన కర్ణ. 2-247)

అనుపద్యము గైకొని,

"............ఈవరమ్ము
ఈవేళ నాకిమ్ము; ఈవేళ దిమ్ము;
సావధానత గర్ణు సారథి గమ్ము;
వినతాతనూజాని విపులసహాయ
మున విభావసుగతి మనుకొని వినుత
నిబిడాంధకారంబు నిక్కంబ బఱపె"

(పు. 40)

అని సాలంకారముగా ద్విపదలోనికి దెచ్చినాడు.

7. ఒక్కొకచో తిక్కనగారి రచనను యథాతథముగా ననుసరించియే వ్రాయుట:—

కర్ణుని మరణము విని ధృతరాష్ట్రుడు తన తనయుని చెడ్డపనులు తలచుకొని పలవించుపట్టున—

"శరతల్పమున నుండి శాంతనవుండు బీ
భత్సు దివ్యాస్త్రనై భవము దెలుప
దివిజ జలంబట్లు తెప్పించుకొని యప్పు
పాండుసూనులతోడి బాంధవంబు
నడపుము సిరి పంచి కుడుచుట మేలింత
తో గయ్య ముడిగి శాంతుడవు గమ్ము
బ్రతుకుము నీవన్న పనుపు సేయడు సుయో
ధను డిప్డు శోకాబ్ధి మునుగకున్నె!
పడుచు లీకలూడ్చి పట్టియాడెడునట్టి
పులుగుచందమయ్యె దలప నా య
వస్థ యెందు జొచ్చువాడ నీయెలనట
దీర్ప నెవ్వరింక దిక్కు గలడు."

(తిక్కన కర్ణ. 2-84)

పై సీసపద్యమును సోమనగైకొని ఛందమును సవరింప జేసి,

"శరతల్పమునయుండి శంతనసుతుడు
సరవి బార్థుని దివ్యశరమై భవంబు
దెలుప జలంబులు దేరంగబనిచి
సొలసి పాండవులతో జుట్టరికంబు
నడుపు, రాజ్యంబును నలువొప్ప బంచి
యిడుము, యుద్ధము మాని యింతటినుండి
మనుము నీ వనిన, దుర్మదుడు కౌరవుడు
వినడింక శోకాబ్ధి వెస గూలకున్నె!
బలిమి నెక్కలు గ్రుంచి పడుచులాడించు
పులుగు చందంబయ్యె భూమి నావిధము
ఎక్కడజొచ్చెద! నీవగ యుడుప
దిక్కెవ్వ! రిటమీద దెలిసేది నాకు."

(6వ పుట.)

అనురీతిని సరిగా అపాదమస్తకము కరిగించి ద్విపద మూసలో పోతపోసినాడు.

8. మూలములో నామమాత్రముగానున్న విషయమును గైకొని యొక్కొకచో తనరచనా సౌష్ఠవమును మెఱయించి పెంచివ్రాయుట:—

"వ. అమ్మహీపతి కురుసేన నింక నెవ్వరుగలరని యడుగుటయు నతం డశ్వత్థామ కృతవర్మ శల్య శకుని కృపాచార్యుల జెప్పి, బ్రదికిన కురుకుమారులను గర్ణకొడుకులలో నున్నవారలను మఱియుంగల యోధులను జెప్పి, వీరలగొని యనికి నుత్సహించి...దుర్యోధనుడు ధైర్యం బవలంబించి జయార్థియైయున్నవాడు."

(తిక్కన. కర్ణ. 1-17)

అను తిక్కన వచనమునందలి నామమాత్రముగానున్న విషయము స్వీకరించి సోమన:

"తలపోయ నింక నెందఱు మనవీట
నేమి నున్నారు నా కెఱిగింపు మనిన,
నంబికొనుచు జూచి యా సంజయుండు
వరబాహుశౌర్య దుర్వారాతిశైల
సురనాయకుడు ద్రోణసూను డున్నాడు,
వినుత పరాక్రమ విద్వేషితిమిర
వనజమిత్రుడు కృతవర్మ యున్నాడు,

వీతభయోత్సాహ విమతోగ్రగహన
జాతదహనుఁడు కృపాచార్యుఁ డున్నాఁడు,
అవినయవైరి మహావారివాహ
పవమానుఁడగు మద్రపతి యున్నవాఁడు,
కపట శస్త్రవ్రాత గర్వసంహార
నిపుణుండు గాంధార నృపతి యున్నాఁడు,
అక్షీణ విక్రమాహవ నిత్యకేళి
దక్షులు భవదీయ తనయు లున్నారు,
క్రూర వీరావేశ ఘూర్ణాయమాన
ఘోరచిత్తులు కర్ణకొడుకు లున్నారు,
మఱియు నానాదేశ మండలేశ్వరులు
వఱలియున్నారు దుర్వార విక్రములు
వీరల గొని పోర విజయంబు వడసి
గోరియున్నాఁడు నీకొడుకు...”

(సోమన కర్ణ. పు 5)

అని తన కంటుముచుకువనము చక్కదనమును చూపి పెంచి వ్రాసినాడు. ఇట్లు పెంచి వ్రాయుటలో ప్రయోజనము లేకపోలేదు. హతశేషుల యండగొని దుర్యోధనుడు పోరిలో విజయము గోరియున్నాడు. అట్టి సహాయులు నిస్సారులై యున్నచో నతని యాసలడి యాసలే యగును. కావున, వారి పరాక్రమ సాహసముల నుగ్గడించి దుర్యోధనుని జయాశకు అర్థము గలిగించి, తనయుని అపజయములకు దురపిల్లుచున్న గ్రుడ్డి రాజునకు సంజయుని నోటి మూలమున నూరట యొనరించినాడు.

9. మూలములో సూత్రప్రాయముగా నున్న విషయమును సామాన్యులకు గూడ దెలియునట్లు ద్విపదరూపమున వ్యాఖ్యసేయును:-

భీష్మద్రోణులు సమరమున బడినతరువాత దుర్యోధనునకు జయాశ సన్నగిల్లినది. కాలుసేతు లాడ లేదు. అప్పుడాతనికి కర్ణు డుత్సాహము గలిగించువాడై: “నీ వేల చింతిల్లెదవు? మున్ను నీకిచ్చినబాస మఱతునా? నాయస్త్రబల మెల్ల రెఱుంగ పాండుపుత్త్రుల మర్దింతు. నీ వనుమానింపక మదీయసంగ్రామంబును నిల్చి చూడుము. నన్ను సర్వసేనాధిపత్యంబునకు బట్టంబు గట్టుము.” అని పల్కెను. (తిక్కన. కర్ణ 1-55)

ఇందు కర్ణుని బాస యెట్టిది? ఆతని యస్త్రవిద్యానైపుణ్య మేపాటిది? ఇది గల విషయములు మాత్రప్రాయముగా నున్నవి. సోమన అది గ్రహించి జనసామాన్యమునకుగూడ దేటతెల్లముగా తెలియజెప్ప నెంచి యీ రీతిని వివరించి వ్రాసినాడు:

“అనవుడు రాగిల్లి యానూతసుతుడు
తన కేర్పు వెలసిల్ల దా నిట్టులనియె
నన్ను సేనల కెల్ల నాథుని గాగ
బన్నుగా దళవాయిపట్టంబు గట్టి
నిన్ను సంగ్రామంబు నెఱి సోకనీక
గన్నార వేడుక గనుగొనుచుండు
అదియును గాక నీ కాదికాలమున
బదరక యిచ్చిన బాస నేమఱక
కాలకంఠుని పినాకమువోలె నొప్పు
కాలపృష్ఠంబను కార్ముకం బంది,
పరశురామునికృప బడసినయట్టి
వరదివ్య సాయకవ్రాతంబు వఱపి,
వ్రక్కలువాపెద వసుధాతలంబు
చక్కాడి విడిచెద జదలెల్ల జెదర,
పిండలివండు గాలించెద నబ్ధి
కొండలు పిండియై క్రుంగ గూల్చెదను
ఓర్చెద నింద్రుండు సురవడించినను
దేర్చెద నమరులు లేతెంచిన నైన
నా బాహుశక్తియు నా దివ్యబాణ
ప్రాబల్యగతియు నా పౌరుషక్రమము
నీ సర్వరాజన్యు లెల్ల వీక్షింప
బూసగ్రుచ్చినయట్లు పొగడంగ జేర్చి
మిడుమిడుకనగ నెమ్మెయి పాండురాజు
కొడుకుల నేవుర గూల్తుగా కేమి
పరిజన హిత సుహృద్బంధు యుక్తముగ
పురుహూతనందను పోడిమిబాపి
లలినొప్పు సామ్రాజ్యలక్ష్మి యంతయును
ఎలమిసొంపొందంగ నేనిత్తు నీకు
వివిధదానంబులు వివిధయాగములు
తివిరి కావింపుము దిశల నీయాజ్ఞ
చెల్లగా రాజ్యంబు సేయుచు గడుపు
చల్ల దొలంకగ చల్లగా నుండు”

మని తన హృదయమును విప్పి చెప్పినాడు. (కర్ణ. 9)

ఇవి గాక సోమన రచనలో ముఖ్యముగా చూపట్టు గుణవిశేషము ధారాశుద్ధి. దానిని గూర్చి యీ వరకే ముచ్చటించితిని. అది యీతని కవితలో అడుగడుగునను గన్పట్టుచుండును. పైనుదాహరించిన గ్రంథభాగములవలనగూడ గొంతవరకు గుర్తింపవచ్చును.

ఈ విధముగా సోమన ప్రధానకథను గైకొని, మూలసూత్రము మాత్రము విడువక, రచనలో గొడ్డులు రానీయక, దేశికవితలోని ప్రసన్నభావమును మందగించనీయక తన ప్రత్యేకతను కాపాడుకొనుచు, అతిస్వతంత్రుడగు తిమ్మయ రచనానంతరము కవిబ్రహ్మయగు తిక్కన రచనను ద్విపదీకరింప చేపట్టినమాట అడుగడుగునను గుర్తించుకొనుచు నేర్పుగా రచన సాగించినాడు. ఈతనిగూర్చి చెప్పదగిన మరియొక విషయము అరణ్యపర్వపూరణము.

దీని కర్తృత్వమునుగూర్చి యింతకుమున్నే తెల్పియున్నాడను. ఆదిపర్వకర్తయగు తిమ్మయ తొలుత తక్కినపర్వములతోపాటు దీనినిగూడ రచించినాడు. ఆ రచించుటలో నలచరిత్రాద్యుపాఖ్యానములను పూర్తిగా విడనాడి, బహుళములైన ధర్మప్రసంగములు దిఙ్మాత్రముగా స్పృశించుచు, ప్రధానకథాంశమును మాత్రము గైకొని సూటిగా రచన నిర్వహించినాడు. అరణ్యపర్వమునకు జీవగఱ్ఱలైన ఆ యుపాఖ్యానముల నన్నిటిని విడనాడుటలో నాతనియభిప్రాయ మేమైయుండునో సునిశ్చితముగా చెప్పలేము. కాని, నా యూహాకందిన కారణమిది; మూలకథను చదువుచున్నపుడుగాని, యితరులు చదువగా వినుచున్నపుడుగాని మధ్య నంతరాయ మెట్టిది కలిగినను పఠితకును శ్రోతకును ఉత్సాహము తగ్గిపోవుటయేగాక, అసలు విషయముగూడ స్మృతికి దూరమగును. ఉపాఖ్యానములు, ప్రధానకథాతంతువును నడుమనడుమ సడలింపజేయుచు, ముఖ్యవిషయమునుండి పాఠకుల మనసును మరలించి తమకైవసము చేసికొనును. అపుడు భారతకథావిషయమున గాక యుపకథలయెడనే మనసు మొగ్గును. ఈ లోపము లేకుండ పఠితహృదయమును శ్రోతలమానసములను ప్రధానకథమీదనే సంలగ్నము చేయనెంచి, తిమ్మయ యీ పద్ధతి నవలంబించియుండును. గ్రంథము క్లుప్తముగా ప్రధానకథాబోధకముగా రచింపవలయుననెడి తలంపుగూడ నిందులకు దోహదము చేసియుండును.

## ద్విపద భారతము-సోమన గడుసుపోకడ

అసలు, అరణ్యపర్వరచనయు, పఠనమును అశుభావహములని లోకములో నొకప్రవాదము గలదు, ఈ కారణముచేతనే చాలమంది పౌరాణికులు భారతకథాశ్రవణశ్రావణములలో నాపర్వమును సాధారణముగా పరిత్యజింతురు. నన్నయ మరణము అరణ్యపర్వరచనామధ్యమున జరిగినదనియు, అందులకు పై విషయమే కారణమైయుండుననియు పేర్కొనువారును గలరు. 'బహుశా', ఈయనుమానములకు లోగియే తిమ్మయ కూడ ప్రధానకథాకథనముతో ఆపద్యరచన యొనరించి ప్రాణము ఓగబట్టి వడివడిగా నయరణ్యమునుండి బైటబడియుండును. ఏమైననేమి. తిమ్మయ, అరణ్యపర్వమును ఉపాఖ్యానరహితముగా సగమునకు తగ్గించి, ముఖ్యకథాప్రధానముగా వ్రాసెననుట నిశ్చయము.

సోమన యాపర్వమును తిరుగవ్రాసినాడు. అందుపాఖ్యానములు లేకపోవుట యాతనిమనసునకు వెలితిగా తోచినది. కనుక వాని నన్నిటిని ద్విపదీకరించి తిమ్మయ రచనలో అక్కడక్కడ కూర్చి, ఎఱ్ఱాప్రెగ్గడ అరణ్యపర్వశేషమును నన్నయ పేరనే రచించినట్లు ఆరచన నంతను ఆతని పేర వెలయించినాడు. ఆవిధముగా తానొనర్చినట్లు ఆ పర్వము తుదిని "తిమ్మనార్యుడు విడిచినకథలు కూర్చివ్రాసితి" నని చెప్పికొన్నాడు.

కాగా, సోమన కర్ణపర్వాది మొత్తము పదునొకండు పర్వములనే గాక, తిమ్మయ రచితారణ్యపర్వమునుగూడ పూరించి ద్విపద భారతరచన సర్వాంగసుందరముగా గావించినాడన్నమాట.

ఇంతకును తేలిన సారాంశ మిది: తిమ్మయ నన్నయరచనను ఆదర్శముగా గొని, ఆదిపర్వాది ద్రోణపర్వాంతము మొత్త మారుపర్వములను స్వతంత్రముగ ద్విపదరచనలో వెలయించినాడు. సోమన, అటు తిమ్మయ స్వాతంత్ర్య పథమునగాని, యిటు తిక్కన కళాప్రపంచమునగాని కాలుపెట్టక, సుగమ మగు వేరొక బాట నేర్పరచుకొని, యిద్దరిరచనను అవసరమగు సంక్షేపరచన ననుకరించుచును, గడుసుపోకడలు పోవుచు, కర్ణపర్వము మొదలు తుదివఱకుగల పదునొకండు పర్వముల రచనను ప్రవాహరూపమున నేర్పుగా నెరవేర్చినాడు. మధ్య మిగిలిన సభాపర్వరచనమాత్రము తిమ్మయ అనుగ్రహముచే బాలసరస్వతి అయినదనిపించినాడు. ఇది యీ ద్విపదభారతచరిత్ర.

ఏవంవిధగుణమహితమగు ఈ మహాగ్రంథము నెల్లూరుమండలమునందు "ఉదయగిరి రాజ్యలక్ష్మికి పాదపీఠములై పరిఢవిల్లిన అత్తలూరు బట్టేపాడు" గ్రామములలో అవిర్భవించుటయు, అపర కవిత్రయ కర్తృకమగుటయు నను ఒకవిశేష మట్లుండ, ఇందలి ముగ్గురును చిల్లరమల్లర దేవుళ్లకు మ్రొక్కుబడులు చెల్లించుట, సుకవుల పొగడి కుకవుల దెగడుట, అతిశయోక్తులతో అభూతకల్పనలతో కృతిపతి కృతికర్తృ వంశావతారవర్ణన లొనర్చుట, గ్రంథరచనారంభమున పిచ్చిపిచ్చికలలు గాంచుట మున్నగు లేనిపోని 'చేదస్త' ములపొంత పోక, నమ్మినకులదైవతమును మనసార నొక్కమారు స్మరించి, గంటముపట్టి 'నేరుగా' కథ నందుకొని రచన సాగించుట గమనింపదగిన మరియొక విశేషము.

అన్నిటికన్న గుర్తింపదగిన వేరొకవిశేషము వీరి పదప్రయోగ చ్ఛందస్స్వాతంత్ర్యము. ఈ ద్విపద భారతకవులు ముగ్గురును తాము చేపట్టినది దేశిరచన యగుటచే గాబోలు కేవల లక్షణగ్రంథ విధేయులు గాక, తమకాలమున వాడుకలో నున్న దేశీయము పదములను పలుకుబడులను యథేచ్ఛగా నుపయోగించిరి. ఛందస్సులోగూడ స్వాతంత్ర్యమునే వహించిరి. ఒక్కమాటలో చెప్పవలయునన్నచో, 'భాష' 'ఛందము' ఈ రెండును వీరివాక్కు ననుసరించెనే గాని, వీరిగంటము మాత్రము వీనికి తలయొగ్గలేదు. ఇట్టి స్వచ్ఛందత మొత్తముపై ద్విపదకవుల కందరకును కలదందురేమో! నిజమే కాని, అందును, వీరతిస్వతంత్రులేమో యని తోచుచున్నది.

# మిస్ శామ్ తో

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

మును పేనాఁడొ మహీతనూజకయి మీ ముత్తాత శ్రీరాఘవుం
డనుపన్ వాయుజవమ్మునం జని అపారాంభోధిన్ దాటె నం
చును రామాయణ కావ్యమందు కనిపించుంగాని యిక్కాలపున్
మనుజుల్ బూటకమంచు నించుకయు నమ్మంబోరు తర్కించుచున్.

కాని యిటీవలే అమెరికన్ గణితజ్ఞశిఖామణుల్ "లిటిల్
జో" నిడి యేడుమైళ్ళ పరిశోధనకై నిను నంతరిక్షపున్
యానము సేయఁబంపుటయు, నత్యధికంబగు నొత్తిడిన్ రవం
తేనియు హాని లేక పయనించిన నీ కథ నమ్మరందరే?

మానవజాతి కంతటికి మర్కటమే తొలి ప్రాణియంచు వి
జ్ఞానపు శాస్త్రమందు పరిణామమతస్థుల వాదమే నిజం
బైన మనుష్యకోటి కొక యాశ చిగిర్చెను నంతరిక్షపున్
యానముసేసి తారకల నందుకొనంగలమంచు నీవలన్.

ఏవో ఆటలు నేర్చి బిచ్చమునకై
యింటింటికిన్ మిమ్ము గొం
పోవం దైతకలాడి ప్రేక్షకులకున్
మోదంబు చేకూర్చు మీ
కీ వైహాయస యాత్రకుం దగు తెగిం
పేరీతి ప్రాప్తించెనో
ఈ విడ్డూరము దేశదేశముల వ్యా
పించున్ యథార్థమ్ముగా.

[ఇటీవలి అమెరికన్ ప్రయోగమున మిస్ శామ్ అను కోతి యేడుమైళ్ళు "రాకెటు"లో పోయి సురక్షితముగా తిరిగివచ్చినదను వార్తను చూచి.]

# గయశాసనం జయశాసనం కాక మరేమి?

శ్రీ నేలటూరు వేంకటరమణయ్య

'గయ శాసనము జయ శాసన మెట్లు?' అను ప్రశ్నాత్మకమైన శీర్షిక క్రింద శ్రీ కె. హెచ్. వి. శర్మగారు 1959 డిసంబరు భారతిలో నొక వ్యాసమును ప్రకటించినారు. అది 1959 అక్టోబరు సంచికలో 'రాయల గయ శాసనము జయ శాసనమే' అను శీర్షిక క్రింద నేను వ్రాసిన వ్యాసమునకు జవాబు. శ్రీ శర్మగారు నుడివినట్లు 'రాయల గయ శాసనమును గూర్చిన చర్చ ఇప్పటికే చాల పెరిగినది;' నిజమే. కాని పరిశోధన చర్చ లిట్లే సాగును. వాని స్వభావ మట్టిది.

'పరిశోధన రంగమున ననేక పండితులు విమర్శకుల నాకర్షించి గయలో దొరికిన తదితర శాసనముల సాహచర్యమున నిదికూడా నట్టియాత్రికుల శాసనము (Pilgrims record) అని చాలమంది యభిప్రాయమై యుండగా, డాక్టరు వెంకటరమణయ్యగారు దీని కితర శాసనములతో ప్రమేయము లేదనియు అందులో చెప్పబడినట్లు అది విజయశాసనమే అనుచున్నారు.' అని శ్రీ శర్మగారు వారి వ్యాసరచన కుపక్రమించినారు. 'చాలమంది' యన నెందరో? నాకు దెలియ వచ్చినంతవఱకు ఈ శాసన విషయమును పరిశీలించి చర్చించినవా రిద్దరే. శ్రీ శర్మగారు ఒక్కరు, నేనొక్కడను. శ్రీ సుబ్బరామప్ప యను తెలుగుపండిత వర్యులను గూడ మా యిరువురతో చేర్చుకొనవలయు నేమో! మేము మువ్వురము దప్ప ఈవిషయమును చర్చించిన వారెవ్వరును లేరు. శ్రీ శర్మగారికి మఱి యెవ్వరైనను రహస్యముగ దెలియపఱచియున్నను ఉండవచ్చును. ఎందఱు శర్మగారి యభిప్రాయముతో నేకీభవించినను వారు చెప్పునది సమంజసము గాదని నాకు దోచినప్పుడు నా వ్యతిరేకతను వెలిపుచ్చుట తప్పుగాదు. రాయల గయశాసనము జయశాసనమేకాని శ్రీ శర్మగారును వారితో నేకీభవించువా రితరులెవ్వరైనను గలరేని వారును చెప్పునట్లు యాత్రికుల శాసనము (Pilgrims record) కాదనియు, గాజాలననియు జంకు గొంకు లేక నొక్కి వక్కాణింప సాహసించు చున్నాడను.

కృష్ణదేవరాయల గయశాసన పరిశీలన సందర్భమున పరిశోధకు లెల్లరును దృష్టిలో నుంచుకొనదగిన యట్టి చరిత్రాంశము లీక్రిందివి:

(1) ఆ శాసనము చెక్కియుండు స్థలము. గంగా నదిప్రాయకట్టు దేశమందలి గయలోని గదాధరేశ్వరుని గుడి.

(2) శాసనకాలము-శకాబ్దము 1444 నకు సరియైన వృషనామ సంవత్సర ఆషాఢ బహుళ త్రయోదశీ మంగళవారము అనగా క్రీ. శ. 1521.

(3) శాసనోక్తవిషయము. కృష్ణదేవ మహారాయలు వేయించిన 'విజయశాసనము' అని స్పష్టముగ నందే ప్రకటింపబడియున్నది ఇతరవిషయము లెవ్వియు నందు ప్రస్తావింపఁబడియుండలేదు.

(4) శాసనగ్రంథ రచయిత ముక్కుతిమ్మన. అతని పారిజాతాపహరణమందలి యాశ్వాసాంత పద్యమొక్కటి యం దుదాహరింపఁబడియున్నది.

(5) శాసనాంతమందు గంపరింపఁబడినశిల్పము.

శాసనోక్తవిషయమునుబట్టి చూడ శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1522 లో గంగాతీరదేశమున దండు చేసి యచట గయయందు స్వయముగ నొక విజయశాసనము నెత్తించెనని తెల్లము కుచున్నది.

కృష్ణరాయల గంగాతీరదేశదండయాత్రలను నతని సమకాలికుడును, నతనితోగూడ పెక్కుదండయాత్రలకు బోయినవాఁడును, నతని యాస్థానమందలి యష్టదిగ్గజకవులలో ప్రముఖుడునునగు నాంధ్రకవితా పితామహుఁడైన యల్లసాని పెద్దనార్యుఁడు తన మనుచరిత్ర పీఠికలో ప్రస్తావించియున్నాడు.

'అపంచగౌడధాత్రీతలం బెవ్వాని
కసివారుగా నేగునట్టి బయలు
నావాడపతి శకంధర సింధురాధ్యక్షు
లరిగాపు లెవ్వాని ఘనతరాసి'

ఆ పంచగౌడధాత్రీతల మనగా 'కన్నోజీ మొదలైనదేశము' అని మనుచరిత్ర వ్యాఖ్యాతలు తెల్పుచున్నారు. కన్నోజీదేశము గంగానదీతటమునం దుం

# మిస్ శామ్ తో

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

మును పేనాడో మహీతనూజకయి మా ముత్తాత శ్రీరాఘవుం
డనుపన్ వాయుజవమ్మునం జని అపారాంభోధిన్ దాటె నం
చును రామాయణ కావ్యమందు కనిపించుంగాని యిక్కాలపున్
మనుజుల్ బూటకమంచు నించుకయు నమ్మంబోరు తర్కించుచున్.

కాని యిటీవలే అమెరికన్ గణితజ్ఞశిఖామణుల్ "లిటిల్
జో" నిడి యేడుమైళ్ళు పరిశోధనకై నిను నంతరిక్షపున్
యానము సేయబంపుటయు, నత్యధికంబగు నొత్తిడిన్ రవం
తేనియు హానిలేక పయనించిన నీ కథ నమ్మకుందురే?

మానవజాతి కంతటికి మర్కటమే తొలిప్రాణియంచు వి
జ్ఞానపు శాస్త్రమందు పరిణామమతస్థుల వాదమే నిజం
బైన మనుష్యకోటి కొక యాశ చిగిర్చెను నంతరిక్షపున్
యానము సేసి తారకల నందుకొనంగలమంచు నీవలెన్.

ఏవో ఆటలు నేర్పి బిచ్చమునకై
యింటింటికిన్ మిమ్ము గొం
పోవం దైత్యకలాడి ప్రేక్షకులకున్
మోదంబు చేకూర్చు మీ
కీ వైహాయస యాత్రకుం దగు తెగిం
పేరీతి ప్రాప్తించెనో
ఈ విడ్డూరము దేశదేశముల వ్యా
పించున్ యథార్థమ్ముగా.

[ఇటీవలి అమెరికన్ ప్రయోగమున మిస్ శామ్ అను కోతి యేడుమైళ్ళు "రాకెటు"లో పోయి సురక్షితముగా తిరిగివచ్చినదను వార్తను చూచి.]

# గయశాసనం జయశాసనం కాక మరేమి?

శ్రీ నేలటూరు వేంకటరమణయ్య

'గయ శాసనము జయ శాసన మెట్లు?' అను ప్రశ్నాత్మకమైన శీర్షిక క్రింద శ్రీ కె. హెచ్. వి. శర్మ గారు 1959 డిసంబరు భారతిలో నొక వ్యాసమును ప్రకటించినారు. అది 1959 అక్టోబరు సంచికలో 'రాయల గయ శాసనము జయ శాసనమే' అను శీర్షిక క్రింద నేను వ్రాసిన వ్యాసమునకు జవాబు. శ్రీ శర్మ గారు నుడివినట్లు 'రాయల గయ శాసనమును గూర్చిన చర్చ ఇప్పటికే చాల పెరిగినది;' నిజమే. కాని పరిశోధన చర్చ లిట్లే సాగును. వాని స్వభావ మట్టిది.

'పరిశోధన రంగమున ననేక పండితులు విమర్శకుల నాకర్షించి గయలో దొరికిన తదితర శాసనముల సాహచర్యమున నిదికూడా నట్టియాత్రికుల శాసనము (Pilgrims record) అని చాలమంది యభిప్రాయమై యుండగా, డాక్టరు వెంకటరమణయ్యగారు దీని కితర శాసనములతో ప్రమేయము లేదనియు అంగులో చెప్పబడినట్లు అది విజయశాసనమే అనుచున్నారు.' అని శ్రీ శర్మగారు వారి వ్యాసరచన కుపక్రమించినారు. 'చాలమంది' యన నెందరో? నాకు దెలియ వచ్చినంతవఱకు ఈ శాసన విషయమును పరిశీలించి చర్చించినవా రిద్దరే. శ్రీ శర్మగారు ఒక్కరు, నేనొక్కడను. శ్రీ సుబ్బరామప్ప యను తెలుగుపండిత వర్యులను గూడ మా యిరువురతో చేర్చుకొనవలయు నేమో! మేము మువ్వురము దప్ప ఈవిషయమును చర్చించిన వారెవ్వరును లేరు. శ్రీ శర్మగారికి మఱి యెవ్వరైనను రహస్యముగ దెలియపఱచియున్నను ఉండవచ్చును. ఎందఱు శర్మగారి యభిప్రాయముతో నేకీభవించినను వారు చెప్పునది సమంజసము గాదని నాకు దోచినప్పుడు నా వ్యతిరేకతను వెలిపుచ్చుట తప్పుగాదు. రాయల గయశాసనము జయశాసనమే కాని శ్రీ శర్మగారును వారితో నేకీభవించువా రితరులెవ్వరైనను గలరేని వారును చెప్పునట్లు యాత్రికుల శాసనము (Pilgrims record) కాదనియు, గాజాలవనియు జంకు గొంకు లేక నొక్కివక్కాణింప సాహసించుచున్నాను.

కృష్ణదేవరాయల గయశాసన పరిశీలన సందర్భమున పరిశోధకు లెల్లరును దృష్టిలో నుంచుకొనదగిన గట్టి చరిత్రాంశము లీక్రిందివి:

(1) ఆ శాసనము చెక్కియుండు స్థలము. గంగానదిపాయకట్టు ప్రదేశమందలి గయలోని గదాధరేశ్వరుని గుడి.

(2) శాసనకాలము. శకాబ్దము 1444 నకు సరియైన వృషనామ సంవత్సర ఆషాఢ బహుళ త్రయోదశీ మంగళవారము అనగా క్రీ. శ. 1521.

(3) శాసనోక్తవిషయము. కృష్ణదేవ మహారాయలు వేయించిన 'విజయశాసనము' అని స్పష్టముగ నందే ప్రకటింపబడియున్నది ఇతరవిషయము లెవ్వియు నందు ప్రస్తావింపఁబడియుండలేదు.

(4) శాసనగ్రంథ రచయిత ముక్కుతిమ్మన. అతని పారిజాతాపహరణమందలి యాశ్వాసాంత పద్య మొక్కటి యందు దుదాహరింపఁబడియున్నది.

(5) శాసనాంతమందు గంపెరింపఁబడినశిల్పము.

శాసనోక్తవిషయమునుబట్టి చూడ శ్రీకృష్ణదేవ రాయలు క్రీ. శ. 1522 లో గంగాతీరదేశమున దండు చేసి యచట గయయందు స్వయముగ నొక విజయశాసనము నెత్తించెనని తెల్లమగుచున్నది.

కృష్ణరాయల గంగాతీరదేశదండయాత్రలను నతని సమకాలికుడును, నతనితోగూడ పెక్కుదండయాత్రలకు బోయినవాఁడును, నతని యాస్థానమందలి యష్టదిగ్గజకవులలో బ్రముఖుడునునగు నాంధ్రకవితా పితామహుఁడైన యల్లసాని పెద్దనార్యుఁడు తన మనుచరిత్ర పీఠికలో బ్రస్తావించియున్నాడు.

'ఆపంచగౌడధాత్రీతలం బెవ్వాని
కసివారుగా నేసనట్టి బయలు
నావాడపతి శకంధర సింధురాధ్యక్షు
లరిగాపు లెవ్వాని ఘనతరాసి'

ఆ పంచగౌడధాత్రీతల మనగా 'కన్నోజీ మొదలైనదేశము' అని మనుచరిత్ర వ్యాఖ్యాతలు తెల్పుచున్నారు. కన్నోజీదేశము గంగానదీతటమునం దుం

చుట యంత కతికినదే — కావున కృష్ణరాయలు గయ యందు వేయించిన విజయశాసనము నేతిబీరకాయ వంటిది కాదనియు, వాస్తవ విజయమునె సూచించు చున్నదనియు సమకాలికుఁడును ప్రాయశః 'ఆ పంచ గౌడదేశముల'మీది రాయల దండయాత్రలలో బాల్గొనినవాఁడును నైన పెద్దనార్యుఁడు సాక్ష్యము బల్కుచున్నాఁడు.

శ్రీ శర్మగారు రాయల గయ విజయశాసనములో జేర్కొనబడిన విజయము మిథ్యయని త్రోసిపుచ్చినారు; కాని ఆ శాసనము గయయందు నునికికి కారణమేమి? దాని నెవ్వ రేల అచట నెలకొల్పిరి? అను ప్రశ్నలకు వారు సమధానము చెప్పవలసివచ్చినది. అందుకొఱకు వారొక కథను కల్పనచేసినారు. ఆకథాస్వరూప మిది. కృష్ణదేవరాయలు తన పూర్వికులకు పుణ్యలోకావాప్తి కలిగించుట కొఱకు ముక్కు తిమ్మనార్యుని గయలో పిండము వేయ నంపెనట. అతఁడు రాయల యాదేశము ప్రకారము పిండము వేసెనో లేదో కాని తన్నేలిన ప్రభువుయొక్క గొప్పతనమును బ్రకటించుటకొఱకు మిథ్యావిజయమును ఒకానొకదానిని గల్పించి యొక యుద్ధశాసనమును వ్రా నిల్పెనట! కథ పసందుగనే కుదిరినది. కాని దానికి చరిత్రాత్మకమైన యాధారమెద్దియు గానరాదు. తమ కథను సత్యమైనదని నిరూపించుటకు శ్రీ శర్మగా రెన్ని యుపపత్తులను జూపినను, మరి ఎందఱు వారి కనుగుణముగ తాళము వేసినను కట్టుకథ కట్టుకథగనే నిలచినది కాని సత్యాత్మక చరిత్రాంశముగ పరిణామ మందలేదు; కావున ఇందలి సత్యాసత్యములను నిర్ధారింప దలపెట్టినప్పుడు ఎద్యది విశ్వాసపాత్రము? రాయల శాసనోక్తులును పెద్దనార్యుని మనుచరిత్ర వాక్యములా? లేక శ్రీ శర్మగారు రచించిన కట్టుకథయా? అను సమస్య యేర్పడినది. చరిత్ర పరిశోధకులెల్ల రంగీకరించు ఉత్తమ మార్గము ననుసరించి సమకాలికసాక్ష్యమే సరియైనదని గ్రహించి యాధునికులైన శ్రీ శర్మగారి కల్పితకథను త్యజించితిని. శ్రీ శర్మగారు తమ కథ చరిత్రాత్మకమైనదని శాసనాది చరిత్రాధారములను జూపి ఋజువుసేయునందాక యది సత్యమని యంగీకరింప వలనుపడదు.

ఇఁక శ్రీ శర్మగారు తమ వ్యాసమున చర్చించిన యన్యవిషయములను విచారింతము. వ్యాసమందు చాల భాగము కృష్ణరాయల గయశాసనము యొక్క తుది భాగమున గన్పట్టు శిల్పస్వరూప వివరణతో సరిపోయినది. ఈ చర్చ యంతయు వట్టి యాకదంపని చెప్పవలసి వచ్చినందుకు వగచుచున్నాను. నేను చెప్పని విషయములను చెప్పినట్లు వచించి నా యజ్ఞానమును అవివేకమును వెల్లడి సేయుటకొఱకు అనవసరమైన చర్చకు ప్రారంభించినారు. "డాక్టరు రమణయ్యగారు కృష్ణరాయల గయ శాసనమును వీరకల్లు (Hero stone) గా నిర్ధారణచేసినారు" అని చెప్పి యది వీరకల్లు కాదని తెల్పుటకు వీరకల్లు స్వభావమును వివరించినారు; కాని నేనెచ్చటను కృష్ణరాయలగయశాసనము వీరకల్లని నిర్ధారణ చేసియుండలేదు. అట్టితలంపు నాకు కలుగలేదు. శిల్పయుక్తములైన శాసనములెల్లను వీరకల్లు శాసనములు కాజాలవు. వీరగల్లు శాసనముల తీరు వేరు. నేను అభిప్రాయపడినట్లు శిల్పమాయుధపాణులసంఘట్టనమైనచో నది రాయలకు శత్రులతోనైన సంగ్రామమునందొక దృశ్యమును ప్రదర్శించును—లేక శ్రీ శర్మగారు వచించునట్లు మహిషాసురమర్దనియే యైనచో నది రణాధిదేవతయైన దుర్గ ప్రతిబింబము మగును—మా యిరువురి యభిప్రాయములలో నేది సరియైనను శాసనమందలి శిల్పము గణమును సూచించునే కాని పితాళ్ళ సుకృతార్థముగ జేసిన తీర్థయాత్రను సూచింపఁజాలదు. ఈ సందర్భమున శ్రీ శర్మగారు నేను నా పూర్వవ్యాసమున "సుకృతార్థముచేసిన తీర్థయాత్రను ప్రకటించుటయే యీ శాసనోద్దేశమైన నందు కత్తులు కటార్లతో యుద్ధము సేయు శిల్పముతో నేమిపని?" యని యడిగిన ప్రశ్నకు ఒక ప్రతిప్రశ్నతో సమాధానము చెప్పిరి — "మహిషాసుర వధలో దుర్గకు కత్తులు కటార్లు మొదలగు ఆయుధములతో గాక మరి దేనితో పని?" అని. ఇది కంట దుమ్ముజల్లి తమ పద్దును సాధించుటకొఱకు వేసిన ప్రశ్న. దుర్గకు కత్తులు కటార్లు మొదలైన యాయుధము లవశ్యములే. కాదని యెవ్వరును అనలేరు; కాని కత్తులు కటార్లు ధరించి మహిషాసురుని వధియించుచుండు దుర్గయొక్క ప్రతిబింబము రాయలపితాళ్ళ సుకృతార్థము ముక్కుతిమ్మనార్యుడు వ్రాయించెనని శ్రీ శర్మగారు చెప్పు శాసనములో నేల గండరింపబడినది? దుర్గాదేవి పితాళ్ళ యేలిక కాదుగదా? ఆమె గయాక్షేత్రమున కధిదేవత కాదుగదా? పితాళ్ళకు సుకృతమును జేకూర్చుటకు కత్తులు కటార్లు మున్నగు నాయుధములు సాధనములు కావుగదా? పితాళ్ళ సుకృ

# గయశాసనం జయశాసనం కాక మరేమి

తార్థము వ్రాయించిన శాసనమునందు మహిషాసుర మర్దని ప్రతిబింబ ముండ నేల ?

మఱియు శ్రీ శర్మగారు ప్రస్తుత వ్యాసమున నొక క్రొత్తయంశమును వెలువరించినారు. కృష్ణదేవరాయల గయశాసనమువలెనే "అచ్యుతరాయల గయశాసనమునందు కూడ ఇట్లే చీలికలుగ విభజింపబడి చెరియొక ప్రక్క పంక్తులు చెక్కబడి కలవు" అని తెలియపఱచినారు; ఇందుకు వారియెడ కృతజ్ఞత చూపవలసినదే. కాని యీ సువార్తను వీరు ప్రకటించిన పద్ధతి మాత్రము ప్రశంసనీయము గాదు నేను అక్టోబరు సంచికలో సదరు శిల్పములను గూర్చి వ్రాసిన వాక్యముల మధ్య దీనిని కుండలీకరించి చొప్పించినారు. చూడుడు:

"శాసనముయొక్క చివరి భాగము రెండు చీలికలుగ విభజింపబడియున్నది. ఎడమప్రక్క చీలికయందు 'వరనందన బాపదప్పువర గండ్డాంకా' యను పద్య పాదము లైదు చిన్న పంక్తులుగ నొకదానిక్రింద మఱియొకటి చెక్కబడినవి. కుడిప్రక్క 'యీ శాసనము ముక్కతిమ్మయ్యవ్రాసెను' అను వాక్యము ఎడమప్రక్క చీలికవలె నైదుపంక్తులుగ చెక్కబడియున్నది. (అచ్యుతరాయల గయశాసనమునందు గూడ ఇట్లే చీలికలుగ విభజింపబడి చెరియొక్క ప్రక్కపంక్తులు, చెక్కబడి కలవు) ఈ రెండు చీలికలనడుమ ఆయుధపాణులయిన పురుషులు ముగ్గురు నిలిచియుండునట్లు చెక్కబడియుండు శిల్పమొక్కటి కానవచ్చుచున్నది..." ఇత్యాది.

అచ్యుతరాయల శాసనమందును ఇట్టి శిల్పమే యున్నదని భ్రమగొల్పు నుద్దేశముతో వ్రాసిన వ్రాతయిది. అచ్యుతరాయల శాసనమునందు చీలికలుగ చెక్కబడినంత మాత్రమున నేమాయె - అందును ఇట్టి శిల్పముండినగదా యది ప్రసక్తమగును. వాస్తవముగనట్టి శిల్పమే యుండిన నా విషయమును స్పష్టముగ నేల చెప్పరాదు! దాగుడుమూత లేల? చీలికలున్నవని చెప్పి వానిమధ్య నేమికలదో చెప్పక శ్రీ శర్మగారు మౌనముద్ర వహించుట చూడగా శంక కలుగుచున్నది ఉన్నయెడల దాని స్వరూపమెట్టిది?

ఇంకొక చెణుకు. అక్టోబరు సంచికయందు నేను వ్రాసిన వ్యాసములో శ్రీ శర్మగారు అభిప్రాయపడినట్లు ప్రస్తావనయందున్న శిల్పము మహిషాసురమర్దనిదే యైనచో నది జైత్రయాత్రను సూచించునే కాని తీర్థయాత్రను సూచింపదు. ఏలనగా దుర్గాదేవత యుద్ధమున కధిదేవత కావుననే పూర్వము విజయనగర చక్రవర్తులేమి, తక్కిన హిందూభూపాలురేమి శరన్నవరాత్రములు సలిపి యుద్ధయాత్రలు వెడలువారు అని చెప్పినమాటలకు అపార్థమును గల్పించి ఇట్లు వ్యాఖ్యానము జేసినారు. "అంటే దశమి (విజయదశమి) నాడు దుర్గాదేవిని పూజించి శ్రీకృష్ణదేవరాయలు జైత్రయాత్రకు బయలుదేరియుండవలెననిగదా వారి యభిప్రాయము. కాని ఈ శాసనకాలము ఆషాఢ బహుళ త్రయోదశి మంగళవారమని అందే కలదు. కావున ఇదియు సరియైనది కాదు" అని దుర్గాదేవి రణాధిదేవత. ఈ యంశము పూర్వము విజయనగరచక్రవర్తులేమి తక్కిన హిందూభూపాలురేమి శరన్నవరాత్రములు జరిపి యుద్ధయాత్రలు వెడలు నాచారముకలన విదితముగనున్న దనుటయే నా వాక్యములందలి భావము. శరన్నవరాత్రములు జరిపిన పిమ్మట రాయలు గయాప్రాంతముపై దండునడిపినాడని నేను చెప్పలేదు.

ముక్కతిమ్మన నియోగిబిడ్డ. కృష్ణరాయ లతనిని తనకు బదులుగ గయలో శ్రాద్ధాదికర్మలను జేయుటకు పంపియుండడు. కృష్ణరాయలు తనకు మారు శ్రాద్ధాది కర్మలను నిర్వర్తించుటకొరకు వాస్తవముగ ప్రతినిధి నెవ్వరినేనియు బంపియుండిన వైదికునొక్కని బంపియుండును. నియోగిబిడ్డ నంపియుండడు. కావున శ్రీ శర్మగారిచే విరచితమైన తీర్థయాత్రాకథన మంగీకరింపదగినది కాదు-అని నేను అక్టోబరుసంచికలో వ్రాసిన దానికి ప్రత్యుత్తరముగ వారి మొదటికథను రివైసుచేసి "కథకు కాళ్లు లేవు, ముంతకు చెవులు లేవు" అన్నట్లు ఈ క్రిందివిధముగ పెంపకము జేసినారు.

డాక్టరు రమణయ్యగారు "ముక్కుతిమ్మన యొక్కడే గయకు వెళ్లి రాయల పితాళ్ళకు స్వహస్తములతో శ్రాద్ధాదికర్మలు నిర్వర్తించినట్లభిప్రాయ పడినట్లున్నారు. ఏకాలములోనైనా తీర్థయాత్రలు అంటే అనమమైదార్గురికి కాకుండ వెళ్ళరుకదా. (ఆవిషయము హొయిసళ నారసింగదేవుని శాసనమునుబట్టి స్పష్టము.) కావున ఆ వెళ్లినవారిలో నిజ (యెవ్వరికి?) పురోహితుడైన రంగనాథదీక్షితులు నుండవచ్చును. లేదా అట్టి విధ్యుక్తకర్మలు జరిపించుటకుగాను వైదికబ్రాహ్మణులు నుండవచ్చును. కేవల మిదే వృత్తిగా గయవద్దనుండే బ్రాహ్మణులేమైనారు? ఆ యాత్రికు లందరిలో మహాకవి ముక్కుతిమ్మన ప్రధానుడు. మఱియు శాసనము

వేయించినవాడు గనుక యాతని పేరు మాత్రము శాసనములో గలదు.”

తీర్థయాత్ర నొక్కడు సయితము చేయవచ్చును. ఐదార్గురుండవలయుననియే శాస్త్రనిబంధన యెందును లేదు. మ్రొక్కుబడే లేదనుచుండ నొక్క దాసరికైన పెట్టుమన్నట్లు తీర్థయాత్రయే నిరాధారమైన మిథ్యాకల్పన యనుచుండ నాతీర్థయాత్రలో వారు పాల్గొనియుండవచ్చును వీరు పాల్గొనియుండవచ్చును అని యూహాపై నూహలు సేయుటవలన శ్రీ శర్మగారి కల్పనాకథ సత్యమైన చరిత్రాంశము కాగలదా? గయయందు శాసనము వేయించినవాడు ముక్కుతిమ్మనగావున యాతని పేరు మాత్రము శాసనములో కలదు అనికదా శ్రీ శర్మగారనుచున్నారు. ఇది కేవలము మృష. శాసనము ముక్కుతిమ్మన వ్రాసెనే కాని వేయలేదు. కృష్ణదేవరాయాలు వేయించిన శాసనమని యందె స్పష్టముగ చెప్పియున్నది.

“డాక్టరు రమణయ్యగారు గయశాసనమందు ‘పితృస్మరణయే లేదు’ అని వ్రాసిచ్చిరి గదా. ‘ఈశ్వర నరసభూపురందర’ – అను పద్యములోని ఈశ్వర, నరసా నాయకులు కృష్ణరాయల తాత తండ్రులుగక మఱి యెవ్వరు?” అని శ్రీ శర్మగారి సవాలు. ‘ఈశ్వర నరసభూపురందర’ అనునది గయశాసనమున నుదాహరింపఁబడిన పారిజాతాపహరణములోని కృష్ణరాయ సంబోధనాత్మకమగు ద్వితీయాశ్వాసాంతమందలి పద్యభాగము. శ్రీ శర్మగారు పద్యపాదమును సంపూర్ణముగ నుదాహరింపక మరుగుచేసినారు. ‘ఈశ్వరనరసభూపురందరనందన’ అని సంపూర్ణ పద్యపాదము. ఈశ్వర నాయకుని పుత్రుఁడగు నరసభూదేవేంద్రుని కుమారుడవైన యో కృష్ణరాయా’ అని దీనియొక్క యర్థము. సప్రవరముగ కృష్ణరాయ లందు సంబోధింపబడినాడు. ఈ పద్యపాదమున కృష్ణరాయల తండ్రి తాతలు పేర్కొనబడి యుండుట వాస్తవమే. నేను ‘పితృస్మరణయే లేదు’ అనిన దానికర్థము పితృగణస్మరణయే లేదని. గయలో శ్రాద్ధకర్మచేసి పిండము వేయుట పితృగణముల నుద్దేశించి చేయు కర్మగావునను, కృష్ణరాయల గయ శాసనమున నట్టి శ్రాద్ధకర్మపితృగణ ప్రస్తాప మెందును లేకపోవుటవలన యట్లంటిని. సదరు శాసనము శ్రీ శర్మగారు వచించునట్లు కృష్ణరాయల పితరులను గయాముక్తులను జేసి యా విషయమును ప్రకటించుటకో అది వేయించినదగునేని అందు కృష్ణరాయలను సంబోధించుట యుచితమెట్లగును? అతఁడప్పటి కింకను సజీవుడై యుండెనుగదా. స్వర్గస్థుడై పెద్దలలో కలియు లేదు. ముక్కుతిమ్మ తీర్థయాత్రావృత్తాంతము శ్రీ శర్మగారికి దివ్యదృష్టిమూలమున దెలియవచ్చినట్లు తోచుచున్నది. ఏలనగా దాని కాధారము ప్రస్తుత చర్చలో నుండు గయశాసనమున లేదు సరికదా; మఱి యెందును లేదు. దివ్యదృష్టి యెంత ప్రశంసాపాత్రమైనను నది శాస్త్రపరిశోధనలలో సాక్ష్యముగ నంగీకరింపబడదు.

# ఉన్నవ పండిత ప్రశంస

శ్రీ గొట్టుముక్కల రమాకాంతాచార్యులు

శ్రీ రుచిరాంధ్ర సత్కవన శిల్పులు తిక్కన తాత తంత్రు, లే
యూర, స్వపాదపద్మముల నూని చరించిరి; నేఁడు గూడ నే
యూరు, స్వరాజ్య సంగర సముద్ధతికిన్ గుదు రాయె, నట్టి గుం
టూ రిల, నాంధ్రసాహితికి నుజ్జ్వలకేంద్రము యౌట యబ్రమే!

శ్రీనాథాంఘ్రి పరోన్నవాన్వయ సుధాసింధూద్భవుండైన ల
క్ష్మీనారాయణ పండితప్రవర! నీ పేర్జీవితంబెల్ల, వి
న్నాణం బొప్పఁగఁ దత్సరిన్ గడపి, వేన్ చాలించినాః వందె నీ
జ్ఞానం బుజ్జ్వల సాహితీభణితికిన్ గల్పించె నూత్నప్రభన్.

శ్రీరాములు నీ పిత, సీతారామయ నీదు మామ, తగ లక్ష్మీబాయ్
నారీమణి గృహిణి, సుతుని పే రర్జునుఁ డిట్లు యాత్రవెళ్లెను నీకున్.

యామలూరిపాడు గ్రామాన నీ జన్మ వసుధ గర్తపురము వాసభూమి,
ఆస్మదాదులెల్ల నాప్తుల మాబాల్య మందునుండి నీకు సఖులుమిత్ర!

ఈడునను బెద్దవాఁడవు నాఁడు మనము విద్య నేర్చునాఁటికి, నైనన్
పోడిమిఁ జూచితివి మమున్ దోడం బుట్టువుల ప్రేమ తొణికినలాడన్.

ఎపుడు స్మరించుచుందు, మన మెల్లర మొక్కెడ బాల్యమందు వం
గిపురము కృష్ణదేశికుని గేహమునన్ గురుసేవఁజేసి, త
త్కృపమెయి విద్యనేర్చి గడిదేఱిన నాఁటిదినంబుః లందు నీ
యుపకృతి, మాపయిన్ గలుగు నుజ్జ్వలమైన సతీర్థ్యభావమున్.

ఉన్నత నవభావములను మన్నించెడి వంశ మనెడి మర్యాదకు నీ
యున్నత జీవితమార్గము సన్నుతిఁగాంచెను గదయ్య సత్సంఘములన్.

రామచంద్రపురాగ్రహారమున, నల్ల చెఱువుగట్టుపైఁ గోనేటిదరిని వీచు
కరువలి యెఱుంగు నీ హృదంతరమునందు మెలఁగు నానాటి నీభావసరణులెల్ల.

సుచరిత్రుండవు నడవడిఁ బ్రచలితనవభావసరణిరతుఁడవు ప్రతిభా
రచితాంధ్రవాఙ్మయుండవు రుచిరస్మితనేత్రయుగళ రోచిష్ణుఁడవున్.

అగ్రహార శివాలయాత్యంతికమున ఆంధ్రభాషాసమాజంబునందు నాఁడు
ఆంధ్ర సాహిత్యమెల్లను నందుకొంటి మందఱమును విద్యార్థుల మైన యపుడె.

మల్లాది సోమయాజి సుహృల్లలితుఁడు కార్యదర్శి, యుద్ధాంధ్ర కళా
వల్లభుఁడు దేశికుఁడు మన కెల్లరకుఁ గృతజ్ఞతను స్మరించెద మెపుడున్.

తొలుత నుపాధ్యాయుఁడ వవ్వలఁ బ్లీడరు వయ్యుఁ బిదప బారిష్టరువై
ఇలఁ గీర్తిఁగాంచి, మఱి యుజ్జ్వలసాహితి రాజకీయ ప్రథ గంటివయా.

బారిష్టర్ పదవిన్ లభించుటకుఁగాఁ బాశ్చాత్య దేశంబునన్
స్వారాజ్యంబునకై పెనంగెడి మహీభాగంబు నైర్లండు నే
చేరంబోయితి వీవు తత్ప్రజలపై స్నేహాభిమానంబు లిం
పారన్, భారత జీవితప్రతిభ కీ వాదర్శప్రాయంబుగాన్.

గీతాధర్మము తత్ప్రదేశ బుధు లగ్గింపంగ, బోధించి వి
ఖ్యాతిం జెందితి వందుఁ బండితుల సంఘం బొండు స్థాపించి నీ
పూతంబైన చరిత్రచేఁ బ్రజల మెప్పుం బొంది, హిందూ ప్రజా
నీతిన్ నిల్పితి వన్యదేశమున నీ నేర్పున్ ఘనుల్ మెచ్చఁగన్.

తిక్కన భారతాంబుధి మథించి, తదీయ సుధారసంబు సొం
పెక్క సువర్ణభాండములఁ గెత్తి బుధాళికిఁ బంచిపెట్టి, నీ
వాక్కును సాహితీ సభల భాసిలఁ జేసి యశంబుగాంచి తీ
వక్కట! నీ స్మృతిన్ వగవ నట్టి బుధుండిల లేఁడు మిత్రమా!

నీ "మాలపల్లి"ఁ జూచిన, నీమతి వైభవము తెల్పు, నీ "నాయకురా"
లేమనఁ బురాతనసతీ! శ్రీమహిమ, స్వరాజ్య తంత్ర శీలము దెలుపున్.

కృతియాయ నల్లుడాయెను క్షితి దేశోద్ధారకుండు శ్రీ నాగేశుం
డతి దానశీల కర్ణుఁడు ప్రతిభానిధి, పత్రికాధిపతి రత్నంబున్.

ఆంధ్ర ప్రతాపశీల మితిహాసమునందుఁ బ్రసిద్ధి: దాన శ్రీ
గాంధి ప్రశాంత సంగరముఖంబున నీవు స్వరాజ్యలబ్ధికై
బంధుర రీతిఁ బోరి, "మన భారతవీరుఁడు భీష్ముఁడే జగ
ద్బంధు సమాన తేజుఁడ"ను ప్రస్తుతిఁ గంటి వమేయ శక్తిచేన్.

స్వాతంత్ర్యాహవవహ్నిలో నుఱికి, కృష్ణప్రాజ్యజన్మస్థలీ
భీతిన్ వీడి స్వరాజ్యముం బడసి, తృప్తిం బొందుటేగాక, వి
ఖ్యాతిన్ నీవు స్వతంత్ర రాష్ట్రమునకై యాంధ్రోద్యమంబందునన్
నీ తేజంబును జూపి, కొంటివి తుదిన్ నీయాత్మ సంతుష్టిగాన్.

## ఉన్నవ పండిత ప్రశంస

వనితలు నతురాస్యు లయి వర్ధిలునట్లుగ "శారదానికే
తన" మొకదాని గర్తపురి స్థాపనఁ జేసితి; వందు స్వీయ ల
క్ష్మిని నెలకొల్పి, తత్ఫలము మేరను మీఱ లభించి తృప్తిఁగాం
చిన కృతి వీవు: నీ యశము చేరని చోటిలలేదు మిత్రమా.

వినుత కళావిభూషణలు విశ్రుత తావక "శారదానికే
తన" నివసద్వధూటులు, కృతజ్ఞతఁ దండ్రినిఁ బోలెఁ గొల్వఁగా
నినుమది, నట్టిదృశ్యమున నీదు కృతార్థతఁ జూచి, మోదమం
దిన మహానీయు లెందఱో నుతింతురు నేఁటికి నీయదృష్టమున్.

భారతమన్న నీకుఁ గడుఁ బ్రాణము, పుత్త్రున కర్జునుండె యన్
పేరును బెట్టుకొంటి: విటు ప్రీతిని జూపిన కారణంబునన్
భారతభక్తి నిన్ను ఋజుపద్ధతి నిల్పెను: ఘోరమైన సం
సారము నిస్తరింపఁ గల సాధన చూపెను కృష్ణసంస్కృతిన్.

సకల మతంబులందు సరసంబగు సామ్యమతిం జెలంగియున్
అకలుషమైన చిత్తము వయః పరిపాకము నొందఁగా శ్రుతి
ప్రకటిత మార్గమందు మతి రంజిల, వేదశిఖాధ్యభావముల్
సుకరముగా గ్రహించి రసలోలుఁడవై తివి కృష్ణభక్తిచేన్.

వీరేశలింగయుగపున్ దారలలోఁ బ్రముఖమైన తారవు, హిందూ
స్వారాజ్య శాంతిసంగర శూరులలో మేటియైన శూరుఁడవు సుమీ.

చల్లా శేషగిరిన్ స్మరింపఁ దగు నా సఖ్యంబు నీ మిత్రుఁడు
ద్యల్లాభంబును నాంధ్రపత్త్రికకు సంధానించె నాంధ్రోద్యమ
ప్రోల్లాసంబున, మీపయిం గలదు దేశోద్ధారక ప్రేమ: దీ
వ్యల్లోకంబున కేగి రందు నిను సంభావింత్రు నాకంబునన్.

భారత రాజనీతి, ఋజుపద్ధతి దప్పక సక్రమోద్యమ
శ్రీరుచి ధర్మచక్రము పరిభ్రమణంబున సాధు జీవనా
ధారము నొంపకుండగ సదా జయమందెడు నట్లుగా మహా
ధీరులు నాకవాసులు పదింబది దీవన నీయగావలెన్.

# జాతీయవాదం: దుర్ఖీమ్

శ్రీ జాస్తి జగన్నాథం

[గతసంచిక తరువాయి]

విద్య అనేది జాతీయంగా ఉండితీరాలని దుర్ఖీమ్ వాదం. పాఠశాల అంటే చిన్నస్థాయిలో రాజకీయ సంఘమే; అలాగే చిన్న ఎత్తున కనిపించే సంఘం కూడ! యువకులతరాన్ని పౌరజీవితానికి అనువుగా తయారు చేయటం ఈ పాఠశాలల ప్రథమ కర్తవ్యం. మామూలుగా ప్రభుత్వ పాఠశాలలోనే బాలబాలికలు అధిక సంఖ్యలో ఉంటారు. అందుచేత ప్రభుత్వ పాఠశాలలు జాతీయ విధానాలకు సంగతుకంగా ఉండవలసి ఉన్నది. కులం, వర్గం, వృత్తి మొదలైనవాటి ఆధారంతో ఆయావ్యక్తులకు ప్రత్యేక పాఠశాలలు ఉండాలనటంలో ఇతని కేమాత్రం అభిప్రాయభేదం లేదు. ఇలా ఉండటం అత్యంతావశ్యకమనికూడ అంటాడు. కాని దానికంటె ప్రధానంగా కావలసినది, అందరకు ఒకేవిధంగా బోధించవలసినది ఒకటి ఉన్నదని అతని అభిప్రాయం. ఈ ప్రత్యేకలక్షణాలను అధిగమించిన కొన్ని సాధారణ సంప్రదాయాలు, భావాలు ఉన్నవి. వీటిని ప్రతిపాఠశాలలోను బాలబాలికల కందరకు నేర్పాలి. ఈ ఆశయాన్ని సాధించాలంటే విద్యావిధానం, విద్యాలయాలు ప్రభుత్వ నియమాలకు లోబడి ఉండాలని అతడు సూచించాడు.

సరే, ఈ సాధారణ సంప్రదాయాలు భావాలు ఏమిటి? వీటి లక్షణం ఏమిటి? ఎలా ఏర్పడుతున్నది? అనే ప్రశ్నలు వచ్చి సమాధానం చెప్పవలసివచ్చేటప్పటికి అతనివాదం నూతనరూపం దాలుస్తున్నట్లు కనిపిస్తుంది. ఈ సాధారణ సంప్రదాయాలు, భావాలు సంఘంలోని వ్యక్తులందరకు ఒకేవిధంగా ఉండవని, ఉండేటట్లు చూడాలనిగదా అతని అభిప్రాయం. ఎలాంటిభావాలు సర్వులకు సాధారణంగా ఉండగలవు? అన్న ప్రశ్నకు అతని సమాధానం చూడండి. విపరీతంగా పెరిగిపోయిన సమకాలిక సంఘంలో సంస్కృతి మాత్రమే సాధారణభావంగా, సంప్రదాయంగా మనగలదని అతని సమాధానం. జాతీయసంస్కృతిని అధిగమించి మానవసంస్కృతినిగురించి ఇతను నొక్కి చెప్పటం ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిన విషయం. అయినను అతను అంతగా ఆశించి ప్రతిపాదిస్తున్న జాతీయవాదం విలువ ఏమిటి? ఈభావం అతనికి కూడ తట్టింది. అందుచేతనే సంకుచిత జాతీయవాద విధానానికి కట్టుపడటం నాకు అభిమతం కాదని అన్నాడు.

ప్రజాస్వామ్యంలో క్రమశిక్షణ ప్రధానాంశం కనుక పిల్లలందరకు ముందు క్రమశిక్షణ విలువను, ప్రాధాన్యాన్ని గురించి బోధించాలి. న్యాయాన్ని ప్రేమించటం, శాస్త్రాన్ని హేతువాదాన్ని గౌరవించటం నేర్పాలి. ఈ లక్షణాలు లేనిపక్షంలో ప్రజాస్వామ్యం ఎక్కడాకూడ నిలవలేదని అతని అభిప్రాయం. పిల్లల విద్యావిధానం హేతుబద్ధంగా ఉండాలి దైవప్రసాదమని బోధించే అంధవిశ్వాసాన్ని ప్రబోధించే విద్యావిధానం పనికిరాదనికూడ చాటాడు. కాని వీటన్నింటికంటె ముందు సంఘంలో వ్యక్తులకున్న అనుబంధాన్ని గురించి పిల్లలకు బోధించాలంటాడు. ప్రజలలో సంఘటితత్వం ఉన్నప్పుడే ఏదేశమైనా బ్రతుకగలదని అతని విశ్వాసం. పరస్పరానుబంధభావాన్ని అభివృద్ధిచేయటానికి విద్య ఒక మార్గం. కాబట్టి పిల్లలకు ప్రేమించటాన్ని నేర్పటం, జాతిని అవగతం చేసికొనేటట్లు చూడటం, జాతి అనేది ఆయాకాలాలలోని మేధావుల విజ్ఞానసంపద అని వారు గుర్తించి అవసరమైతే వానికొరకు ప్రాణత్యాగం చేయటానికి కూడ సిద్ధపడేటట్లు చేయటం విద్యకు పరమార్థాలని అతని అభిప్రాయం.

ఇలాంటి సామూహిక జీవితానికి పాఠశాలతరగతి మంచి శిక్షణ కలపాలని అతడు విశ్వసించాడు. తరగతికి కూడ కొన్ని లక్షణాలు సంప్రదాయాలు, అలవాట్లు ఉండాలి. వాటిలో తరగతి పరాపేక్షణలేని సంపూర్ణ సంఘంగా తయారు కావాలి. తరగతి గౌరవాన్ని గురించి, తరగతి బాధ్యతనుగురించి పిల్లలకు

ప్రబోధించటం ద్వారా ఉపాధ్యాయుడు వారిలో సామూహికతత్త్వాన్ని ఉద్దీపింప చేయవచ్చు. ఆ తరగతి సాధించిన విజయాలను, గౌరవాలను గత విద్యార్థుల విశేషాలను చరిత్రవలె ఒక గ్రంథంగా పొందుపరచి ఆ గ్రంథాన్ని విద్యార్థులకు అందుబాటులో ఉంచి దాని ప్రాశస్త్యాన్ని గురించి పిల్లలకు బోధించే పద్ధతిలో వారిలో ఒక సమైక్యభావం ప్రత్యేకజాతీయత ఏర్పడగలదని అతడు సూచించాడు. పట్టభద్రులసంఘాలను స్థాపించటం ద్వారా పాఠశాలలోనే కాక ఇలాంటి కృషి బడికి బయటకూడా సాధ్యమవుతుందని చెప్పాడు. ఇదంతా చూసిన తరువాత దుర్ఖీమ్ భావంలో విద్య అంటే ఏమిటి? అని సందేహం కలుగుతుంది. వ్యక్తిని జాతీయకరణ చేయుటమో లేక సాంఘికీకరణగా ఎంచటమో విద్య అని దుర్ఖీమ్ అభిప్రాయం అనిపిస్తుంది. ప్రాచీనకాలపు ఏథెన్సు, స్పార్టా, రోములలోవలె మంచి ఎథీనియన్ను, మంచి రోమన్ను తయారుచేయుటకు విద్య పరమార్థంగా భావించవలసివస్తున్నది. ఇతని భావాల సారాంశం ఇంతకంటె భిన్నంగా ఉన్నదా?

ప్రణాళికలో పరస్పర విరుద్ధాంశాలు కూడ ఉన్నవి. మానవసంస్కృతికి ప్రాధాన్యం ఇచ్చి, న్యాయాన్ని ప్రేమించటం, శాస్త్రాన్ని హేతువాదాన్ని గౌరవించటం నేర్పాలని చెప్పినవాడు అంతతో ఆగలేదు. పిల్లలమనస్సుని శరీరాన్ని కూడ బంధించి ఒకమూసలో పోయమన్నాడు. వీటిరెంటికి పొత్తు ఎట్లా కుదురుతుంది? శాస్త్రానికి, హేతువాదానికి నిరంతర పరిశీలన, ప్రశ్నపరంపర ఆధారం. ఇతడు తన విద్యావిధానానికొక చట్రం తయారుచేసి దానిలో బంధించాడు. ఇక పరిశీలనకు, ప్రశ్నించి తర్కించి తెలిసికొనటానికి అవకాశమెక్కడున్నది?

పైగా విద్యను జాతీయం చేయమంటున్నాడు. విద్యావిధానం మీద, విద్యాలయాల మీద ప్రభుత్వ నియమనిబంధనలు అవసరం అన్నాడు. వ్యక్తిత్వం చంపి వ్యక్తిని సాంఘికీకరణ చేయమని చెప్పిన దుర్ఖీమ్‌కి ఇదొక పెద్ద విషయం కాదు కాని విద్యను జాతీయం చేసినందువల్ల రాగల ఫలితాలు ప్రపంచం రుచిచూసింది. శ్రామికరాజ్యం పేరుతో, జాతీయ సామ్యవాదం (నేషనల్ సోషలిజం) పేరుతో ఈ పని చేసిన రాజ్యాలలో ఏమి జరిగిందో మనం చూచాం. విద్యావిధానాన్ని జాతీయం చేసి ప్రభుత్వ నియమ నిబంధనలకు లోబరచినా ప్రభుత్వం జాతిశ్రేయస్సు కోసమే కృషిచేస్తుంది, సరైనమార్గాన్నే చూపిస్తుంది అన్న నమ్మకం ఏమిటి? ప్రభుత్వంలో దుర్ఖీమ్ వంటి మేధావులకు స్థానం లభిస్తుందని నమ్మటం ఎలా? విజ్ఞత లోపించిన ప్రభుత్వాలే ఎక్కువగా అధికారంలో ఉండటం చూస్తూ మేధావుల రాజ్యంగా దాన్ని భావించటం ఎలా? ఇతని దృక్పథంలో సైనిక శిక్షణకు విద్యకు భేదం లేకుండా పోయింది.

ఏమైనప్పటికి ఒకటిమాత్రం నిజం. ఇతని జాతీయవాదం నిలబడాలంటె ఇతని విద్యావిధానం తప్పనిసరి. ఇటీవలి చరిత్రలోని ఫాసిస్టు రాజ్యాలే ఇందుకు తార్కాణం. ఈ సంకుచిత విద్యావిధానం ద్వారా ఆలోచనా ప్రవాహాన్ని, పరిశీలన దృక్పథాన్ని హేతువాదాన్ని అరికట్టకపోయినట్లయితే జాతీయవాదం గాలిలో ఎగిరిపోక తప్పదు. దుర్ఖీమ్ ప్రతిపాదించిన విద్యావిధానాన్ని నేటి విద్యావేత్త లెవరూ ఆమోదించరు; ప్రజాస్వామ్యవాదులు అంతకుముందే అంగీకరించలేదు

కుటుంబప్రయోజనాలకంటె జాతీయప్రయోజనాలు, ఆదర్శాలు ప్రధానమని, జాతీయాదర్శాల ముందు కుటుంబప్రయోజనాలు నశించినా ఇబ్బంది లేదని అతనిభావం. దీనికి అతడు చూపించిన కారణం ఒక్కటే. కుటుంబంకంటె జాతి పెద్దసంఘం కనుక ఉత్తమవ్యవస్థ కనుక కుటుంబప్రయోజనాలు దెబ్బతిన్నా పరవాలేదని చెప్పాడు. అదేవిధంగా జాతీయాదర్శంకంటే మానవాదర్శం గొప్పది. దీనికి కారణం మానవత్వంకంటే జాతి తక్కువది కావటమే. విశ్వమానవసంఘం ప్రపంచంలో ఇంతవరకులేదు. కనుక దానికొక ప్రత్యేకాత్మ వ్యక్తిత్వం లేవని అతడు తేల్చాడు. అందుచేత జాతిమాత్రమే పరమోత్కృష్ట స్థానం ఆక్రమించగలదని చెప్పాడు. ఇంతవరకు ఏర్పడిన సంఘాలలో జాతీయరాజ్యమే పెద్దసంఘమని, సుసంఘటితమైనదని అతని విశ్వాసం. అతని కాలానికే కొద్దిగానో గొప్పగానో అంతర్జాతీయసంబంధాలు ఏర్పడి జాతీయత సడలిపోతున్న సూచనలు కానవచ్చినవి. కాని సమకాలిక జాతీయసంఘాలు విచ్ఛిన్నమై వృత్తిసంఘాలరూపంలో కొత్త జాతీయత ఏర్పడగలదని అతడు ఊహించాడు. అంతేకాని జాతీయవాదం పూర్తిగా తొలగిపోయి మానవత్వం ఆధారంగా విశ్వమానవసంఘం ఏర్పడటం సూత్రాలలో తప్ప ఆచరణలో అసంభవం అని అతనిఊహ. ఈ ఊహకు ఆధారం ఏమిటి అంటె సమాధానం లేదు. మానవసంస్కృతిని గుర్తించిన తరువాత విశ్వమానవ సమాజం ఆవిర్భవించ

గలదని విశ్వసించటంలో తార్కికంగా అభ్యంతరం ఉండనవసరం లేదు.

ఇక్కడ ఒక సందేహం వస్తున్నది. జాతీయాదర్శాలకోసం కుటుంబ ప్రయోజనాలు బలి అయినా ఇబ్బందిలేదని ఇతడు అంటున్నాడు. ఇది అసంభావ్యం. జాతికి సంస్కృతి మూలం అని, సంఘంలోని వ్యక్తుల మధ్య అనుబంధాలు ఏర్పరచి వారిని సుసంఘటితం చేయాలని ఇతడు చెప్పినాడు గదా! లోకంలో ఇంతవరకు ఎన్ని సంఘాలు వచ్చినా కుటుంబం అంతటి సుసంఘటిత సంఘం, అనుబంధాలు ఏర్పడలేదు. నిజమైన ప్రేమకు, అనుబంధాలకు, సంఘటితత్వానికి కుటుంబమే మూలం. కుటుంబ సంబంధాలు, ప్రయోజనాలు విచ్ఛిన్నమైపోయిన పాశ్చాత్య సంఘాల పోకడలను మనం చూస్తూనే ఉన్నాం. ఎలాంటి సహకారానికైనా, సంఘటితత్వానికైనా, సంస్కృతికైనా కుటుంబానుబంధాలను కొనసాగించుకొనటం అవసరం. అవి ప్రాథమిక కూడలులు. వాటిని విచ్ఛిన్నంచేసి మరేదో సాధించగల మనుకోవటం భ్రమ.

ఆలోచనలలో తప్ప ఆచరణలో గోచరించని విశ్వమానవసంఘం కోసమని వాస్తవంగా కనిపిస్తు భౌతికంగా ఉనికిగల సంఘాన్ని త్యజించి బలిచేయటం కంటె జాతీయసంఘ పరిధిలోనే మానవాదర్శాలను సాధించుకోవాలని దుర్ఖీమ్ భావించాడు. కాని ఇదే సూత్రాన్ని అతని జాతీయవాదానికి అనువర్తింప చేసి ఎందుకు చూడకూడదు? విశ్వమానవ సంఘం ఆలోచనలలో తప్ప లేదని, రాదని ఆయన నమ్మకం గదా! అలాగే జాతీయవాదం కూడ ఉనికి లేనిది, వాస్తవరూపం లేనిది అంటె సమాధానం ఏమున్నది? జాతీయవాదం అనేది భావాలలో ఉండటం తప్ప భౌతికమైన ఉనికి దానికి లేదుగదా! మరి భౌతికమైన ఉనికి ఉండి చీమునెత్తురుగలిగి సొంత ఆలోచనలతో విహరించగల సజీవ వ్యక్తిని ఈ ఆలోచనా సాధిత జాతీయవాదం కోసం బలిచేయమనటంలో ఉన్న విజ్ఞత ఏమిటి? జాతీయవాదానికి ఉనికి ఉన్నదని నిరూపించటానికి దుర్ఖీమ్ ప్రయత్నించాడు. కాని ఎంతవరకు సఫలీకృతుడయ్యాడో యోచించాలి. అతడు స్థాపించిన ఉనికి ఆధారం లేనిదైన పక్షంలో ఈ జాతీయవాదం ఎక్కడ నిలబడుతుంది? పాఠకులు జాగ్రత్తగా ఆలోచించవలసిన విషయం.

ఇరుగుపొరుగు రాజ్యాలతో విరోధం పెట్టుకొని వాటిని తమదేశంలో విలీనం చేసికొని సరిహద్దులను విస్తరించుకొనటానికి ప్రయత్నించేకంటె సరిహద్దుల లోపలి సాంఘిక స్థితిగతులను అభివృద్ధి చేసికోవటానికి ప్రతి రాజ్యము కూడ తన దృష్టిని కేంద్రీకరించాలి. ఇది జరిగినప్పుడు జాతులమధ్య ఎలాంటి వైరుధ్యానికి అవకాశం ఉండదు. మానవాదర్శాలకు జాతీయాదర్శాలకు అప్పుడు భేదంకూడ ఉండదు. మానవాదర్శాలు జాతీయాదర్శాలు ఏకమైపోతవి. ఆ స్థితిలో ప్రతి జాతీయరాజ్యము మానవత్వాన్ని గురించిన ఒక విశిష్ట దృక్పథంగా తయారవుతుంది.

ఇంతా దుర్ఖీమ్ ఎందువల్ల చెప్పవలసి వచ్చింది? దీనికి అతని పరిశోధనలలో ఏమైనా ఆధారం ఉన్నదా? అనే ప్రశ్నలకు సమాధానం వెతకాలి. ఇతరులమీదకు దాడి వెడలకుండా సొంత స్థితిగతులను బాగుచేసికోవాలన్నాడు, బాగానే ఉన్నది, కాని ఈ సలహాకు ఆధారం ఏమిటి? ఇది జాతి లక్షణమా లేక జీవలక్షణమా లేక హేతుబద్ధమా? కొన్ని కొన్ని భావాలకు అతడు ఆధారాలు చూపించాడు. దీనిని సలహాగా ధర్మసూక్తిగా ప్రవచించాడు. అంతకు తప్ప ఈ సలహాకు సాక్ష్యం చూపలేకపోయాడు. జాతుల మధ్య వైరుధ్యాన్ని గురించి ప్రస్తావించటంలో ఒక రహస్యం ఉన్నది. జాతి సుసంఘటితం కావాలన్నా, సజీవంగా నిలబడాలన్నా ఆ జాతిలోనివారిని ఎప్పటికప్పుడు పునరుద్దీపితం చేస్తుండాలని, దానికి జాతి విశిష్టత గౌరవం గురించిన ప్రబోధం మార్గమని చెప్పాడుగదా! మరి ప్రతిజాతికి తనదే విశిష్టత, తనకే గౌరవం అన్న అహంకారం బలిసినప్పుడు ఉచ్చనీచభావాల సహజంగా కలిగి తీరుతాయి. ఉచ్చనీచ భావాల ప్రవేశానంతరం వైరుధ్యం తప్పదు. కనుక జాతీయవాదం యుద్ధాలకు దారితీయకుండా ఉండాలంటె ఇతడు చూపించిన అంగీకార యోగ్యమైన మార్గం కనిపించటంలేదు. జాతియైక్యము సాధించటం కోసమని ఆ జాతిని పొగిడి పొగిడి సింహాసనం ఎక్కించి చివరకు అంతా సమానమే, నీవు ఇతరులమీదకు దాడి వెడలరాదు అన్న సలహా చెప్పితే అది అంటుతుందా! చిన్నప్పటి నుంచి తలకెక్కిన అహంకారం ముందు ఈలాంటి సలహాలకు ఏపాటి స్థానముంటుంది?

# జాతీయవాదం: దుర్ఖీమ్

దుర్ఖీమ్ యూదు. 19వ శతాబ్దాంతంలో ఫ్రాన్స్‌లో యూదు వ్యతిరేకోద్యమం తీవ్రంగా సాగింది. కాని అంతమాత్రం చేత అతని మనసు విరగలేదు. అతడు నిలువెల్లా ఫ్రెంచి దేశభక్తుడు. మానవుడు తనకు సంబంధించిన ప్రతిసంఘంలోను ఇంచుమించు ఐక్యం అయినంతగా పాల్గొంటె తప్ప సంపూర్ణుడు కాలేడని అతని విశ్వాసం. కుటుంబం, స్థానిక సంఘం రాజకీయబాంధవ్యం, మతం, మానవత్వం వంటి వాటిలో మానవుడు ఐక్యం కాగలగాలి. అప్పుడే అతడు పరిపూర్ణుడు కాగలడు. కాని వీటి అన్నింటిలోను రాజకీయ సంఘానికి, మతానికి ఐక్యం కావటం ప్రథమావసరం అని నిర్ణయించాడు. ప్రాంతీయాభిమానాలనుగురించి, రాష్ట్రీయభక్తినిగురించి దుర్ఖీమ్ ఏమీ ప్రస్తావించక పోవటం గమనించవలసిన విషయం. రాష్ట్రాలు, జిల్లాలు అదృశ్యమవుతాయని అతని ఉద్దేశం కాదు. కాని ఈ [illegible]లు కృతకాలని అతని భావం. రాష్ట్రీయోత్తేజం నశించి పోయినదని అతడన్నాడు. అతని వ్యక్తిగత జీవితంలో కూడా ఇదే కనిపిస్తుంటుంది. తన రాష్ట్రం పై ప్రత్యేకాభిమానం ఉన్నట్లు ఎక్కడా నిదర్శనం దొరకదు.

దుర్ఖీమ్ చెప్పే దేశభక్తి సిద్ధాంతంకూడా అతనికి మానవజాతిపైగల అభిప్రాయాలకు సంఘంలో వ్యక్తికి అతడిచ్చే స్థానానికి అనువుగానే ఉంటుంది. జాతికోసం సర్వం అర్పించి కృషిచేయగల ఉత్తేజం వ్యక్తికి కలగాలంటె ఆధ్యాత్మికీకరణ కావించబడిన దేశభక్తి తగిన ఆదర్శాన్ని అందీయగలదని అతని విశ్వాసం. జాతీయాధ్యాత్మికతనుంచే వ్యక్తి తనలోని ఉత్తమత్వాన్ని పొందగలుగుతున్నాడు. కనుక ఎట్టి పరిస్థితులలోనైనా ఆత్మత్యాగం చేసిఅయినాసరే తనకు ఉత్తమత్వాన్ని ప్రసాదించిన ఆ జాతీయాధ్యాత్మికతను రక్షించటానికి పూనుకోవటం అతనివిధి. తోడి సోదరులు దారిద్ర్యంలో క్షీణిస్తు ఆకలితో అలమటిస్తు అష్టకష్టాలు పడుతుంటె వారినిచూచి బాధపడనివాడు, వారి బాధలో పాలుపంచుకోనివాడు నిజమైన దేశభక్తుడు కాలేడని దుర్ఖీమ్ ఎలుగెత్తి చాటాడు. దీనికి కారణం అతనిలోని మానవత్వం కరుణానుకంపన తప్ప సైనిక నియంతృత్వం వంటి జాతీయవాదం కాదు, దేశభక్తి కాదు, తన సంఘంలోని స్థితిగతులను బాగుపరచి తన సోదరుల సౌఖ్యంకోసం పాటుపడటం ప్రతి దేశభక్తునికి ప్రాథమిక కర్తవ్యమని అతడు నిర్వచించాడు.

కాని యుద్ధం ప్రారంభంకాగానే దుర్ఖీమ్‌లో ఎంతో మార్పు కానవచ్చింది. అతని ఆవేశపూరిత జాతీయవాదం సుసంఘటితత్వం వాస్తవరూపందాల్చి గోచరించినవి. ఫ్రాన్సు రూపుదాల్చిన సత్యధర్మమూర్తి అని విశ్వసించటానికి అతనికి ఏఅడ్డంకులు రాలేదు. అంతకుముందు జర్మన్‌జాతిపై అతనికి కొంత విశ్వాసం ఉంటు వచ్చినప్పటికి ఈ సమయంలో మాత్రం జర్మనీ అంటె మూర్తీభవించిన దౌష్ట్యం, అపమార్గం అని ప్రజలను నమ్మింపచేయుటానికి ఎంతో కాలం పట్టలేదు. జాతీయ రాజ్యంకోసం దేశప్రజలు ప్రాణాలు అర్పించినా నష్టంలేదని ప్రజలను ఉత్తేజితులను చేయుటంలో అతనికి ఎలాంటి అవరోధము కనిపించలేదు.

మతానికి దుర్ఖీమ్ ఇచ్చిన వ్యాఖ్యానం చాలకొత్తది. జాతీయవాదాన్నే ఒక మతంగా చేయ సంకల్పించిన వారికి ఈ వ్యాఖ్యానం కొంత పని పెడుతుంది; ఆలోచనకు పురికొల్పుతుంది. ఇతడు మతంకంటె జాతికి ప్రాధాన్యం ఇయ్యటంకూడ గమనించవలసిన విషయాలలో ఒకటి. నైతికంగా ఆధారం లేకుండ అనుబంధంలేకుండ బాధపడుతున్న వ్యక్తిలోనూ తనశక్తి సామర్థ్యాలను ఉత్తేజాన్ని కలిగించటానికి తగినంత విశ్వవ్యాప్తమైన మతం అసంభవమని ఇతడు తేల్చాడు. న్యాయానికి అతనిమనసులో జాతీయవాదంకంటె మానవాదర్శమే ఎక్కువగా మెదిలినట్లు సూక్ష్మ పరిశీలన చేసినవారికి గోచరించకపోదు.

ఆస్ట్రేలియన్ తెగల పూజ్యచిహ్నం గురించి చెపుతు ఒకేచిహ్నం వారికి దైవంగాను, పతాకంగాను ఉపయోగించినదని ఇతడు అన్నాడు. దీనినిబట్టి మతానికి జాతీయవాదానికి ఉన్న సంబంధం గ్రహించటానికి అవకాశం ఏర్పడుతున్నది. అంటె దేవుడు, జాతి అన్నది ఒకటే నన్నమాట. ఆ తెగ తనను తానే పూజించుకొంటున్నదన్నమాట; వారి మతంవెనుక వాస్తవంగా ఉన్నది సంఘం మాత్రమే నన్నమాట. అయినప్పుడు జాతీయవాదం మాత్రం ఒక మతం ఎందుకు కాదు? జాతీయతకు జెండా అత్యంతావశ్యకమని అతడే చెప్పాడు. ఆ పతాకాన్ని గౌరవభావంతో ఆరాధించటం నేర్పాలన్నాడు. ఈ పతాకం వంటి కనిపించే చిహ్నం కదా! ఇది జాతి అనే దేవుని

చిహ్నంగా ఎందుకు మారరాదు? మారకుండ ఉంటుందని విశ్వసించటానికి ఆధారం ఏమిటి? మారుతుంది; అలా మారినప్పుడు జాతీయవాదంకూడ మతం అయి కూర్చుంటుంది. దేవునిముందు మోకరిల్లినట్లుగానే మానవుడు సామూహికత్వం ముందుకూడ మోకరిల్లినప్పుడు జాతి ముందుకూడ అదే పూజ్యాభావంతో ఉత్తమ సామూహికపుకూడలి అన్న ఉద్దేశంతో మోకరిల్లటం ఎందుకు జరగదు? జరుగుతుంది; జాతిముందు మోకరిల్లేవారికి, మత చిహ్నమైన దేవునిముందు మోకరిల్లే వారికి భేదం ఉండదు. ఈ విషయాన్ని దుర్ఖీమ్ కూడ చెప్పాడు.

క్రీస్తు జీవితంలోని ప్రధాన దినాను పర్వదినాలుగా భావించి చేసికొనే పండుగలలో పాల్గొనే వారికి జాతీయ జీవితంలోని ప్రధాన ఘట్టాలను ఉత్సవంగా జరుపుకొనేవారికి ప్రధాన భేదాలేమీ గోచరించలేదని ఈతడే తన సాంఘికశాస్త్ర పరిశోధనలో వెల్లడించాడు. కనుక మతానికి జాతీయవాదానికి చెప్పుకోతగ్గంత తేడాలేదు. కాబట్టి దుర్ఖీమ్ రచనలనుబట్టి జాతిని దైవంగా చేయటానికి, జాతే దైవం కాగలగటానికి ఎలాంటి అభ్యంతరం కనిపించదు. జాతీయవాదం ముదిరినప్పుడు ఇది వాస్తవమే అని కూడ చరిత్ర రుజువు చేసింది. దుర్ఖీమ్ సాంఘిక శాస్త్రంలో కొన్ని సూత్రాలు ఏర్పాటు చేసికొన్నాడు. వీటిలో సాంఘిక నియతివాదం ప్రధానమైనది. ఈ సాంఘిక నియతివాదంతో ప్రారంభించిన దుర్ఖీమ్ జాతీయవాద తత్త్వశాస్త్రం ఈ రూపం దాల్చటంలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

దుర్ఖీమ్ ప్రతిపాదించిన జాతీయవాదం ఎంతకాలం నిలుస్తుంది? అనే ప్రశ్నకు సమాధానం చెప్పాలంటె అతని మూలభావాన్ని వివరించుకొంటె చాలు. అసలు జాతీయవాదం ఎంతవరకు అంగీకారయోగ్యం? అన్న ప్రశ్నకూడ లేకపోలేదు. దీనికి కూడ అతడు జాతీయవాదానికి పునాదిగా చెప్పిన అంశాలను పరిశీలించవలసి ఉన్నది. అతని అభిప్రాయంలో జాతీయవాదానికి మూలం సంస్కృతి. ఈ సంస్కృతి స్వరూపాన్ని గమనించకలిగితే మన ప్రశ్నకు సమాధానాలు వస్తవి.

సంస్కృతి అంటె ఏమిటి? అనే ప్రశ్నను చర్చించటం ఇక్కడ మనపని కాదు. దీని స్థూలరూపం తెలిసికొంటె చాలు. దుర్ఖీమ్ చెప్పిన ప్రాథమిక సూత్రాలను అంగీకరింపు చేసికొంటె చాలు. కొన్ని విశ్వాసాలు, సంప్రదాయాలు, ఆచారాలు, సంస్థలు కలిస్తే సంస్కృతి ఏర్పడుతుందని అతడు అన్నాడు కదా! ఈనాటి ప్రపంచంలో ఈ విశ్వాసాలకు సంప్రదాయాలకు అడ్డుగోడలు ఉండటం లేదు. ఎక్కడ ఏమిజరిగినా ప్రపంచం మొత్తానికి తెలుస్తున్నది. ప్రపంచం మొత్తం ఈ నూతన పరిణామాల ప్రభావానికి గురి అవుతున్నది. ఇలాంటి పరిస్థితులలో నేను వేరు. నా సంస్కృతి వేరు అని మడికట్టుకొని కూర్చుంటటానికి వీలులేదు. భిన్న భిన్న సంస్కృతులకు అవకాశం లేదు. మానవజాతి మొత్తానికి కళ్యాణాన్ని ప్రసాదించగల మానవ సంస్కృతికి మాత్రమే అవకాశం ఉన్నది.

మరొక విషయంకూడ ఉన్నది. కొన్ని దేశాలు మనదేశంవంటివి సంధియుగంలో ఉన్నవి. ఇక్కడి ప్రజల సంస్కృతులలో అనంత వ్యత్యాసాలు గోచరిస్తున్నవి. ఒక కుటుంబంలోని వారిలోనే భిన్నభిన్న విశ్వాసాలు, అలవాట్లు ఉంటున్నవి. పూర్వాచార పరాయణులు, అతినవీనులు, అటూ ఇటూ కానివారు అందరూ ఒకేకుటుంబంలో ఉంటున్నారు. వీరందరిది ఒకే సంస్కృతి అని చెప్పటం సాహసమే. కనుక సంస్కృతికి మానవత్వం ఆధారమయిననాడే అది మనగలుగుతుంది. అలా అయినప్పుడు మానవ సంస్కృతికి అవకాశం ఉన్నది కాని జాతీయ సంస్కృతికి అవకాశం ఉండదు. ఆస్థితిలో విశ్వమానవ సంఘం ఆవిర్భవించాలి అంటె మానవత్వాన్ని శిరసావహించాలి. జాతీయవాదానికి చోటు దొరకదు. కాబట్టి సంస్కృతిని ఆధారంగా తీసికొని జాతీయవాదాన్ని స్థాపించటం దుర్ఖీమ్‌లోని విశిష్టత. ఇది వాస్తవ పరిశీలనకూడా. జాతీయ సంస్కృతి ఉన్నప్పుడే జాతీయవాదం ఉండగలదు అనటంలో సందేహం లేదు. దీనికి జాతీయవాద చరిత్రే రుజువు. కాబట్టి దుర్ఖీమ్ ప్రాతిపదికలో తప్పు లేదు. కాని ఈనాటి ప్రపంచంలో జాతీయ సంస్కృతికే అంతగా స్థానం లేకపోవటంచేత దానిపై ఆధారపడిన జాతీయవాదానికి కూడ బలం లేదని రుజువు అవుతున్నది. దుర్ఖీమ్ కృషిని ఇలా పరిశీలించి అర్థం చేసికొన్నప్పుడే అతని పరిశోధనను మనం ఉపయోగించుకోగలం.

# సాలెగూడు!

## శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు

**పాత్రలు :**

ప్రకాశం, మధు, వీరయ్య, వెంకట రావు, పిచ్చివాడు, సూరి, సరోజ....

సమం : రాత్రి ఎనిమిదిగంటలయింది.

పెద్ద వేశ్యాగృహంలో సావడి. సావడికి ఎడమవైపు బయటికి పోవటానికి, కుడివైపు లోపలికి పోవటానికి. ఎదురుగ్గా యింకో గదిలోకి పోవటానికి దారులుంటాయి. వసారాలో కుర్చీలు రెండు. చిన్న టేబిల్ మీద రేడియో. శృంగార ప్రధానమైన సినిమాస్టార్ల కేలండర్లతో బాగా అలంకరించి వుంటుంది. తెరలేచేసరికి రేడియో సన్నగా పాడుతుంటుంది. కొంచెంసేపు కాగానే లోపలినుంచి వీరయ్య విసుగ్గా వస్తాడు. సైకిలుకట్టు పంచె, సిల్కు లాల్చీ, బొద్దుమీసాలతో నిండుగావుంటుంది విగ్రహం. పెద్దమనిషి తరహాలో వున్న ఒక రౌడీలా వుంటాడు.]

చాకలాడిని గద్దెనెక్కిస్తే రాజౌతాడా! కుక్కను సింహాసనమెక్కిస్తే వెనుకటిగుణాలు మానుతుందా! దారితప్పోయే దిక్కుమాలిన దాన్ని దయతలచి, చేరదీసి ఆదరించి, ఆశ్రయం చూపితే దీనికూడా కళ్ళు నెత్తిమీదికొచ్చినయ్! చూస్తా — నేనూ చూస్తాను. దీని అంతేమిటో! (చిరాకుగా రేడియో ఆపేసి కోపంగా బయటికి వెళ్తాడు కాస్సేపుకాగానే బయటినుంచి వెంకట్రావు వస్తాడు వయస్సు 42 సంవత్సరాలుంటాయి. పంచె, షర్టు, పెద్దమనిషి తరహాలో వుంటాడు. రాగానే హాలంతా ఆశ్చర్యంగా, అనుమానంగా కలయచూస్తాడు.)

: (అనుమానంగా) ఎవరండీలోపల! (సరోజ లోపల నుంచి వస్తుంది. వయస్సు 24 సంవత్సరాలుంటాయి. మనసులోని బాధలవల్ల పెద్దదిగా కన్పిస్తుంది. అలంకరణ లేమీ లేకపోయినా అందంగా కన్పిస్తుంది.)

: ఎవరండీ మీరు!

: నేను... నేను... నా పేరు వెంకట్రావంటారండి.

: నేనడిగింది మీపేరుకాదు. ఎందుకొచ్చారని అడుగుతున్నాను!

వెం : ఆ విషయం తర్వాత చెప్తానుకాని—ముందు ఇదెవరిల్లో చెప్పండి.

స : నాకసలే విసుగ్గావుంది. నన్ను విసిగించక మీకెవరిల్లు కావాలో అడగండి చెప్తాను.

వెం : నాకేం అర్ధం కావటంలేదు. రిక్షావాడు యిక్కడికి తీసుకొచ్చాడు. వాడు పొరపాటు పడ్డాడేమో!

స వాడేం పొరపాటు పడలేదులెండి మీ దేవులాట!

వెం నిముషంలో పాడులుకొస్తోంగానే! మా దిక్కడికి దగ్గరలోవున్న పల్లెటూరులే! బడిపంతులు వుద్యోగం చేస్తున్నాను. నేను డ్రామాలు వేస్తాను, రాస్తాను.

స : అయితే మీరు పొరపాటుపడ్డారు. ఇది నాటకాలకు సంబంధించిన యిల్లుకాదు. ఇక్కడ నాటకాలు వేసేవాళ్ళుకాని, రాసేవాళ్ళుకాని, చూచేవాళ్ళుకాని లేరు.

వెం : ఆ విషయంలో కాదులే నేనిక్కడి కొచ్చింది. ఏదో ప్రకృతి పురుషుని లీలావిలాసం అంటారు చూచావ్! అదే నన్నిక్కడికి రప్పించింది. ఇక్కడ సరోజిని అనే అమ్మాయి వుందిట!

స : ఉంది. కాని ఆ అమ్మాయి మీ నాటకాల్లో వేషాలు వేయదే!

వెం : హా హా! అందుకు కాదులే! ఆ అమ్మాయి చాలా బాగుంటుందిట! మంచిదిట!

స : మంచివాళ్లు, అందమైనవాళ్ళు, బుద్ధిగలవాళ్లు, యీ యింట్లో కెందుకొస్తారు. ఇక్కడ వుండేదంతా—అసలు అందం మాసిపోయి, పైపై మెరుగులతో అందంగా వున్నట్లు వుండటానికి ప్రయత్నించేవాళ్ళు. మనశ్చాంచల్యంవల్ల, హృదయ దౌర్బల్యంవల్ల, క్షణికానందంకోసం, నైతికపతనం చెంది నరకకూపాల్లో మునిగి తేలుతున్నవారు! — ఆ అమ్మాయీ అంతే!

వెం : అదే-అదే...! నిజమే ననుకో! కాని నువ్వెవరమ్మాయ్! ఆశ్చర్యంగా వున్నాయి నీమాటలు!

స : నేనే ఆ సరోజినిని.

వెం : అలా చెప్పు. వెన్నెలలు కురిసే ఆ ఆనందం సరోజినిదేనని వూహించాను. మిరుమిట్లు గొలిపే ఆ కళ్ళల్లోని తళతళల మెరుపుచూచి, నీవు సరోజినివని – నా హృదయరాణివని వూహిం

చాలు. ఆ మాటలలోని మాధుర్యాన్ని తీయగా వినటానికి, ఆ పొంగుతున్న అధరాలలోని అమృతాన్ని ఆస్వాదించటానికే యింత దూరం వచ్చాను కష్టపడి.

సరే - కాస్సేపు కట్టిపెట్టండి మీ కవిత్వం. ఇక్కడికొచ్చేవాళ్ళంతా కాస్తోకూస్తో కవిత్వం చెపుతూనే వుంటారు. ఆడవాళ్ళని చూస్తే కవిత్వం చచ్చువెధవలకికూడా వస్తుంది కాబోలు. కాని యిది పసుపుకొంప. ఇక్కడుండేవాళ్ళకు కావల్సింది నీకవిత్వం కాదు నీజేబులోని కాసులు.

(షాక్ తిని - తెప్పరిల్లి నవ్వుతూ) హా హా! అవునుకో! కాని ప్రేమను అంత తేలిగ్గా త్రోసిపారవేయకమ్మాయ్! ప్రేమకంటె మించిన ధనం ప్రపంచంలో మరేదీ లేదని పెద్దపెద్ద కవీశ్వరులు...

అయితే—మీరు నన్ను ప్రేమించి పెళ్ళిచేసుకోవాలని వచ్చారన్నమాట!

(పేలవంగా నవ్వుతూ) పెళ్ళి చేసికొంటేనే ప్రేమించినట్లు కాదుగ! ఆమాటకొస్తే ప్రేమకు పెళ్ళికీ సంబంధం లేదు. రెండు విడివిడి వస్తువులు అతికినా అతకవు.

ఇటువంటి మాటలు నమ్మి మోసపోయినవారే యిక్కడున్న వారంతా! ఈ మాటలకేంగాని— నాకు పనుంది. నన్ను విసిగించకండి. నాకు మీ ప్రేమతో గాని, డబ్బుతో గాని పని లేదు. దయచేసి లోపలికిపోయి మీ ప్రేమామృతధారను మరింకెవరిమీదనైనా వర్షించండి.

అంతేనా అమ్మాయ్!

ముమ్మాటికీ అంతే! అయినా పెద్దవారు చదువుకొన్నవారు, మీకిదేం గుర్బుద్ధండీ!

ఏం చెప్పేదిలే అమ్మాయ్! వొంట్లో కాముదేవత కరాళ నృత్యం చేస్తుంటే, ఆ ధాటికి నా విజ్ఞానం, పెద్దరికం ఎదురొడ్డగలవా అమ్మాయ్! పరిపక్వతైన నీ మాటలవల్ల నీకీ జీవితంమీద విరక్తి కలిగిందని తెల్సుకున్నాను. కాని... చూడమ్మాయ్! విధివైపరీత్యంవల్ల ఒక్కొక్కప్పుడు మనకు యిష్టంలేకపోయినా కొన్నిపనులు చేయాల్సివస్తుంది. ఎదిరించి నిలబడగలిగితే విధిని గెలవవచ్చేమో గాని, అందరికీ ఎదిరించి నిలబడగలిగిన శక్తిసామర్థ్యాలుగాని, హృదయస్థైర్యంగాని వుండవమ్మాయ్! వస్తాను. (లోపలికెళ్తాడు. సరోజ దిగ్భ్రాంతిపొంది, వెంకట్రావు పోయినవైపే చూస్తుంటుంది. తర్వాత నిభాయించుకొని లోపలికి పోబోతుంది. బయటినుంచి సూరి ఆదుర్దాగా వస్తాడు. లాగూ, చొక్కా 14 సంవత్సరాలుంటాయి. చూడటానికి చాలా తెలివిగలవాడుగా కనిపిస్తాడు.)

సూ : (వస్తూనే) అక్కయ్యా - అక్కయ్యా!

వెం : ఏమిటి సూరీ! ఏమిటా గాభరా!

సూ : గాభరా కాక యింకేముందక్కయ్యా! మన మధుబాబు నివాళ కొట్టాలనుకొంటున్నారు.

స : ఎవరు! వీరయ్యావాళ్ళేనా!

సూ : అవునక్కయ్యా :...నీకెలా తెలుసు?

స : ఇంతకుముందే నాతో తగాదా ఆడి, బెదిరించిపోయాడు సూరీ!

సూ : మనింటిపక్కనటు దుకాణం లేదూ - అక్కడ కొండయ్యతో చెప్తున్నాడు వీరయ్య. బజారు నుంచి వస్తూ టీ తాగటానికి వెళ్ళి వాళ్ళ మాటలన్నీ రహస్యంగా విన్నాను. వాళ్ళివాళేదో పెద్ద యత్నంమీద వున్నారు. ఎందుకూ!

ఎందుకో కాదు సూరీ! ఆ వీరయ్యమాటలు నేను వినటంలేదు. వాడి విలాసాలకు డబ్బివ్వటంలేదు. మధుకూ నాకూ ఏదో సంబంధం వుందని వాడి వుద్దేశ్యం. అందుకే యీ ఎత్తువేసి మధుని నానుండి దూరంచేయాలని చూస్తున్నాడు.

సూ : నాకొక వుపాయం తోస్తున్నదక్కయ్యా! మధుబాబుగారి రూము ప్రక్కన ప్రకాశంగారని ఒకాయన వున్నారు. చదువుకొన్నవారు — చాలా తెలివైనవారు. ఆయనంటే వీరయ్య వాళ్ళకు చాలా గౌరవం. ఈ విషయం ఆయనకు చెప్తే ఆయన వీళ్ళదుర్మార్గాలను ఆపించగలరు.

స : లాభంలేదు సూరీ! వీరయ్యకు జ్ఞానంవుంది కాని డబ్బుదాహం జాస్తి. పగపడితే పామే! ఆ కొండయ్య మనిషిచర్మాన్ని కప్పుకొన్న పులి. ఎవరుచెప్పినా వినడు.

సూ : అలా కాదక్కయ్యా! ప్రకాశంగారు చెప్తే తప్పకుండా వింటారు. ఒకవిధంగా ఆయన వీళ్ళకి గురువుకూడా! అయినా - యీ వీరయ్య ప్రవర్తన రోజుకి రోజూ మితిమించిపోతున్నది. ఈయిల్లు మనది. వాడి అధికారమేముందిక్కడ!

స : బలంగలవాడిదే రాజ్యం సూరీ! వాడికి బలముంది. మా అమ్మ బలహీన అయింది. ఆమె మాటసాగి అంతా బాగున్నరోజుల్లో వాడిని చేరదీసింది. నీవా బలహీనుడివి. కుర్రవాడివి. అందుకే వాడిష్టమొచ్చినట్లు అందరిమీదా అధికారం చెలాయిస్తున్నాడు.

సూ : (ఏడ్పు గొంతుతో) అసలు నాకీజీవితం యిష్టం లేదక్కా! చదువుకొంటున్నవాడిని. మా ఒళ్లో

వాళ్లంతా నన్ను గేలి చేస్తుంటారు. ఎలాగైనా ఈ యింట్లో యీ వృత్తిని మాన్పించేస్తానక్కా! తర్వాత నీవూ, నేనూ, అమ్మను చూసుకొంటూ వుందాం! బ్రతక లేక పోతే చావొచ్చు గాని యీ పాపిష్టి బ్రతుకు బ్రతక లేను! నాకు తెలుసు బాబూ నీ బాధ! కాని కొనికైనా కాలం కలిసిరావాలి. ఇవాళ మధుమీద చేయి పడితే వీళ్ళ అంతు నేనూ చూస్తాను. బ్రతుకులో అన్ని విధాలా నాశనమైపోయి, మనోవేదనతో క్రుంగిపోతున్న నాకు, యీనాటికి కొస్త మంచిదోవ చిక్కి, మనశ్శాంతిగా వుంటే దాన్ని నాశనం చేయటం నేను సహించను.

: ఆ ప్రకాశంగారు యిటువంటి విషయాల్లో సహాయం చేస్తారక్కా. అదీగాక ఆయనకు మధుబాబు స్నేహితుడు. నన్నుకూడా తెలుసు. ఆయన సహాయం పొందగలిగితే మనం యీ చెర నుండి విముక్తి పొందవచ్చు. నేను వెళ్ళొస్తానక్కా! (సూరి గబగబ బయటికి వెళ్తాడు. సరోజ శూన్యంలోకి చూస్తూ బాధగా ఏదో ఆలోచిస్తుండగా కొన్సేపు. ఇంతలో బయట పిచ్చిగా నవ్వు వినిపిస్తుంది. నవ్వు విని సరోజ ప్రపంచంలోకి వచ్చి ఆత్రంగా లోపలి కెళ్ళబోతుంది మెరుపులాగా పిచ్చివాడొస్తాడు).

ఏయ్! ఏయ్! లోపలి కెళ్తావేంటి! లోపల దయ్యాలున్నాయ్! భూతాలున్నాయ్! ఆడ పిశాచాలున్నాయ్! లోపలికి పొరపాటున పోతే పట్టి పీక్కు తింటాయ్! కరుస్తాయ్...! (గట్టిగా పట్టుకొంటాడు సరోజను).

(బాధగా) భాస్కరం...

భాస్కరం చచ్చిపోయాడుగా! చచ్చి పదిరోజులయింది. మళ్ళీ నిన్న కన్పించి సుఖంగా వున్నానన్నాడు. వాళ్లావిడకు విడాకు లిచ్చాడుట. ఆ ఆకులనేమో వాళ్లావిడ మరెవరికో అమ్ముకొందిట!

ఏమిటి భాస్కరం యీ పిచ్చిమాటలు!

వాడికి పిచ్చంటావేరా పిచ్చివాడా! వాడికి పిచ్చిలేదు – వాడీమధ్య వేదాంతం నేర్చుకొంటున్నాడు-వేదాంతం!

(విసుగ్గా లోపలి కెళ్ళబోతుంది).

: అదిగదుగో ... మళ్లీ తప్పించుకొని పారిపోబోతున్నావ్! నీ కెందుకంత భయం? దొంగతనం చేశావా! అయినా పోలీసులను పిలువను లే! లేకపోతే నీ ప్రేయసి దగ్గరికి పోవాలా!

: నన్ను పోనియ్ భాస్కరం...!

పి : పిచ్చి కాకపోతే పోయేవాళ్లని పట్టుకొంటే మాత్రం ఆగుతారా! ఛీ – కాని అబ్బాయ్...! ప్రపంచంలో దేనినన్నా నమ్ము. కాని ఆడదాన్ని మటుకు నమ్మవద్దు. వాళ్లు నిన్ను మాటలు చెప్పి మోసం చేస్తారు.

స : అవును. అలా మాటలతోనే నన్ను మోసం చేసి నా బ్రతుకు నిలా బండపాలు చేశావ్! నన్ను యిక యింతకన్న ఎవరు మోసం చేయగలరు! నా జీవితం యింతకన్న ఏం చెడిపోతుంది?

పి : ఏడుస్తావెందుకు రా పిచ్చి నాన్నా! పెళ్లాం చచ్చిపోయిందా! పోనీలే...! పీడ వదిలింది. హాయిగా నాతోరా!

స : నీతో వచ్చే నాస్థితి యిలాగయింది. జీవితం హాయి అనుకొంటే రాయయింది.

పి : ఛీ-ఛీ! ఏడుపు గొట్టు మొహాలంటే నాకు అసహ్యం. నాకూ పనుంది. ఆడవాళ్ల సాలెగూడులో చిక్కుకోటానికి పోయే మగవాళ్లందరికీ ఏగతాచోట్ల హెచ్చరికలు చేసి రావాలి. నేనలా ఒక చక్కర్ కొట్టొస్తాను. (గాలిలాగా బయటి కెళ్తాడు. సరోజ గాఢమైన నిట్టూర్పు విడిచి లోపలి కెళ్తుంది. తర్వాత కొన్సేపటికి ప్రకాశం వస్తాడు. వయస్సు 23 సంవత్సరాలుంటాయ్! రాగానే హాలంతా ఆశ్చర్యంగా కలయచూస్తాడు.)

ప్ర : వీరయ్యా...వీరయ్యా! (జవాబుండదు. లోపలికి పోబోయి మళ్లీ సందేహించి కుర్చీలో కూర్చుంటాడు – ఏదో ఆలోచిస్తూ! లోపలి నుంచి వెంకట్రావు వస్తాడు. ప్రకాశాన్ని చూచి మొదట్లో కొస్త కంగారుపడి మళ్లీ నిభాయించుకొంటాడు. ప్రకాశం కూడా వెంకట్రావుని చూస్తాడు.)

వెం : ఏరా ప్రకాశం! బాగున్నావా? గుర్తున్నానురా నేను! నువ్వు వచ్చావేరా యిక్కడికి!

ప్ర : నువ్వు గుర్తులేకేం బాబాయ్!

వెం : మొన్న మనవూరు పోతే నీ విషయమంతా మీ నాన్న చాలా బాధపడుతూ చెప్పేడు. ఏమో ననుకొన్నాను. అదంతా నిజమే నన్నమాట! అయినా నీ కిదేం ఖర్మరా! లక్షణంగా పెళ్లి చేసుకొని సంసారం చేయలేక!

ప్ర : ఇక్కడికి నేను రావటానికి నా పెళ్ళికిగల సంబంధ మేమిటో బోధపడటం లేదు బాబాయ్.

వెం : సంబంధం లేకేంగాని—నువ్విక్కడ దేని కొచ్చావో ముందు చెప్పు.

ప్ర : వీరయ్య అని తెల్సినతరువాతైనా అతన్ని కల్సుకోవాలని వచ్చేను అయితే నువ్వెందుకొచ్చేవ్ బాబాయ్!

వెం : ఏం చెప్పేదిలేరా! బుద్ధి గడ్డితిని వచ్చాను యిక్కడికి. ఒరేయ్—నేనిక్కడ కన్పించినట్లు ఎవరితోనైనా అనేవుగోయ్—నీకు పుణ్యముంటుంది. అన్యాయంగా నా పరువు...

ప్ర : పరువు పోవటం దేనికి బాబాయ్!

వెం : పరువుకొంపకొచ్చే పరువుపోక పెరుగుతుందట్రా!

ప్ర : అయితే—యిది పరువుకొంపా బాబాయ్!

వెం : కాక—పతివ్రతల ఆశ్రమం అనుకొన్నావుట్రా!

ప్ర : చాలా ఆశ్చర్యంగావుంది. పాపకూపాన్ని కూడా పైపై మెరుగులుదిద్ది యింత అందంగా వుంచుతారని, నరకంలో ప్రవేశించేముందుకూడా కొంతఅందాన్ని చూసి ఆనందించుతామని నాకు తెలియదు. అయినా—విచిత్రం కాకపోతే పరువుపోతుందని తెలిసికూడా. అన్నీ తెలిసిన నీవు యీ పాపపుపని చేయటానికి యిక్కడికి రావటమెందుకు బాబాయ్!

వెం : విధిలేకరా! ప్రకృతిగతిని కాదనలేక పంచేంద్రియాలు వాటిపనిని సక్రమంగా నెరవేరుస్తున్నంతకాలం మనం మనపనులను సరిగా చేయక తప్పుతుందట్రా! నీకు తెలుసుగా!—నా భార్య చనిపోయింది. అభం శుభం తెలియని పసిపిల్లల జీవితాలను సవతితల్లి యినుపపాదాలకు బలిచేయటం యిష్టంలేక మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. మరేం చెయ్యాలిరా!

ప్ర : అందుకని—మురికిగుంటల్లో మునకలేస్తావా బాబాయ్!

వెం : సరైన జీవనదుల్లేకపోతే మురికిగుంటలే మహానదులవుతాయిరా ఒక్కొక్కప్పుడు! సరేలే—నా సంగతలా వదిలెయ్యి కాని—నీవిలా ఎంతకాలమని ఒంటరిగా తిరుగుతావురా! ఈ తాడు తెగిన గాలిపటపు జీవితాన్ని ఎంతకాలమని గడుపుతావురా!

ప్ర : ఇలావుంటే నాకేం నష్టంవచ్చింది బాబాయ్!

వెం : నీకేం నష్టంలేదురా! కాని—తెలివిగలవాడివి. చదువుకొన్నవాడివి, యింటికంతా దిద్దుకొనిపోతావని అన్నిఆశలూ నీమీదే పెట్టుకొని వున్న నీ తలిదండ్రులు, ఆశలన్నీ నిరాశలుకాగా నీకోసం నిన్ను తలుచుకొని ఎంత ఏడుస్తున్నారో ఆలోచించావుట్రా!

ప్ర : బాబాయ్...! ఇంటి విషయాలు జ్ఞప్తికి తెచ్చి నన్ను బాధించకు.

వెం : ఒక్క ఆనందానికోసం—అది నిన్ను మోసం చేసిందన్న బాధతో, నీవు కష్టపడే యింతమందిని కష్టపెడతావుట్రా! అవతల నీకు పెళ్ళికావలసిన చెల్లెళ్ళు, తమ్ముళ్ళు వున్నారు. నీవిలా చెడుతిరుగుళ్లు తిరిగితే వాళ్ళబ్రతుకులేంకావాలిరా!

ప్ర : నా కెవ్వరినీ కష్టపెడ్దామన్న దురుద్దేశ్యంలేదు బాబాయ్! కాని నా మనసు ప్రాపంచిక విషయాలమీద కంతగా మళ్ళటంలేదు అయినా లోకం అనుకొన్నంత చెడుతిరుగుళ్ళు నేనేం తిరగటంలేదు. కాకపోతే అందరిలాగా పెళ్ళిళ్ళు చేసుకొని పిల్లల్ని కనిపారేయటంలేదు దేశంమీద! అంతే...బాబాయ్! నా బ్రతుకేదో నేను బ్రతుకుతున్నాను.

వెం : నీ బ్రతుకు నీవు బ్రతుకుతున్నావుగా! కాదని ఎవరన్నారు! అదే కూడదని అంటున్నాను ప్రకాశం. బ్రతుకుకు బంధం అవసరంరా! బంధాలులేని జీవితానికి ఆనందం లేదురా!

ప్ర : అంతేనా బాబాయ్! జీవితానికి సంసార బంధాలు తప్పితే మరింకేమీ అక్కర్లేదా బాబాయ్! ఇదేనా నీ జీవితాదర్శం?

వెం : ఆదర్శాలకేంరా—లక్షలుంటాయ్! నా మటుకు నాకు పెద్ద నటుడిని నవుదామని వుంది. దానికి తగిన ప్రతిభ నాలో వుందని నీకు తెలుసు. దానికే ప్రయత్నిస్తున్నాను కూడా! కాని ఎన్నివున్నా సంసార జీవితంలోవున్న ఆనందం మరిక దేనిలోనూ వుండదు ప్రకాశం! అది లేకేరా...నా ఖర్మ యిలా పట్టింది.

ప్ర : అంతేనా బాబాయ్! మన జీవితం యీ సంసార బంధాలలోని ఆశా నిరాశలమధ్య, మోహామమకారాలమధ్య నలిగి చితికిపోవలసిందేనా?

వెం : అంతేరా! ఆ జీవిత వలయంలోని బంధాలమధ్య నలుగుతూ వుక్కిరిబిక్కిరవుతుంటేనే ఆనందం. ఆ బాధలోనే ఆనందం వుంది. తృప్తివుంది. అది లేకపోతే జీవితం లేనేలేదు, ప్రకాశం. నీడ లేనిదే ఆకారం వుంటుందిట్రా!

ప్ర : క్షమించు బాబాయ్! నాకా సంసారబాధాల మీద మమకారంలేదు. ప్రపంచంలో దేనిమీద కూడా మమకారంలేదు. అసలు నేనెందుకు జీవిస్తున్నానో, యిలా జీవించటంవల్ల ఎవరికేం లాభమో నాకర్థంకావటంలేదు. ప్రొద్దునలేచిన దగ్గరనుంచి...సంపాదించటం...ఖర్చుపెట్టటం తినటం...తిరగటం...నిద్రపోవటం ...పిల్లల్ని పుట్టించటం... వాళ్ల చదువు సంధ్యలు... ఏమిటోబాబాయ్...తలుచుకొంటే వొళ్ళు కంపర మెత్తుతున్నది. ఆ బ్రతుకు నేను బ్రతకలేను.

వెం : అయితే—మరేం చేస్తావురా! ఇలా వొంటరిగా వుండి ఏం సాధిస్తావురా?

ప్ర : ఏమో బాబాయ్! ఏం చేస్తానో చెప్పలేను. బహుశా జీవితపు విలువ తెల్సుకోటానికి ప్రయత్నిస్తానేమో! అంతే బాబాయ్ ...

వెం : అంతేఅంటే చేసేదేముందిరా! 'బుద్ధిః కర్మానుసారిణీ' అన్నారు. నేను వచ్చింది చెప్పవలసినది చెప్పటానికే అయినా, పెద్దవాడిని - కొస్తో కూస్తో వివేచనాజ్ఞానం గలవాడిని కాబట్టి చేత ...నాకు మీమీద, మీ కుటుంబంమీద, ప్రత్యేకించి నీమీదా వున్న ప్రేమకొద్దీ యింతదూరం చెప్పేను. అన్నీ తెలిసినవాడివి గనుక బాగా ఆలోచించుకో! తర్వాత నీయిష్టం. వస్తాను (వెళ్తాడు బయటికి.)

ప్ర : (శూన్యంలోకి చూస్తూ) జీవితమంటే ఏమిటి? ఈ సృష్టి మూలసూత్రం ఏమిటి! (బయటినుంచి మధు వస్తాడు. వయస్సు 20 సంవత్సరాలుంటాయి. నీటైన ఖరీదుగల డ్రెస్సుతో అందంగా హుషారుగా వుంటాడు.)

మ : ఎవరు! ఎవరది!

ప్ర : (వెనక్కి తిరిగిచూచి ఆశ్చర్యంగా) మీరా. యీ సమయంలో మీరిక్కడెందుకొచ్చారు!

మ : నా సంగతలా వుంచండి. మీరు ఆడవాళ్లంటే విముఖత అని విన్నాను. అటువంటి మిమ్మల్ని యీ యింట్లో యీ సమయంలో చూడటం...

ప్ర : ఆశ్చర్యంగా వుండటం అసహజమేమీ కాదు. కాని ఒక్కటిమాత్రం నిజం పడుపుకత్తింట్లో ప్రేమరాగాలు పాడటానికి మాత్రం రాలేదు.

మ : పోనీలెండి. నేనలా అన్నందుకు బాధపడకండి. మీ సంగతి నాకు తెలియనిదికాదు. మీరంటే నా కిప్పటికీ గౌరవమే! అయినా ఒక్క విషయం. మనం పుట్టింది దేనికండీ! అనుభవించటానికి - దూ!

ప్ర : ఆలోచించాల్సిన విషయమే!

మ : అక్కరేదు. 'Life for enjoy' అన్నారు పెద్దలు. అవకాశమున్నంతవరకు ప్రపంచంలో ప్రతి వస్తువును అనుభవించి ఆనందించటమే జీవితం. అదే నా జీవిత లక్ష్యంకూడా!

ప్ర : ఇదేనా! నీ జీవిత పరమావధి ఆనందించటమేనా! నీతోటి మానవుల బాధలనుతీర్చి, ఆనందింపచేయటానికి ప్రయత్నిస్తే నీ జీవితపు విలువ పెరుగుతుందేమో!

మ : అది వట్టి తెలివితక్కువని నా నమ్మకం. మనం ఒకర్ని ఆనందపరచేదేమిటి? నామటుకు నన్ను చూడండి. భగవంతుడు నాకు కావల్సినంత డబ్బు నిచ్చాడు. ఆనందించటానికి కావల్సిన అవకాశాలన్నీ యిచ్చాడు అటువంటప్పుడు అనవసరంగా లేని బాధలను నెత్తినేసుకొని అరచేతిలో వున్న స్వర్గాన్ని ఎందుకు జారవిడుచుకోవాలో నాకర్థం కాదు

ప్ర : అందుకని — చదువుకొని, విజ్ఞానం సంపాదించుకొని, అభ్యున్నతికి రావలసినవాడివి, అందం పేరుతో, ఆనందం పేరుతో, పడుపుకొంపల వెంబడి తిరిగి జీవిత పరమార్థాన్ని సాధిస్తావా?

మ : (కొంత బాధగా) ప్రకాశరావుగారూ! మీరనుకున్నంత పతనావస్థలో లేను నేను. పవిత్ర ప్రేమకోసం వచ్చాను నేనిక్కడికి!

ప్ర : పడుపుకత్తింట్లో పవిత్రప్రేమ! చాలా తమాషాగా వుంటుంది.

మ : (కోపంగా) ప్రకాశరావుగారూ!

ప్ర : ఏం! ఎందుకంత కోపం! నీ జీవితం ఆనందించటానికన్నావుగా! పో—పోయి ఆనందించు. ఈ ఆనందానుభూతుల నిజరూపం యీనాడు కాదు నీకు బోధపడేది. సర్వశక్తులు వుడిగిపోయి, సమస్తరోగాలు శరీర సామ్రాజ్యాన్ని నిరంకుశంగా ఏలుతూ, నరనరాలను అణువణువునా బాధపెడుతుంటే ఆనాడు తెలిసేది. చేతిలో వున్న డబ్బు కరిగిపోయి, చేరదీసే దిక్కు లేక, పుట్టినందుకు నీవు చేసిన పనేమిటో బోధపడక, కష్టాల కడలింపులో వుక్కిరిబిక్కిరవుతున్న రోజుల్లో నీ జీవితపు విలువేమిటో తెలుస్తుంది. నీ ఆనందపు అంతేమిటో బోధపడుతుంది మధూ!

మ : అక్కర్లేదు. మీరనుకొన్నంత నైచ్యానికి నేను పోలేదు పోనేమో కూడా! కాని పడుపువృత్తింట్లో కాలుపెట్టటంవల్లనే, నేను పరమపాపినని, పతితుడనని లెక్కకట్టకండి. ఒకనాడు...యౌవనోద్రేకంలో, తీయని కోరికల తొలియాశ వలపు తలపులతో నేనీ యింట్లోకి కాలుపెట్టేను. అందాలనిలయం ఆనందపు సుడిగుండంలో చిక్కుకొన్నట్లు అనుభూతిని పొందేను. ఎటు చూచినా అందం—ఆనందం—చేతులు చాచి ఆహ్వానిస్తున్నట్లు కనపడింది. కంటికి యింపుగ వున్నదాన్ని ఎంచుకొన్నాను. ఆస్వాదించటానికి ప్రయత్నిస్తే అసలు స్వరూపం బయటపెట్టుకొంది...ఆమె నన్ను చూచి జాలిపడింది. తన అందం వెనుక అతిభయంకరమైన స్వరూపం వుందని, నా యౌవనాన్ని ఆ భూతాల కోరలకు బలిచేయవద్దని ప్రాధేయపడింది, లాలించి బుజ్జగించింది. ఆమె లోకందృష్టిలో యీనాడు పతిత. కాని ఆమె నాకు

దేవత నవజీవనవిధాత. ఆమెను కల్సుకోటానికే యిక్కడికొచ్చాను.

ప్ర : అలాగయితే ఆనందమే మధూ! మట్టిగడ్డల్లో మణిపూసల్లాగా, కఠినమైన రాళ్ళల్లో రత్నాలులాగా, పతితల్లో కూడా ఇటువంటివారుండరని నేననను కాని—మధూ అవకాశమున్నప్పుడు అటువంటివాళ్ళను చేరదీసి మాలిన్యం కడిగి ఎందుకు పవిత్రం చేయకూడదు?

మ : క్షమించండి. అటువంటి ప్రయత్నాలు నేనేమీ చేయలేను. నాకు చేతకాదు. నేను పుట్టినదగ్గర నుంచి యింతవరకు బాధలు పడలేదు. అప్పుడప్పుడు నా జీవితాన్ని సింహావలోకనం చేసికొంటే, నేను పుట్టింది ఆనందించటానికేమో ననిపిస్తుంది. నేను బాధపడిందల్లా. ఆ ఒక్క రోజులో ఆక్షణమాత్రమే! తర్వాత నాజీవితం ఆనందమయం. అందాలతోరణం. అనుభూతుల నిలయం. అది పోనీయండి. రేపు నేను హైదరాబాదు పోతున్నాను. ఆవిషయం ఆమెతో చెప్పాలి.

ప్ర : వెళ్ళిరా మధూ! వీరయ్య యింట్లో లేనట్లుంది. ఇటువంటి ప్రదేశంలో నేనుండలేను. నేనూ వెళ్ళిపోతాను. (మధు లోపలికెళ్ళాడు. ప్రకాశం బయటకి వెళ్ళబోతూంటాడు. బయటినుంచి సూరి వస్తాడు.)

సూ : (వస్తూనే) అక్కయ్యా! (ప్రకాశరావును చూచి) ఓ! మీరా! మీరిక్కడికొచ్చారే! మీకోసం మీరూముకే పోయొస్తున్నాను సార్!

ప్ర : (అనుమానంగా) నీవు......

సూ : అదే—నేనేనండీ! మధుగారికోసం అప్పుడప్పుడూ వస్తుంటాను. మీతోకూడా మాట్లాడేను చాలాసార్లు.

ప్ర : అవును. జ్ఞాపకంవచ్చింది. నీవు హైస్కూల్లో చదువుతున్నావ్—ఏవో చిన్నచిన్న కథలు వ్రాస్తుంటావు కదూ!

సూ : అవునండీ! రెండుమూడుసార్లు అచ్చయిన నా కథలుకూడా చూపించాను మీకు!

ప్ర : అవును. అయితే—ఇక్కడికి ఎందుకొచ్చావ్!

సూ : ఇది మా యిల్లేనండీ!

ప్ర : (ఆశ్చర్యంగా—బాధగా) మీయిల్లా!

సూ : (చాలాబాధగా) అవునండి. నాజీవితపు అసలు స్వరూపం యిది.

ప్ర : ఇదంతా విచిత్రంగావుంది. అతికాయ పైకి అందంగావుండి పొత్తికడుపు విప్పిచూస్తే పురుగులున్నట్లు. మంచివాళ్ళనుకొన్న విలువలు తనూ పోగా మారుతున్నాయి.

సూ : మా అమ్మకు ఒకప్పుడు యీ వృత్తిని నడపటమే జీవనంగా వుండేది. ఆమె యిప్పుడు పెద్దదయింది. వీరయ్య యిప్పుడు యీ వ్యాపారాన్నంతా నడుపుతున్నాడు. కానీ... కానీ నాకిష్టం లేదండీ! మా అమ్మ నామాట వినదు. ఆవీరయ్య నా మాటలు లెక్క చెయ్యడంలేదు. చదువుకొంటున్నవాడిని నల్గురితో తిరుగుతున్న వాడిని—నాకెంత బాధగా వుంటుందో ఆలోచించండి మాస్టారూ! మాటల సందర్భంలో స్నేహితులెవరయినా చులకనగా మాట్లాడితే యీ బ్రతుకు బ్రతికేకన్నా చావే నయమనిపిస్తుంది మాస్టారూ! ఆవీరయ్యకు మీ మీద గౌరవం. మీరు అతనితో చెప్పి యీ వ్యాపారాన్ని మాయింట్లో నుంచి తీసేయించండి. తర్వాత కూలినాలైనా చేసుకొని నేను అమ్మ అక్క బ్రతకగలం మాస్టారూ! కాళ్ళు పట్టుకొని బతిమాలుకొంటున్నాను. (కాళ్ళమీద పడ్డాడు.)

ప్ర : (బాధగా) లే...బాబూ...

సూ : చేస్తాననండి మాస్టారూ! మాకీ సహాయం చేస్తాననండి. జీవితాన్ని పవిత్రంగా గడుపుదామనే నా ఆశ. ఆ ఆశను మీరు నెరవేరుస్తాననండి.

ప్ర : నెరవేరుస్తాను ... బాబూ! నా జీవితంలో ఎన్నడూ కనీవినని కోరికను కోరేవు. కరకు గుండెయినా కరగి కన్నీరు కార్చే బాధాగాధను చెప్పేవు నిజంబాబూ! జీవితంలో సమస్యలు ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా వస్తుంటాయి. నా సర్వస్వాన్ని ధారపోసి నీవు కోరిన సహాయం చేస్తాను సూరీ!

సూ : (ఆనందంగా) మాస్టారూ ... వస్తాను సార్! అక్కయ్యతో చెప్పేసి వస్తాను. (కొంత దూరంపోయి మళ్ళీ వెనక్కువచ్చి అనుమానంగా) అన్నట్లు—మీరిక్కడికి ఎందుకొచ్చారో తెల్సుకోవచ్చా మాస్టారూ!

ప్ర : వీరయ్యను కల్సుకోటానికి వచ్చాను.

సూ : వాడా! పేకాటమోజాలో మిమ్మల్ని మరచిపోయి వుంటాడు. మీరిక్కడే కూర్చోండి. ఇప్పుడే వస్తాను. (లోపలికెళ్ళాడు. ప్రకాశం బయటికిపోబోయి మళ్ళీ ఏదో ఆలోచించి సిగిరెట్టు ముట్టించి శూన్యంలోకి శూన్యంగా చూస్తూ ఆలోచిస్తూ వుంటాడు. మధ్యవాకిలి నుంచి సరోజ ప్రవేశిస్తుంది.)

స : ఎవరూ! మధూ!

ప్ర : (వెనక్కి తిరక్కుండానే) కాదు. వీరయ్య కోసం వచ్చాను.

స్నేహితుడా మీకు!
కావని చెప్పవచ్చు.
మరి — ఆయనతో ప్రేమేమిటో తెలుసుకోవచ్చా!

: అనవసరం అనుకొంటాను...అయినా......
(వెనక్కు తిరిగి సరోజను చూచి ఆగిపోతాడు. ఇద్దరి ముఖాలూ మారిపోతాయి ఆశ్చర్యం — భయం — సిగ్గు — బాధ కలిసిన ఒకానొక అనుభూతి తాలూకు ఛాయ ఒక్క క్షణం యిద్దరి మొహాలలోను కన్పిస్తుంది.)
(క్రుంగిపోతూ) సూ...రా...!
నే నే — సరూ — నే నే!
(బాధతో మొహం కప్పుకొని లోపలికెళ్ళబోతుంది.)

: వెళ్ళిపోతావా సరూ! అవును. ఒకనాడు — ఎంతో అత్యున్నతస్థానంలో వుండి నన్ను ప్రేమించి, నా చేత ప్రేమించబడి — ఉత్కృష్టమైన ఆనందాన్ని అనుభవించిన నువ్వు — నరకానికన్నా కనాకృష్టమైన యీ ప్రదేశంలో యిటువంటి నికృష్టస్థితిలో వుండి నా మొహం ఎలా చూడగలవు? ఒకనాడు — నా రచనలు చదివి సహృదయంతో కన్నీరు కార్చిన నీవేనా యీ స్థితిలో వుండేది!
ప్ర...కా...శ్!
నీవు — నేను — ఒంటరితనం! ఎన్నాళ్ళయిందో యిలాంటి కలయిక సంభవించి! కాని ఆనాటి కలయికలకు యీనాటి కలయికలకు ఎంత వ్యత్యాసముంది. ఆనాటి కలయికల్లో ఆనందం వుంది. అనురాగముంది. ఈనాటి యీ కలయికలో విషాదం వుంది. హృదయాలను మాడ్చివేసే బాధవుంది.. నరకంకన్నా హేయమైన యీ ప్రదేశానికెందుకొచ్చావు సరూ! ఎలావచ్చావు!
(కాళ్ళకు చుట్టుకొనిపోయి) నన్ను క్షమించరూ!
నిన్నిటువంటి స్థితిలో, యిటువంటి ప్రదేశంలో కలుసుకోవలసివస్తుందని కలలోకూడా వూహించలేదు. కోరికోరి యీ స్థితికి వచ్చావా! నీ యీ స్థితికి కారణం ఎవ్వరు సరూ!
భగవంతుడు ప్రకాశ్! — భగవంతుడు!
(వ్యంగ్యంగా నవ్వి) మనం చేసిన పాపపు పనులన్నిటినీ, నిరాకారుడై, నిర్వికారుడైన, ఆ నోరులేని భగవంతుడి నెత్తి వేసి రుద్దటం దేనికిలే సరూ!
నిజమే ప్రకాశ్! మనబుద్ధి మంచిది కానప్పుడు, మనలో వివేచనజ్ఞానం లేనప్పుడు, మన జీవితపు విలువలను గమనించలేనప్పుడు, భగవంతుడిననటం కూడా తప్పే!

ప్ర : ఏడుస్తున్నావా సరూ!

స : లేదు ప్రకాశ్! ఒంటిలోని నీరు కంటిలో నే కరిగి, మనసులోని బాధాగ్ని జ్వాలల వల్ల యింకి ఆవిరై పోయాయి ఏనాడో! ఇంకా కన్నీళ్ళా!

ప్ర : (ఉబికివస్తున్న దుఃఖాన్ని ఆపుకొంటూ) అసలు సంగతి చెప్పు సరూ!

స : సంగతేముంది ప్రకాశ్! (బాధగా నవ్వి, నిట్టూర్చి) నీతో నే నా జీవితంలోని ఆనంద ఘట్టాలు అంతమయ్యాయి తర్వాత బ్రతుకు గతుకుల దారివెంబడి ముళ్ళబాటలో ప్రయాణం చేసింది. నీవు పోయిన తర్వాత భాస్కరం అనే అతను నా జీవితంలో ప్రవేశించాడు. నన్ను పొందాలని అతిప్రయత్నం చేశాడు. నేను సులభంగా అతని వలలో పడ్డాను. తేల్చుకొని బయటపడదామన్నా వీలుకాని చీకటిబాట నా కళ్ళకు కప్పింది. అప్పటినుంచి నా జీవితమే గడ్డిజీవితమైపోయింది. అతని మైకంలో, అతని ప్రేరేపణవల్ల మిమ్మల్ని నానామాటలని బాధపెట్టేను. నేనో! చుక్కానిలేని నావలాగా అడుగడుగున బాధలు పడుతూ, రోజురోజుకి నైతికపు విలువను క్రొత్తక్రొత్తగా పోగొట్టుకొంటూ వచ్చి ఆఖరికీ సాలెగూడులో చిక్కున్నాను.

: అంతేసరూ...! జీవితంలో ఒక్కొక్కప్పుడు మనం అనుకోకుండా మనమంచికో చెడుకో కొన్ని సంఘటనలు జరుగుతాయి ఆ సంఘటనలు చిన్నవే అయినా మనజీవితచక్రాల రూపురూపులను పూర్తిగా మార్చివేస్తాయి ఒక్కొక్కప్పుడు. నీతో నాకు పరిచయం కావటం తమాషాగా అయింది. మనస్నేహం కలలాగా కరిగిపోయింది. నేనొకదోవన పోయాను. నీవొకడొంక మార్గం....

: నాకు తెలుసు ప్రకాశ్! నాకోసం నీహృదయం ఎంతగా తపించి పరితపిస్తున్నదో!

ప్ర : (నిరాశగా నవ్వి) ఆశలేనిదే నిరాశ ఎలా వుంటుంది! అలాగే అసలు నాకు హృదయమనేది వుంటేనేగదా సరూ బాధపడటానికి! అసలు నే నెందుకు జీవిస్తున్నానో నాకర్థం కావటంలేదు.

: పత్రికలలో నివు వ్రాస్తున్న కథలన్నిటినీ చదివాను. అన్నిటిలో నా భావాలను పోల్చుకొన్నాను. నీ హృదయాంతరాళంలో చెలరేగిన తుఫానును అర్థంచేసుకొన్నాను కాని యీ జన్మలో నీకళ్ళపడి నీబాధను రెచ్చగొట్టాలనుకో

లేదు. కాని విధి విపరీతం! అనుకోకుండా యివాళ నిన్ను కలుసుకోవలసి వచ్చింది.

: ఫరవాలేదు సరూ! భాగ్యలేనిదే బ్రతుకుకు ఆనందం లేదేమో!

: ఇంతే ప్రకాశ్! నాకథ ఇంతే!...జీవితంలో మంచి చెడులను, కష్టసుఖాలను నీవల్ల, భాస్కరంవల్ల స్వల్పవ్యవధిలో అనుభవించాను. నాకథలోనికి వచ్చిన పాత్రలకు లెక్కలేదు. ఒకరా...ఇదరా...! జీవనోపాధికోసం మానాన్ని అమ్ముకొన్నాను. జీవితంమీద ఇచ్ఛ ఏనాడో పోయినా జీవచ్ఛవంలా బ్రతుకుతున్నాను. నాసంగతిలా వదిలెయ్యి ప్రకాశ్! నీ వెక్కడుంటున్నావు? ఏం చేస్తున్నావు? పెళ్ళయిందా?

: ఇంకా ఆ దురదృష్టం పట్టలేదు.

: అదేమిటి! నీకింకా పిల్లలనుకొంటున్నాను!

: సంసారపు ఊబిలోకి దిగదల్చుకోలేదు సరూ! అయినా అందులో ఆనందం ఏముంది చెప్పు? ఆ ఊబిలో దిగినదగ్గరనుంచి కుటుంబపోషణ తాపత్రయంతో మనశ్శాంతి వుండదు. బ్రతుకు బండబారిపోతుందని భయం సరూ!

నీదెంత నిర్మలప్రేమ ప్రకాశ్! నాకోసం నువ్వీ త్యాగం చేశావని నాకు తెలుసు...నా జీవితం ఇలా కుళ్ళుకంపుతో నగ్గిపోతున్నా, నీ జీవితమన్నా నవవసంతశోభతో పరిఢవిల్లుతుందేమో ననుకొన్నాను. కాని ఎడారిజీవితాన్ని గడుపుతున్నావనుకోలేదు

: పోనీలే సరూ! అశాశ్వతమైన ఈ భౌతిక దేహపు ఆనందం అందటంలేదని నేను బాధపడటంలేదు. కాని—ఈ జీవితగమనం ఏమిటి!

[బయటనుంచి పిచ్చివాడు ప్రవేశిస్తాడు.]

: ఏయ్! ఏయ్! అదేమిటి! పడుతున్నావా—బురదగుంటలో పడుతున్నావా (సరోజతో) ఏయ్ అబ్బాయ్! నీకు బుద్ధిలేదూ! ఆపదానికి అంత దగ్గరగా నిలబడతావేం! మింగేసుంటిరా పిచ్చి నాన్నా! (ప్రకాశంతో) ఏయ్ అమ్మాయ్! ఏమిటా కులుకు! ఆహాహా—ఏమి వయ్యారం! నిన్ను చూసి మోసపోతారనేగా! బుద్ధిగా బ్రతుకలేవు కేం! మొగణ్ణి మాలకూర్చిపెట్టి బజార్లో విరవిహారానికి బయల్దేరావ్. బుద్ధిలేదూ ఖబడ్దార్! ఎవరనుకున్నావో! ఆఫీసర్ని! నా దగ్గర నీ పప్పులేం ఉడకవ్! తెలిసిందా! (సరోజతో) ఎవరితను?

: నేనెవరో నీకు తెలియదూ? ఈ ప్రపంచానికి అధిపతిని. ఆడా మగా కలిసివుంటే జనసంఖ్య పెరిగిపోతుందని, ఆడని మగని విడదీసి, విడివిడిగా ఎవరిరాజ్యాలు వాళ్ళకివ్వాలని ప్రయత్నాలు చేస్తున్నాం. దానికి సంబంధంగా ఒక డిపార్టుమెంటు వేసి సూపర్ విజన్ స్వయంగా మనమే చేస్తున్నాం.

స : నన్ను మోసంచేశాడే భాస్కరం...

ప్ర : అతనేనా యితను!

స : అవును పాపం పండిపోయి పిచ్చివాడయ్యాడు. అలాంటి వాడు యిలా పిచ్చివాడుగా మారటం ఆశ్చర్యంగా లేదూ!

పి : ఏమిటీ...నేను పిచ్చివాడినిట్రా పిచ్చివాన్నా. అవునులే! పిచ్చివాడి కళ్ళకు సృష్టంతా పిచ్చి పిచ్చిగానే కన్పిస్తుంది. రేపు మేము అఖిల ప్రపంచ పిచ్చివాళ్ళ మహాసభను ఢిల్లీలో జరుపుతాం. నిన్ను ఆ సభకు అధ్యక్షుడిని చేస్తాంలే, భయపడకు!

ప్ర : ఇతన్ని చూస్తుంటే యీ జీవితం ఏమిటా అన్న ప్రశ్న కలగటం సహజంకదూ!

పి : శుద్ధ అసహజం. అసలు ప్రపంచాన్ని గురించి సృష్టిని గురించి, జీవితాన్ని గురించి మాట్లాడే అధికారం నీకెవరిచ్చారు! ప్రపంచంలో కోట్ల కోట్ల జీవరాసుల్లో నీవూ వొకడివి అంతే!

స : ఇతను పిచ్చిలోనే అప్పుడప్పుడు వేదాంతం మాట్లాడుతూంటాడు ప్రకాశ్!

ప్ర : అవే అప్పుడప్పుడు శుద్ధ నిజాలవుతుంటాయి.

ప : బాగా చెప్పేవురా పిచ్చివాన్నా! ఎలాగైనా నీవూ పిచ్చివాడివేగా! జీవితమన్నది నిరాకారమైన వస్తువు. నీ మనస్సును పట్టి, నీబుద్ధినిపట్టి నీ జీవితరూపం ఏర్పడుతుంది. జీవితమంటే ఏమిటో అనుభవిస్తే తెలుస్తుంది గాని ఆలోచిస్తే బోధపడ్తుందట్రా పిచ్చివాన్నా! నువ్వు పిచ్చివాడివి. లోకమంతా నీకు పిచ్చిగా కనిపిస్తుంది చెడ్డవాడికి చెడ్డగా కన్పిస్తుంది. మంచివాడికి మంచిగా కన్పిస్తుంది. పాపం! జీవితానిదేం తప్పుంది! దానినీ ఒక దృష్టితో చూడలేని నిన్ననాలి. ఛీ! ఛీ! నీవు పిచ్చి వెధవ్వి! నీతో నాకు మాటలేమిటి! వెళ్ళు వెళ్ళవూ! అయితే నేనే వెళ్ళి పక్కింట్లో పారాహుషారుగా పాడుకొస్తాను. (గాలిలో దూసుకొంటూ బయటికెళ్ళాడు.)

ప్ర : (పిచ్చివాడు పోయినవైపే చూస్తూ) నిజమే. నీవు చెప్పిందీ కొంత వరకు నిజమే: సరూ!

వెళ్ళాను. ఈ వాతావరణంలో నేనిక వుండలేను. అయితే నీ జీవితం యిక యిలా గడచిపోవలసిందేనా సరూ! (లోపలినుంచి సూరి వస్తాడు)

: ఇక్కడున్నావా అక్కా! అదేమిటి! మీరిద్దరేదో చాలా సీరియస్‌గా వున్నారు!

ఏం లేదు సూరీ! యీ రూమ నాకు తెలిసినవారు నా జీవనమందారాలు యీ నవద్వారాన వికసించాయి. నా బ్రతుకులో అనుభూతిధారలు యీ నవద్వారానే వర్షించాయి. జీవితపు తొలి రోజులను తల్చుకొంటున్నాం.

ఈ రూం నీకు తెలుసా! ఈ రూమనుగురించే నీకు నేను చెప్పింది. ఈ రూమ మనకు సహాయం చేయటానికి వొప్పుకొన్నారక్కా! అన్నట్లు— నీకోసం మధుబాబు నీ గదిలో కూర్చుని వున్నారు. ఇంతసేపూ యిక్కడే వున్నావా!

అవును సూరి! అమ్మతో మాట్లాడి నీకోసం యిక్కడికొస్తే యీ రూమ వున్నారు. (లోపలినుంచి మధు వస్తాడు) రా మధూ! చాలా సేపయిందా వచ్చి!

పర్వాలేదు సరోజీ! నీవెక్కడికన్నా పోయావేమోనని నీ గదిలో నే కూర్చొని అలా బజారుకు పోయి మళ్లీ వద్దామని బయల్దేరేను. (ప్రకాశ్‌తో) యీ మేనండీ నేను చెప్పిన నామె పేరు సరోజ. చాలా సంతోషిస్తున్నాను

నిజంగా ఆనాడు నువ్వు చేసిన మేలు యీనాటికే కాదు—ఏనాటికీ మర్చిపోలేను. అటువంటి నిన్నొదిలి వెళ్ళానికే కష్టంగా వుంది. అయినా తప్పదు. రేపు నేను హైద్రాబాద్ వెళ్తున్నాను. నీవా! దేనికి మధూ!

మా నాన్న దగ్గరనుంచి ఉత్తరం వచ్చిందీ వేళ. ఇక్కడ నేను చెడు తిరుగుళ్ళు తిరుగుతున్నానని ఆయన కెవరో చెప్పేరట!

పోనీలే మధూ! ఈ కలుషిత వాతావరణంనుంచి వెళ్లటమే మంచిది.

అందుకని—అదీ చదివే చదువేదో అక్కడే చదువమన్నారు. రేపే వచ్చి తనే స్వయంగా తీసుకెళ్తానన్నారు. నాకూ వెళ్లాలని వుంది. ఎలాగైనా అది సిటీ! అక్కడ జీవితమే వేరు. ఫస్ట్ క్లాస్ యింగ్లీషు పిక్చర్స్. షికార్లు, నాటకాలు, మీటింగులు, డాన్సులు......వాతావరణమే వేరుగా వుంటుంది. అందుకే నాకు సిటీలైఫ్ అంటే యిష్టం ఏమంటారు ప్రకాశరావుగారూ!

మీరు హైద్రాబాద్ వెళ్లేది చదువుకోటానికనుకొంటాను. చదువుసంగతి మాట్లాడకుండా సిటీలైఫ్ నుగురించి మాట్లాడుతున్నారు.

మ : పోయేది చదువు చెడగొట్టనే ననుకోండి. కాని మనం ఎల్లకాలం చదువుతామండీ! 'Student life is most happiest life in the world!' అన్నారు పెద్దలు. చేయిజారితే మళ్ళీ తిరిగి వస్తుందా యీరోజు! చెప్పేను కదండీ నా మనస్తత్వం! అందినంతవరకు అనుకొన్నంతే ఆనందించటమే!

స : ఏమైనా ఈ క్షణికానందాలు శాశ్వతంకావు మధూ! గట్టిగా చదివి పైకిరా!

మ : నీవు చెప్పేది విననా ప్రయత్నిస్తాను సరోజా! నన్ను నరకంనుంచి రక్షించావు

స : దాని కేముందిలే మధూ! నేను చేసిన పాపాలను లెక్కవేస్తే అందులో నేను నీకు చేసిన ఈ సహాయం ఒక లెక్కలోనిది కాదు.

ప్ర : నీవే ధన్యవు సరూ! ఈ నవరూపంలో ఎన్ని చెప్పరాని పాపాలు చేసినా ఒక్క మహత్కార్యాన్ని చేశావు నేను వెళ్లొస్తాను.

స : ఆగండి మాస్టారూ! మీరు వెళ్తే ఎలా! మీ కెవ్వరికీ అసలు విషయాలు పట్టినట్లు లేదక్కా! మధు బాబూ! మీ ఆనందం కొంతవరకు ప్రస్తుతం మీ రక్షణలో వున్నారు.

మ : నే నపాయంలో వున్నానా!

స : అవును. వీరయ్య మిమ్మల్ని తన్నాలని ప్లాను వేసుకొన్నాడు. కొండయ్యను మీకోసం పంపించాడు కూడా!

మ : నే నతనికేం అపకారం చేశాను!

స : పాముకు పాలుపోయటమే అపకారం అవుతుంది మధూ! ప్రకాశ్—నాకొక చిన్నకోరిక వుంది. కాదనవు కదూ!

ప్ర : ఏమిటో అది!

స : పతితనైన నా ఆతిథ్యాన్ని స్వీకరించమని అడగటం తప్పయినప్పటికీ—అపవిత్రమైన నా గదిలోనికి అడుగుపెట్టి పవిత్రం చేయవలసిందని కోరుతున్నాను.

ప్ర : నీ వనుకొన్నంత పవిత్రుడిని కాకపోయినప్పటికి నీ కోరిక కాదనలేను సరూ!

స : ధన్యురాలిని. మధూ! మళ్ళీ రేపు కన్పించకుండా వెళ్తావు కాబోలు—ఆఖరి తడవ నా చేతికాఫీ తాగి పోదువుగాని రా! సూరీ—నీవుకూడా రా!

సూ : (కొంచెం ఇష్టంలేనట్లుగా) నేను రాను—మీరు వెళ్ళండి. కాసేపు రేడియో విని వస్తాను.

స : సరే—నీ యిష్టం! (సూరి తప్పితే మిగతావాళ్ళందరూ లోపలికి వెళ్తారు. సూరి రేడియో తిప్పుకొని కూర్చొంటాడు. కొంచెం సేపయిన తర్వాత వీరయ్య బయటినుంచి వస్తాడు.)

(వస్తూనే పెద్దగా అరుస్తూ) ఒరేయ్ సూరీ — సూరిగా!

: (రేడియో ఆపేసి) కొంచెం మర్యాదగా రానీయ్ మాటలు!

ఇదెప్పటినుంచి రోయ్! మర్యాదగా రానీయాలనే మాటలు! ఇప్పుడు నీకేం మర్యాద తక్కువ చేశానురా బాబూ!

: నీవు నన్ను 'ఒరేయ్ గిరేయ్' అని పిలవకు. నిన్ను ఒరేయ్ అని పిలిస్తే నాకు ఒరిగేదేమీ లేదు లేరా!

: ఆ! నీవూ నన్నేం గౌరవించనక్కర లేదు. నీకన్నా నేనేం తక్కువ వాడిని కాదు.

కాదులే — నీవే గొప్పవాడివి కాని — ఆ ప్రకాశం బాబుకాని, ఆ మధుగాడు కాని వచ్చారా ఇప్పుడు!

: అదుగో మళ్ళీ! మధుబాబును మధుగాడని పిలుస్తున్నావేమిట! ఆయన చదువుకొన్నవాడు, డబ్బున్నవాడు, పరువు మర్యాద లున్నవాడు! పరువు మర్యాద లందరికి వున్నాయి లేరా! ఆయనకి డబ్బుంటే ఎవరికిస్తున్నాడు? చదువుకొంటే ఎవరికొక్కువాలి?

: నీవు కావాలంటే మాత్రం వస్తుందిటలేగాని — అందరిని అనవసరంగా అమర్యాదగా మాట్లాడకు.

ఒయబ్బో! వాడినంటే నీకు కోపం దేనికిరా!

: అతను మా యింటికి వస్తుంటాడు గనుక! మా యింటికి వచ్చేవాళ్ళను అమర్యాద చేయటానికి కాదు నీ విక్కడుండేది.

కాణీయిచ్చేవోడు యీ యింటిగడప తొక్కకుండ మొంగుకుంటాం!

: (ఉద్రేకంగా) మా యిష్టం. ఇది మా యిల్లు. అతన్ని రానిస్తాం, పోనిస్తాం. నువ్వెవరివి అడగటానికి?

(కోపంగా) సూరిగా! అనవసరంగా నన్ను రెచ్చగొట్టి నాకు కోపం తెప్పిస్తున్నావు. ఇది నీ యిల్లయినా యీ యింటి వ్యాపారంలో నాకూ భాగముంది. ఆ మధుగాడు మీ యింటి గుమ్మం తొక్కితే కాళ్ళిరగ్గొడతాను, ఎవడడ్డొస్తారో నేనూ చూస్తాను.

: నేను చూస్తాను ఎలా విరగ్గొడతారో! అతను మా యింటికి రావటం యిష్టం లేకపోతే, యిష్టం లేని వాళ్ళే మా యింటికి రావటం మానెయొచ్చు.

(కోపంతో వూగిపోతూ) సూరిగా!

: (ఉద్రేకంతో) అంతే...! ఆ మాటకొస్తే మా యింట్లో యీ చీకటిపాపాలు జరగటానికివీల్లేదు. తెలిసిందా! మీరీయింట్లో నుంచి వెళ్ళండి ముందు.

వీ : సూరిగా...! (సూరి చెంప మీద చెళ్ళుమని కొట్టాడు. లోపల నుంచి అప్పుడే వస్తున్న ప్రకాశం యిది చూసి కోపంతో వుడికిపోతూ వీరయ్యను కొట్టాడు.)

ప్ర : బుద్ధిలేదూ! కుర్రాడిని కొడ్తావా!

వీ : (కోపంతో. బాధతో, ఉద్రేకంతో చేతులు నులుముతూ) ప్రకాశం బాబూ!

ప్ర : ఏం! నన్ను కొడ్తావా!... కొట్టు వీరయ్యా! కాని—ఆ పిల్లవాడిని కొట్టిన తప్పుకు పరిహారంగా నేను కొట్టిన యీ దెబ్బ చాలదని గుర్తుంచుకో!

వీ : (కోపాన్ని అణుచుకుంటూ) ఇంకొకరైతే యీ పాటికి రక్తం కళ్ళచూసివుండేవాడిని.

సూ : ఏమైనా కానివ్వండి మాస్టారూ! నాకీ జీవితం మీద, యీ పడుపు వృత్తితో సంపాదించే ధనం మీద ఆశలేదు. నేను అడుక్కొని తినగలను కాని యీ పని చేయలేను. ఈ పాపకార్యాలు మాయింట్లో జరుగనివ్వను. అతనికిష్టమైతే ఆ వృత్తికి సంబంధించిన వాళ్ళను తీసికొని యీ యింటినుంచి మమ్మల్ని వదిలి వెళ్ళమనండి.

ప్ర : విన్నావా వీరయ్యా — అతని మాటలు! చిన్న కుర్రాడికున్న పాటి బుద్ధి నీకు లేదూ! ఇన్నాళ్ళబట్టి నీవు నేనంటే గౌరవం చూపిస్తుంటే మంచి వాడివనుకొన్నాను. కాని నీ నిజరూపం యిటువంటిదని. నీ బ్రతుకు యింత నీచమైనదని తెలీదు.

వీ : ఏందండీ — నీచం — నీచం అంటున్నారు! నీచం చేయకపోతే డబ్బెలా వస్తుంది?

సూ : అందుకని ఆడవాళ్ళ ద్వారా సంపాదించటం మగాడి లక్షణమేమో కనుక్కొండి!

వీ : (కోపంగా) నీవూ మాట్లాడతావేంరా—సూరిగా!

ప్ర : వీరయ్యా — ఒక్క మాట అడుగుతాను! అంత వొళ్ళుందే! చాకిరిచేసుకొని బ్రతక్కూడదూ?

వీ : ఆ మాట అందరూ చెప్పేవాళ్ళేనండీ! చాకిరీ చేద్దామనేవాళ్ళకే పనుల్లేక చస్తుంటే, నేనూ అబాధ లెలా పడేది! చాకిరి చేసేందుకు చాలీ చాలని అరాకలి బ్రతుకులేగా! అందుకే యీ వృత్తిలో చేరి అలవాటు పడ్డాను. అయినా యిందులో తప్పేముంది! ఇష్టపడి ఆడవాళ్ళొస్తున్నారు. మగవాళ్ళూ యిష్టపడి వస్తున్నారు. కాకపోతే వాళ్ళకి వీళ్ళకీ మధ్య పొత్తుకలిపి, అందరినీ తృప్తిపరచి మేమూ బ్రతుకుతున్నాం.

ప్ర : అంతేనా వీరయ్యా! నీ గుండెమీద చేయి వేసుకొని, హృదయపూర్తిగా చెప్పు. ఇందులో నైచ్యం వుందో లేదో!

లేకేం బాబూ—వుంది గనుకనే...(చెంపలు తడుముకొంటాడు.)

అదొక లెక్కలోనిదికాదు. నే చెప్పేమాట విను. ఆమెకు యిష్టంలేని ఆ పాపపు పని బలవంతంగా చేయించటం తప్పుకాదూ! ఓసారి తప్పటడుగువేసి పాపంచేస్తే ఆ పాపానికి నిష్కృతి లేదా! పరిహారం వుండదా!—(బతుకుమీద నిరసన్న లాంటి కోరికలే ఆమెకూ వుంటాయని మర్చిపోతున్నావు వీరయ్యా!

లాభం లేదండి. మీ రెన్ని చెప్పినా దీన్ని మటుకు నేను పోనివ్వను.

నువ్వు పోనిచ్చేదేమిటో నేనూ చూస్తాను.

ఏందిరా నువ్వు చూసేది! గవర్నమెంటు లెక్కల్లో యిది కొండయ్య పెళ్ళాం. వాడిని వదిలి ఎట్లాపోతుందో నేనూ చూస్తాను. వూరి పొలిమేర దాటితే దీని కాళ్ళు విరిగిపోవూ!

వీరయ్యా!

లాభం లేదండీ! అనవసరంగా మీ మర్యాద పోగొట్టుకోకండి.

పోనీలే ప్రకాశ్! ఎవరి ఖర్మకు ఎవరు బాధ్యులు నా బ్రతుకిలాగే గడచిపోతుంది. పో ప్రకాశ్! ఈ దుష్టవాతావరణంలోనుంచి సౌందర్యవంతమయిన ప్రకృతిలోకి నీ జీవితాన్ని సాగదీసుకో! బ్రతుకును సుఖవంతం చేసుకో! ఇదే ప్రకాశ్ నా కోరిక! రా నూరీ—లోపలికి.

నువ్వూరుకో అక్కా! వీడి సంగతేమిటో నేను తేలుస్తాను.

ఇది సమయంకాదు—రా నూరీ! (బలవంతంగా లోపలికి తీసుకెళ్తుంది.)

ఇటువంటి విషయాల్లో మనం జోక్యం కలుగచేసుకోటం మంచిదికాదు బాబూ! ఇది కేవలం భార్యాభర్తలమధ్య సంగతి!

(ఉద్రేకంగా) కాదు. భార్యాభర్తలమధ్య తగాదా కాదు. ఒక మనిషి జీవితాన్ని సంఘంలో బంధించే సంకెళ్లు విరించి, ఆ జీవి బ్రతుకుతో ఆడుతున్న చెలగాటం!

మీ మాటలు నాకేం అర్థం కావటం లేదూ! అయినా అది కొండయ్య భార్య.

(ఉద్రేకంగా) కాదు.

కాదూ! మీ రెవరామాట అనటానికి! అంటే మటుకు ఎలా చెల్లుతుంది! కోర్టులా వొప్పుకొంటుంది!

అన్నీ వొప్పుకొంటాయి...ఆమె..నాభార్య.. మీ భార్య!!!

అవును వీరయ్యా! ఎన్నో ఏళ్ళనాడు నన్ను విడిచి లేచిపోయింది. మళ్ళీ యీనాడు యీ స్థితిలో కల్సుకొన్నాం!

వీ : (తగ్గుస్వరంతో) ప్ర...కా...శం బాబూ!

ప్ర : నిజం వీరయ్యా!

వీ : అలాగయితే నేను మీ మాట కాదని చెప్పలేను. ఇందులో నిజానిజాలతో నాకు పనిలేదు. కాని ...(ప్రకాశం బాబూ! ఒక్క విషయం గుర్తుంచుకోండి! చేసిన జీవితాను బాగుచేద్దామన్న ఉద్దేశ్యంతో, చేతులారా మీ జీవితాన్ని చెడగొట్టుకోకండి. ఉల్లిని మల్లెపూల చెండులతో చుట్టినా వుల్లి వుల్లిగాక మల్లెవుతుందా?

ప్ర : మంచిది వీరయ్యా! కాని...అనూరి విషయం ..

వీ : ఇంతదూరం వచ్చాక వాడితో నాకేం పనండీ! ఇక్కడకాకపోతే యింకోచోట పొట్టపోసుకోగలను. వారిష్ట మొచ్చినట్లు చేసుకోమనండి కాని ప్రకాశం బాబూ! మీ మీద ప్రేమకొద్దీ, గౌరవంకొద్దీ మళ్ళీ అడుగుతున్నాను. నేను చెప్పిన విషయాలు బాగా ఆలోచించండి. వస్తాను. [వీరయ్య వెళ్తాడు. ప్రకాశం మొహం మారిపోతుంది. ఏవేవో భావనా పరంపరలు మొహంలోకి అలలలలుగా వచ్చిపోతుంటాయి. ఏం చేయటానికి ఎటుపోవటానికి తోచదు. ఏదో ఒక విషయాన్ని గురించి ఒక నిశ్చయానికి రాలేనివాడుగా కన్పడుతాడు. కాస్సేపు యీ సంఘర్షణలో నలిగిపోయి తుదకు ఒక నిశ్చయానికొస్తాడు. బయటికి పోబోతాడు. బుర్రకు జ్ఞాపకం వస్తున్న మాటలే బయటినుంచి గొంతుల ద్వారా చుట్టూ విన్పిస్తాయి [తను అచ్చూ నిజంగా సాలెగూడులో యిరుక్కొన్న వాడిలా—తనచుట్టూ ఆలోచనల దారాలు పెనవేసుకొంటున్నట్లుగా బాధపడ్డాడు. అతికష్టంమీద ఆ సాలెగూడును వదిలించుకొని ఒక స్థిరనిశ్చయానికొచ్చి 'సరూ—సరూ!' అని పెద్దగా పిచ్చిగా కేకవేస్తాడు. లోపలినుంచి సరోజ వస్తుంది.]

ప్ర : (స్థిరమైన గొంతుతో) రా—సరూ! నా జీవితధ్యేయమేమిటో తెలుసుకొన్నాను. జీవితపంజరాలకు భయపడి పారిపోయి పిరికివాడిని కాలేను. భయంకరమయిన యిటువంటి సాలెగూళ్లలో యిరుక్కొని బయటికి రావటానికి వీలులేక బాధపడుతున్న నీలాంటి పతితలను వుద్ధరించటానికి, జీవితమనే సాలెగూడులోకి జొరబడటానికి నేను భయపడను.

స : (ప్రవహిస్తున్న ఆనందబాష్పాలతో శూన్యంలోకి చూస్తూ – అస్పష్టంగా) ఈ రూపంలో నా జీవితానికి విముక్తి ప్రసాదించావా భగవాన్...

(తెరపడుతుంది.)

# కలగూరగంప

## భాస్కర రామాయణకర్త తకతోల భాస్కరకవియే

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

రామాయణము రచించిన భాస్కరుని గూర్చిన వాదములు నేటికిని ఇంకను సమయలేదు. ఇటీవల వెలువడిన 'కుమార రుద్రదేవు'డను గ్రంథమున గూడ ఈ చర్చ మిగులగా సాగినది. 'కవితరంగిణి' కర్తల వాదమును ఇచ్చట పరిశీలింపుడు :

"భాస్కర రామాయణమునుగూర్చి యింకను బరిశోధనము విశేషముగా గావలసియున్నది. (2-70)

"మంత్రి భాస్కరుడు పండ్రెండవ శతాబ్ది (క్రీ. శ. 1175 ప్రాంతము) నాల్గవ పాదమునను, పదమూడవ శతాబ్ది (క్రీ. శ. 1225 ప్రాంతము) ప్రథమ పాదమునందు నున్నాడని చెప్పవచ్చును. ఇతని నివాసము గుంటూరు అని తిక్కనయే చెప్పియున్నాడు. (2-127)

"మంత్రి భాస్కరునకు మల్లన యను కుమారుడున్నమాట సత్యమే కాని యాతడు కవియని చెప్పుటకాధారములు లేవు."—ఆంధ్రకవి తరంగిణి. (2-217)

ఇప్పుడీ గుంటూరు భాస్కరమంత్రికి తోడుగా తకతోల భాస్కరమంత్రి యొకడున్నట్లు తెలంగాణా శిథిలశాసనభాగమువల్ల తెలియుచున్నది. ఇరువురికి మల్లన-మల్లయ లను కుమారులున్నారు. కాని ఇంటిపేర్లు మారియున్నవి. నివాసస్థలములు గుంటూరు, వరంగలు జిల్లాలుగా వేరుపడియున్నవి. ఏకశిలానగరమను వరంగల్లప్పుడు కాకతీయుల రాజధానిగా నుండెడిది. తెలంగాణా శిథిల శాసనములో క్రింది చరిత్రాంశములు కనబడుచున్నవి.

[శ్రీ] కాకతీయాన్వవాయ మానసజ్జ [*తి] దన్వయ క్షీరనిధా మహా [రాః] ర్రాజేందు రాసీద్గణ [పతి (తీ) ధీ] శః—

సర్వాశాహృదం కలయతి కలానా [*ం] వేద తుల్యా ధి (శ్రీ)— సన్మిత్రం వాసీ [(ద్గ) తక్క]తీ తకతోల భాస్కర మంత్రివర్యః—— సకల స్వామి [కా] ర్యాణ్యపి లక్ష్మ్యాశ్రయాశః [శి?] శి [వ?] సద [*స]రాగాంభోజ చిత్రద్విరేఫః తత్పుత్రోయం— మంత్రిమల్లశ్చ— (ప్రష్టా——సద్ధర్మమూర్తిర్యయ్య గేస్మి(న్)————————.

——తెలంగాణా శాసనములు (97-99)

ఈ ధర్మసాగర శిలాశాసనమున తకతోలి మంత్రి మల్లయ కాకతీయ గణపతి సమకాలికుడని నిస్సందేహముగా చెప్పుచున్నది. ఇతని తండ్రి తకతోల భాస్కర మంత్రి స్వామి కార్యనిర్వాహకుడు, కళావేది కూడ దీర్ఘజీవియగు కాకతీయ గణపతి రాజ్యావసానకాలపువాడే కాబోలును.

గుంటూరు భాస్కరమంత్రిపుత్రుడు మల్లనయు కాకతీయ గణపతికాలమువాడే కాబోలన్న ఇతని తమ్మనిపుత్రుడు తిక్కయజ్వ క్రమముగా రుద్రదేవ రాజ్యావసానకాలమువాడగునేకాని, కవి చరిత్రకారు లూహించినట్లు కాకతీయ గణపతికి సమకాలికుడగ వీలు లేదు. తాతయు, తండ్రియు మనుమడును సమకాలములో యుక్తవయస్కులగుట సంభవము కాదు. అపరూపము.

కవి చరిత్రకారులు నిశ్చయించినట్లు తిక్కన కాకతీయ గణపతి రాజ్యపాలన కాలములోని వాడని తీర్మానించిన యెడల అతని తాత గుంటూరు భాస్కర మంత్రి క్రీ. శ 1158-95 ప్రాంతమందలి కాకతీయ రుద్రదేవరాజు కాలమువాడె రామాయణ కావ్యకర్త కానోపు. అప్పుడు కృతిపతి మారయ సాహిణి కాలము కలసిరాదు. కావున, భాస్కర రామాయణ కావ్యకర్త తిక్కన తాత భాస్కరమంత్రి కాడనియు, తదన్య భాస్కరమంత్రి భాస్కర రామాయణం కావ్యకర్త కాబోలనియు నేర్పడుచున్నది. గుంటూరు— తకతోల ఇంటిపేర్లు గల యుభయ భాస్కరులకు భిన్నములుగా

తలిదండ్రుల ఆప్తు, అంశం, రక్తం, సంస్కారం—ఎన్నో అవసరం. పిల్లలను జాగ్రత్తగా పెంచటం వ్యక్తులకానందదాయకం, కుటుంబానికి శ్రేయస్సు అయినట్లే దేశానికీ మంచిది. ఆరోగ్యవంతమైన జాతి దేశభవిష్యత్తుకు పునాది. ఇట్టి సమష్టి దృష్టితో ఈ వైజ్ఞానిక గ్రంథం వ్రాయబడింది. పిల్లలను పెంచటంలో ఆరోగ్యసూత్రాలు, సాంఘికసూత్రాలు, మనస్తత్వదృష్టి తప్పనిసరిగా అవసరమవుతాయి. మరీ మనదేశంవంటి దేశాల్లో ఆచారాలనీ, సంప్రదాయాలనీ, ఇంటిపద్ధతి అనీ అనేకం పాటిస్తారు. చివరకు జబ్బుల విషయంలోకూడా ఇటువంటి నమ్మకాలు కొందరికి ఉంటాయి.

ఈ గ్రంథం ఆయా వానిని దూషించకుండానే—అభివృద్ధి అయిన విజ్ఞానశాస్త్రాన్ని ఉపయోగించుకోమంటుంది. బిడ్డ పుట్టినప్పటినుండి తల్లి ఏయే జాగ్రత్తలు చూపవలెనో ఇందు ఆరోగ్యకరంగా చెప్పబడింది. తల్లి పరిశుభ్రంగా పాలివ్వటం, పోతపాలు వాడినచో ఏవి ఎట్లియ్యవలసినది, ఏడాది నిండినపిల్లలకిచ్చే ఆహారం ఆరోగ్యంగానున్న బిడ్డదేహ పుష్టి మొదలగు విషయాలు చర్చింపబడినవి. అంటువాపు, కోరింతదగ్గు, స్ఫోటకము, ఆటలమ్మ, పొంగు, గవదబిళ్లలు, విషజ్వరము, పక్షవాతము, కుష్ఠు, గజ్జి, తామర, అక్కి మొదలగు పిల్లల అంటువ్యాధులును, వాని నివారణోపాయాలును చెప్పబడినవి. పిల్లలకు వచ్చే క్షయను గూర్చి ఒక అధ్యాయమున్నది. అంతేకాదు సామాన్యంగా పిల్లలకు వచ్చే గుణములేదా ఈడ్పు, అతిసారము, పడిసెము, చెవినొప్పి, కండ్లజబ్బు, చూపుదోషము, టాన్సిల్స్—అడినాయిడ్స్, కడుపునొప్పి, ఒళ్ళుపేలుట—సెగకురుపులు, ఏనుగుగజ్జి, కడుపులో పాములు, గుండ్రనిపాములు, నులిపురుగులు, కొక్కిపురుగు, ఏలికపాము, బల్ల ఎండిపోవుట, ఉబ్బసచీకటి, రికెట్స్, స్కర్వీ, బాలసంజా మొదలగువానిని గూర్చి వివరంగా చర్చ ఉన్నది. పిల్లలకు సంభవించే ప్రమాదాలు, విషపదార్థాలు వేరొక అధ్యాయంలో చెప్పబడినవి. పిల్లల ఆటలు వినోదమును గూర్చి జబ్బుచేసినపుడు వారి ఆటపాటలను గమనించవలసిన విధానం, పిల్లలమనోభావాలు. వారికి నేర్పదగిన సదభ్యాసాలు, కూర్పులు, పిల్లలకు కలిగే అంగవైకల్యాలు మొదలగు విషయాలెన్నో వివరింపబడినవి.

అక్షరజ్ఞానంకల అందరూ చదువుకొనగల సరళమైన రచన. పురుషులందరూ అవశ్యంగా చదువదగిన విజ్ఞానగ్రంథం. ఇట్టి గ్రంథప్రచురణకు దోహదం చేసిన దక్షిణభాషా పుస్తకసంస్థ వారిని, సరళమైన అనువాదం చేసిన శ్రీమతి కృష్ణారావుగారిని అభినందించక తప్పదు.

## The Astrological Self Instructor

ప్రొఫెసర్ బి. సూర్యనారాయణరావు. ప్రకాశకులు: ది ఆస్ట్రాలాజికల్ ఆఫీస్ బసవన్ గుడి, బెంగుళూరి - 4. వెల 5 రూపాయలు.

జైమినీయము, నాడీ సంప్రదాయము, పరాశర పద్ధతి మొదలుగాగల అనేక మార్గాలు భవిష్యన్నిర్ణయంలో జ్యోతిర్వేత్తలుపయోగిస్తున్నారు. వీటిలో పరాశరపద్ధతికే దక్షిణ భారతదేశంలో విశేషప్రచారం కనిపిస్తున్నది.

జాతక చంద్రిక, గోపారత్నాకరము, సర్వార్థచింతామణి మొదలయిన వి పద్ధతిలో ప్రధానగ్రంథాలు.

గాసట బీసటే చదివి జాతకాల ఫలితాలు చెప్పటం ప్రారంభిస్తే ప్రమాదాలు దొర్లటం సహజం. దీనికితోడు ఆయా పంచాంగాలలో గ్రహచలనాలలో కొన్ని కొన్ని తేడాలు కనిపిస్తున్నాయి. కొందరు రాశిచక్రం చూచీ చూడగానే ఫలితాలు చెప్పటం ప్రారంభిస్తారు. జ్యోతిశ్శాస్త్రంలో ప్రస్తావించిన ఆయా గ్రహాల బలాబలాలు సరిగా నిర్ణయించినప్పుడు సామాన్యంగా ఫలితం తప్పదు.

ఈ విషయంలో శాస్త్రపాండిత్యం ఒక ఎత్తు. విశేషానుభవం ఒక ఎత్తు. ఇవి రెండు జోడించినవారే విఖ్యాత జ్యోతిర్వేత్తలు కాగలరు. ఈశాస్త్రం తరచి చూడని వారే 'సర్వం మిథ్య' అని కొట్టివేయటం జరుగుతున్నది.

ప్రొఫెసర్ సూర్యనారాయణరావుగారీ పుస్తకంలో జ్యోతిషంలో ప్రవేశించదగిన వారికి కావలసిన ఉపయుక్తవిషయాలన్నీ చేర్చారు. అంతేకాక వేర్వేరు జ్యోతిషగ్రంథాలలోనుండి సేకరించిన ద్వాదశ భావాల ఫలితాలు, విశేషయోగాలుకూడా చేర్చారు. ఆపైన గ్రంథం చివరిభాగంలో ప్రఖ్యాత పురుషుల జాతకచక్రాలు కొన్ని సేకరించారు. అప్పుడే 11 వ సారి ముద్రించిన ఈ పుస్తకం జ్యోతిష విద్యార్థుల కెంతయినా ఉపకరించగలదు.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**

Regd. No. M. 1856



## ప్ర   రేట్లు

| | రేట్ | కాంట్రాక్టు |
|---|---|---|
| 4 వ కవరు పేజి | | |
| 2 రంగులు | రు. 125/- | రు. 100/- |
| ఒకేరంగు | రు. 100/- | రు. 90/- |
| 2 లేక 3 కవరు పేజి | | |
| ఒకే (నలుపు) రంగు | | |
| **లోపలి పేజీలు** | | |
| పూర్తి పేజి | 70/- | |
| అర్ధ పేజి | | 30/- |
| పావు పేజి | 20/- | 15/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

వరుసగా 12 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

* కవులు, కళాకారులు, రచయితలు మొదలైన వారి ప్రకటనలు ఒకకాలం ఇంచికి లేపకు రు. 2/- చొప్పున ప్రకటించబడును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12-00 |
| 6 మాసముల చందా | ... | రు. 6-00 |
| విడి ప్రతి | ... | రు. 1-00 |

**మేనేజరు, భారతి,**
**మద్రాసు-1.**